# మాస నవలలు

(మీ కోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## తోలు బొమ్మ

రచన: వి. యస్. రావ్

## సునీత గీసిన బొమ్మ

రచన: వసుంధర

## బందిపోట్లు

రచన: భీమవరపు పురుషోత్తం

అన్వేషణ - తొమ్మిదవ భాగం

అపరాధ పరిశోధన సప్లిమెంట్—159
మార్చి, 1987
వెల: రు. 7-00
ఏడాది చందా: 84 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్:
శ్యామ దామోదర్ రెడ్డి

సంపాదక వర్గం:
ఏ. వీ. మోహన్రావ్
బొమ్మిడి అచ్చారావు
విద్వాన్ షీలాదేవి

కార్యాలయం:
అపరాధ పరిశోధన కార్యాలయం
నారాయణగూడ, హైదరాబాదు-29
ఫోన్-64843

ముద్రణ:
క్రాంతి ప్రెస్,
2, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్, మద్రాసు-1,

# తోలు బొమ్మ

ఎ. యస్. రావ్

చదువుతున్న న్యూస్ పేపర్ని విసుగ్గా టీపాయిమీదికి గిరాటేశాడు రంగనాథం.

వెధవ పేపర్లు. వ్యాపారస్థులకి సంతోషం కలిగించే వార్త ఒక్కటి కూడా వుండదు! పళ్ళు కొరుక్కుంటూ కరోనా సిగార్ వెలిగించి, పొగ ఊదుతూ, ఎదురుగా సోఫాలో పద్మాసనం వేసుక్కూచున్న భార్యని చిరాకుగా చూశాడు.

కూచున్న భంగిమ గజలక్ష్మి లావుని వెయ్యింతలు ఎక్కువ చేసింది! గోల్డు రిమ్డ్ అద్దాలగుండా తదేకంగా ఏకాగ్రతతో చదువుతోందామె. ఒళ్ళో పెట్టుకున్న ప్లేటు గిన్నెలోంచి, కారం తగిలించిన జీడిపప్పుని కుడిచేత్తో తీసి నోట్లో పోసుకుంటొందామె. నూనెలో వేగిన జీడిపప్పు ఆమె పళ్ళమధ్య కరకరలాడుతోంది.

రంగనాథం అసహనంగా లేచి, నించున్నాడు. భార్య వైపు ఆక్షేపణగా చూస్తూండిపోయాడు. గజలక్ష్మి అతని

ఉనికి గుర్తించనట్టే వుండిపోయింది.

"గజం, ఇప్పటికేనా కొంచెం ఎరుగు. ఆ చందమామలు మానేసి ఏ భగవద్గీతో, భాగవతమో, చివరికి పెద్దల నవలలో చదువు!" రంగనాథం కంఠంలో ఆక్షేపణ గంటలా మోగింది.

మరో పిడికెడు జీడిపప్పుని నోట్లోకి సరఫరా చేసి, మెల్లగా తలెత్తి భర్త వేపు అర్థం కానట్టు చూసిందామె. రబ్బరు బంతుల్లా వున్న ఆమె బుగ్గలు నెమ్మదిగా కదులుతున్నాయి.

"భగవద్గీతలూ, భాగవతాలూ చదవాల్సినంతగా ఇక్కడెవరూ ఉడిగిపోలేదు! ఇంక మీరు సిఫార్సు చేస్తున్న నవలల్ని, చచ్చు ప్రేమకథల్ని చదివే ఓపిక నాకు లేదు! నా మానాన నన్ను బతకనివ్వండి!" గజలక్ష్మి గర్జించింది.

రంగనాథం నిట్టూర్చాడు. ఏదో మాట్లాడబోయి, మానేసి, చుట్టని పళ్ళమధ్య ఇరికించాడు.

"ఆ వెధవ చుట్టలు మానేసి, ఆ ఖర్చుతో శుభ్రంగా తినండి. రోజు రోజుకి గెడకర్రలా అయిపోతున్నారు. మొగుడితో కలిసి ఎక్కడికేనా వెళ్ళాలంటే తలకొట్టేసినట్టుగా వుంటోంది. 'గుమ్మడికాయ పక్కన పొట్లకాయ!' అని మొన్న ఆ కుర్రముండ ఎవతో జగ్గారావు గారింటి పెళ్ళిలో అంటూంటే లోపల్లోపలే చచ్చిపోయాను!" గజలక్ష్మి కసిగా అంది.

"రోజులో పదిహేను గంటలు నాన్‌స్టాప్‌గా జీడిపప్పు నములుతూ కూచుంటే మనుషులు గుమ్మడికాయల్లా అవకుండా వుండరు!" రంగనాథం ఎగతాళిగా అన్నాడు.

గజలక్ష్మి నిప్పులు కక్కుతూ చూసింది. ఆమె దవడలు కదలడం మానేశాయి. "ఎవడబ్బసొమ్మూ తినడం లేదిక్కడ. నా అబ్బసొమ్మే తింటున్నా. మీరు తింటోందీ, చుట్టలరూపంలో తగలేస్తోందీ కూడా అదే!"

రంగనాథంకి మొహంమీద ఉప్పునీళ్ళు చల్లినట్టయింది. నిట్టూరుస్తూ, తమాయించుకున్నాడు. గజలక్ష్మి మరిచిపోకుండా రోజుకోసారి ఏదో విధంగా తను తెచ్చిన కట్నం గురించి పాతికేళ్ళుగా గుర్తుచేస్తూనే వుంది. ఆమె చేతిలో ఆ తురుపు వున్నంతకాలం తను తక్కిన పేకలా పడుండాల్సిందే....

"రెండో లేదీ కూడా గడిచిపోతోంది. మంత్లీ అకౌంట్స్ నాకు యింకా చూపలేదు!" గజలక్ష్మి కంఠంలో అధికారం ధ్వనించింది.

రంగనాథం నిప్పులు కక్కుతూ చూశాడు. "గవర్నమెంటు కూడా ఏడాదికోసారి ఆడిట్ చేస్తుంది. నీ నెలసరి ఆడిట్‌తో నా తల ప్రాణం తోకకి వస్తోంది. ప్రతి పైసాకీ లెక్క చెప్పలేక చచ్చిపోతున్నాను ఇదంతా చూస్తోంటే వ్యాపారం కట్టేయాలనిపిస్తోంది!"

"దివ్యమైన ఆలోచన! కట్టేసి మొత్తం పైకం పట్రండి. అయిదేళ్ళకి రెండింతలయ్యే ఇందిరాగాంధీ సర్టిఫికెట్లు కొనేస్తాను. మీ వ్యాపారంకన్నా అదే నయం!" గజలక్ష్మి హుంకరించింది.

రంగనాథం ఛాతీ పైకి లేచింది. ఆవేశంలో యేదో చెప్పబోయిన అతన్ని టెలిఫోన్ మోత అటకాయించింది. రంగనాథం కదలబోయాడు. బాసిపట్టు వేసుకున్న ఏనుగు కాళ్ళని కిందికి దించి గజలక్ష్మి ముందుకి వంగే ప్రయత్నం చేసింది. ఆమె కుడిచెయ్యి గున్నఏనుగు తొండంలా టెలి

ఫోన్ వైపు సాగింది.

"పోస్ట్!"

రంగనాథం గుమ్మంవైపు తలతిప్పి చూశాడు. తాళం తీసిన గేటుముందు సైకిల్ మీద పోస్టుమన్ అసహనంగా కూచున్నాడు.

"హలో....ఆ.... శేషే!" గజలక్ష్మి ఫోన్లోకి గర్జిస్తోంది. రంగనాథం ఇంట్లోంచి బైటికి నడిచాడు.

గేటువైపు అడుగువేస్తున్న అతన్ని చూడగానే పోస్టుమాన్ ఓ కవర్నీ, కాగితాన్నీ గేట్లోంచి లోపలికి చాచాడు.

"రిజిస్టర్. సంతకం చేయండి" అన్నాడతడు. రంగనాథం సంతకంచేసి, కాగితాన్ని అతనికి అందించాడు. మరో రెండు ఉత్తరాల్ని అతనికి అందించి, పోస్టుమన్ వెళ్ళిపోయాడు.

రిజిస్టరు కవర్ని రంగనాథం పరిశీలనగా చూశాడు. అపరిచితమైన దస్తూరీ. కవర్ నుంచీ ఏదో సువాసన లీలగా అతని ముక్కుకి సోకుతోంది. ఆ రకం సెంటు ఎవరు వాడుతారో అతనికి తెలుసు! కానీ, కవరుమీది దస్తూరి ఎవరిదో అతనికి అంతుపట్టడంలేదు...

వరండా మెట్లెక్కిపోతూ రంగనాథం అప్రయత్నంగా రిజిస్టరు కవర్ని జుబ్బా జేబులో దోపేశాడు. సోఫాలో యథాప్రకారం అష్టలక్ష్మి అవతారాల్లో గజలక్ష్మిలా కూచున్న భార్యముందు ఆగి, రెండు ఉత్తరాల్ని ఆమె పక్కనే పడేశాడు. ఆమె మొహం ఎందుకో ఎర్రగా, ఉబ్బినట్టుంది.

"ఎవ్రరాశారు?" అందామె ఉత్తరాల్ని అందుకుంటూ.

"ఇంకెవరు? ఒకటి మీ నాన్నా, ఒకటి నీ తమ్ముడూ!" అన్నాడతను విసుగ్గా. నెల నెలా వచ్చే ఆ ఉత్తరాల్లో ఏముంటుందో చదవకపోయినా అతనికి తెలుసు. చెరో వెయ్యి. రెండు వేలూ అర్జంటుగా పంపించమంటూ వచ్చే రెగ్యులర్ తాకీదులు!

కవర్లని తెరవకుండా గజలక్ష్మి అతని మొహంలోకి అదోలా చూసింది "ఎవడో దొంగముండాకొడుకు! తనకి లావుగా, బొద్దుగా వుండే ఆడాళ్ళంటే ఇష్టమంట! నా అందాన్ని అదే పనిగా...."

"ఎవడు వాడు?" రంగనాథం అడ్డుతగుల్తూ గద్దించాడు.

"ఎవరో నాకేం తెలుసు? ఎవరైతే ఏం? కట్టుకున్న మొగుడు చూడలేని సౌందర్యాన్ని చూడగలిగే కళ్ళున్న వ్యక్తి"!ఆమె తన ఉక్రోషాన్ని అతనిమీద సానపెడుతూ అంది.

రంగనాథం విసుగ్గా వెనక్కి తిరిగాడు. షాపు తాళాలూ, చిల్లర నోట్లూ వున్న లెదర్ బాగ్ ని అందుకుని, మౌనంగా గుమ్మం వేపు కదిలాడు.

"షాపు తెరవడానికి యింకా గంట టైం వుంది!" గజలక్ష్మి కంఠం వ్యంగ్యంగా అతన్ని హెచ్చరించింది.

రంగనాథం మాట్లాడలేదు. ఆ సంగతి అతనికి తెలుసు. జేబులో దాక్కున్న రిజిస్టర్డు ఉత్తరం అతన్ని త్వరగా షాపుకి, ఏకాంత ప్రదేశానికి వెళ్ళమంటోంది....

## 2

తన రొటేటింగ్ కుర్చీలో కూచుని, రంగనాథం జేబులోంచి కవర్ని ఇవతలికి లాగాడు. శ్రీకాకుళం కవరు మీది అక్షరాల్ని పరీక్షగా చూశాడు.

ఆ కవర్ని తనకి ఎవరు పంపించారో, ఆ సెంటు పరిమళం మౌనంగా చెప్తోంది. కానీ, ఇలా ఈ తరం రాయాల్సిన అవసరం, ఇలా రాసే అలవాటూ ఆ వ్యక్తికి లేవు! ఆలోచిస్తూ అతను కవర్ని చించాడు.

మూడొంతులు కిందికి లాగి వదిలిన పావు వట్టర్ని ఓసారి చూసి, కవర్లోంచి మడత పెట్టిన కాగితాన్ని ఇవతలికి లాగాడు. ఎర్రటి కాగితాన్ని ఆత్రంగా మడత విప్పాడు.

రంగనాథం ఉలిక్కిపడ్డాడు. వణకడం ప్రారంభించిన అతని చేతుల్లోంచి కాగితం ముందున్న కౌంటర్ మీద పడింది. టెలివిజన్ స్క్రీన్ మీద ఫ్రీజ్ అయిపోయిన ఏదో బ్లూ ఫిలింలోని సన్నివేశంలా రంగుల్లో అవుపిస్తున్న ఫోటోని రంగనాథం కంగారుగా చూశాడు.

తలగడమీద ఆమె బాబ్డ్ హెయిర్ వలలాగా పడింది. ఎర్రటి పెదవుల సందులోంచి ఆమె తెల్లటి పళ్ళు మెరుస్తున్నాయి. పెద్ద పెద్ద కాటుక కళ్ళు చిలిపిగా నవ్వుతూ మెరుస్తున్నాయి. బాగా కిందికి వాలిన తన మొహంలోకి ఆమె సంతృప్తితో చూస్తోంది. నగ్నంగా వున్న తన వీపుమీద ఆమె చేతులు చెట్టుబోదెని పెనవేసుకున్న సన్నటి తీగల్లా మెరుస్తున్నాయి. ఫోటో కింది భాగం మీదికి వాలుతున్న తన చూపుల్ని కంగారుగా పైకి మళ్ళించాడు రంగనాథం.

మంచం పక్కనే వున్న చిన్న స్టూలుమీద జాగ్రత్తగా పెట్టబడిన డ్యూరెక్స్ పాకెట్, ఫోటోలో అతని కళ్ళని పొడుస్తూ స్పష్టంగా అవుపిస్తోంది. రంగనాథం పెదిమలు ఎండిపోతున్నాయి. తడి ఆరిపోయిన నాలుకని, పెదాల మీదికి చాపే ప్రయత్నం చేశాడతను. ఫోటో పక్కనే

పడున్న ఖాళీ డ్యూరెక్స్ కవర్ని వణుకుతున్న కుడిచేత్తో పైకి తీశాడతను. అప్రయత్నంగా దాన్ని జేబులో వేసుకున్నాడతను.

ఫోటోలో వున్న తనూ, డ్యూరెక్స్ కార్టన్ — ప్రస్తుతం ఒకేచోట వున్నారు! ఫోటోలోవున్న మరో వ్యక్తి, రెండో వ్యక్తి మరో పావుగంటలో తనముందు ప్రత్యక్షమవుతుందని అతనికి తెలుసు....

రంగనాథం పిచ్చివాడిలా, మరోసారి ఫోటోని చూశాడు. ఎందుకో అతని కళ్ళు తిరుగుతున్నాయి. గుండెచుట్టూ ఏదో ఉక్కుపిడికిలి కర్కశంగా బిగుసుకుంటోంది. ఏకాంతంలో, అతిరహస్యంగా కలుసుకున్న తమని ఎవరు ఫోటో తీశారు? ఎవరు తనకి ఈ ఫోటో పంపించారు? ఎందుకు?

కదిపిన పుట్టలోంచి లేస్తున్న కందిరీగల్లా, కాట్లు వేస్తున్న కందిరీగల్లా తనలో లేస్తున్న ఆలోచనల్ని కంగారుగా దిగమింగే ప్రయత్నం చేస్తూ రంగనాథం ఫోటోని కవర్లోకి దోపాడు. ఖాళీగా వున్న ఎర్రటి కాగితాన్ని అయోమయంగా చూశాడు. మళ్ళీ ఫోటోని ఇవతలికి లాగి, వెనక వైపున ఆత్రంగా చూశాడు. అక్కడా ఏమీ రాయబడలేదు! ఏమీ రాయకుండా, ఫోటోనీ, డ్యూరెక్స్ కార్టన్‌నీ తనకి ఎవరు, ఎందుకు పంపించారు?

ఎవరు?

ఎందుకు?

అతని ప్రశ్నలకి సమాధానం యిస్తున్నట్టు, కౌంటర్ మీదున్న టెలిఫోన్ హఠాత్తుగా మోగింది. తటాలున ఫోటోని కవర్లోకి, కవర్ని జేబులోకీ దోపి, రంగనాథం

టెలిఫోన్ రిసీవర్ని అందుకున్నాడు.

"హ....లో...." అతని కంఠం ఎవరో కాలికింద నలిగిన బోదురుకప్ప కంఠంలా బొంగురుగా ధ్వనించింది.

"రంగనాథం?" ప్రశ్న అతని చెవిలో బుసకొట్టింది.

"....య....స్....ఎవరు?" అతిప్రయత్నం మీద అడిగాడతను.

"రిజిస్టరు కవర్ అందిందా?"

రంగనాథం ఉలిక్కిపడ్డాడు. చెమట చల్లటి కాలువలా అతని వీపుగుండా కిందికి జారుతోంది. రిసీవర్ని పట్టుకున్న అతని చెయ్యి గడగడ వణకసాగింది.

"ప్రశ్న వినిపించిందా?" అవతలి కంఠం దబాయించింది.

"ఎ....వ....రు....? మీరు...."

"సమాధానం చెప్పు!"

"....అ" రంగనాథం అప్రయత్నంగా అన్నాడు.

అవతలి కంఠం చిన్నగా నవ్వింది. "రంగనాథం, అయామ్ సారీ....ఇంకా క్లియర్ గా, అకర్షణీయంగా ఫోటో తీయడానికి వీలుపడలేదు. అనుక్షణం నీ శరీరం నాకు అడ్డుతగుల్తూనే వుంది! అన్నట్టు...."

"ఎవరు .... నువ్వు?" రంగనాథం బొంగురుగా అరిచాడు.

"ఎందుకేనా మంచిదని, కవర్ నీకు డెలివరీ అయ్యేముందు నీ భార్యని టెలిఫోన్లో పలకరిస్తూ, ఆమె దృష్టిని మళ్ళించాను! అవసరమైతే ఈ సారి నీ సమక్షంలో, ఫోటో మరో కాపీ, నువ్వు వాడి గిరాటేసిన డ్యూరెక్స్ కండోమ్—రెండూ నీ భార్యకి బట్వాడా అయ్యేలా చూస్తాను!"

రంగనాథం మళ్ళీ ఉలిక్కిపడ్డాడు. కౌంటర్ మీద తోటకూర కాడలా పడున్న అతని చెయ్యి వణకడం ప్రారంభించింది.

"చెప్పింది చెవిలోంచి బుర్రలోకి దూరిందా?" అవతల వ్యక్తి నవ్వుతూ ప్రశ్నించాడు.

రంగనాథం మాటలు మరిచిపోయి, రాతివిగ్రహంలా వుండిపోయాడు.

అతని చెవిలో నవ్వు ధ్వనించింది. "చకచకా సమాధానాలు చెప్పకపోతే నీకే ప్రమాదం. గంటలతరబడీ నేను నీతో మాట్లాడుతూ కూచోగలను. కానీ, మరో అయిదు నిమిషాల్లో నీ షాపు జనంతో నిండిపోతుంది. అప్పుడు నాతో సరసాలాడ్డానికి నీకు అభ్యంతరం లేదంటే, నాకేం అభ్యంతరం లేదు!"

రంగనాథం అదిరిపడ్డాడు. "నో!" అప్రయత్నంగా అరిచాడతను. "ఎవరు నువ్వు?"

అటువైపు కంఠం నవ్వింది. "ఎవరు? ఎవరు? అనడం తప్పా 'ఎందుకు?' అని నువ్వు అడగడం లేదు రంగనాథం...."

"ఎందుకు?" అసంకల్పితంగా రంగనాథం అరిచాడు.

"అలా అడిగావ్, బావుంది! మై డియర్ రంగనాథం, నాకు అర్జెంటుగా అయిదు వందలు కావాలి...." అంటూ ఆగాడు అవతలి వ్యక్తి. అగ్గిపుల్ల గీచిన శబ్దం వినిపించింది రంగనాథంకి.

బ్లాక్ మెయిల్! రంగనాథం తన చెవుల్ని నమ్మలేకుండా వున్నాడు.

అయిదు వందలు! రంగనాథం తన చెవుల్ని అసలు

నమ్మలేకుండా వున్నాడు.

“వినిపించిందా?” ఆ కంఠంలో ఇందాకటి నవ్వు లేదు.

రిజిస్టరు కవర్ తనలో పుట్టించిన ఆశ్చర్యం నుంచీ, కంగారు నుంచీ రంగనాథం కొద్దిగా కోలుకున్నాడు. “మిస్టర్, నువ్వెవరో నాకు తెలీదు. నువ్వు చేస్తున్నదేమిటో నీకు తెలీదు.... బ్లాక్ మెయిల్ ....”

“హోల్డాన్! నీ నుంచి నాకు మాటలు కాదు, మూటలు కావాలి! అయిదువందలు....”

“అయిదువందలిస్తే కాపీలూ, నెగటివ్‌లూ అన్నీ యిచ్చేస్తావా?” రంగనాథం ఆత్రంగా ప్రశ్నించాడు.

అవతలి కంఠం పకపక నవ్వింది. “అయిదురూపాయలిస్తే కాంచీపురం పట్టుచీరా, పెట్టీకోట్, బ్రాసియర్, బ్లౌజ్ పీస్—అన్నీ ఇచ్చేస్తావా నువ్వు?” ఎగతాళిగా ప్రశ్నించాడు.

రంగనాథం గుటకలు మింగాడు.

“రంగనాథం, వ్యాపారంలో యెంతో అనుభవం వున్న నువ్వు ఎంతో, ఎంతో ఎదగాలి! రేపు శుక్రవారం, నువ్వు నాకు అయిదువందలు చెల్లిస్తావు. మళ్ళీ శుక్రవారం దాకా నిన్ను నేను పూర్తిగా మరిచిపోతాను. వారం తరువాత వచ్చే శుక్రవారం నువ్వు నాకు మొదటివారం యిచ్చే మొత్తాన్ని రెట్టింపు చేసి చెల్లిస్తావు. అంటే వెయ్యి రూపాయలు. ఆ తిరువాత వారం దానికి రెట్టింపు. అంటే.... రెండువేలు. ఆ తరువాత శుక్రవారం దానికి రెట్టింపు.... నాలుగువేలు .... ఆ తరువాత శుక్రవారం, దానికి రెట్టింపు—ఎనిమిది వేలు....”

“ఇది అన్యాయం! ఘోరం! ఇది....” రంగనాథం ఆందోళనగా అరిచాడు. అవతలి వ్యక్తి కంఠం సంతృప్తి

కరంగా నవ్వింది.

"పాతిక రూపాయలకి కొన్న నాసిరకం సింథటిక్ చీరకి లేబుల్ తగిలించి నూటపాతికకి అమ్మే నీ అన్యాయం ముందు ఇదెంత అన్యాయం? ఎర్రగా, బుర్రగా డన్‌లప్ పిల్లోలా భారీగా నిండుగా వున్న కట్టుకున్న భార్యని జీడిపప్పుకీ, చందమామలకీ పోలికలేని, పెళ్ళిపెటాకులు కాని ఇరవైరెండేళ్ళ యువతితో మారుమూల లాడ్జింగుల్లో కొత్త పెళ్ళికొడుకులా కులకడం కన్నా ఇదేమంత అన్యాయం కాదు!"

మళ్ళీ అతని నవ్వు రంగనాథం చెవిలో కర్కశంగా ధ్వనించింది.

"వారం వారం రెట్టింపు చేసుకుంటూపోతే, చెల్లించే శక్తి నాకులేదు!" రంగనాథం కోపాన్ని దిగమింగుతూ అన్నాడు.

అతని శక్తికి ఎగతాళిగా నవ్వాడు. "హనుమంతుడికిలాగా నీ శక్తిసామర్థ్యాలు నీకు తెలీవు! కొనబోయే పొట్టేల్ని కసాయివాడు తూకంవేసి విలువకట్టినట్టు, నిన్ను పూర్తిగా నేను విలువకట్టాను! నువ్వెంత చెల్లించగలవో నాకు చక్కగా తెలుసు. ఇంకిపోయేదాకా నూతిలోంచి నీళ్ళు ఎలా తోడుకోవాలో కూడా నాకు తెలుసు! అంచేత అడ్డం రాకుండా విను. ప్రతీ శుక్రవారం నా చేతికి అమ్మ వాలాలి. ఒకవారం, ఒకే ఒక శుక్రవారం ఇన్‌స్టాల్‌మెంట్ నాగాపడితే, శనివారం నీ భార్య నీ శృంగారలీలల్ని రంగుల్లో చూస్తుంది! మరో గుడ్ న్యూస్. నీ లీలల్ని క్యాసెట్లలో భద్రం చేశాను. నువ్వు కావాలంటే నెక్స్ట్ వీక్ నువ్వూ, నీ సీతాకోకచిలుకా గడిపే లాడ్జి గదిలో కలర్ టీవీలో—

మీ రిద్దరూ కులాసాగా చూసుకోవచ్చు. వి.సి.పి., కలర్ టి.వి. ఏర్పాటు చేయబడతాయి. అఫ్‌కోర్స్ వాటికి అయ్యే ఖర్చు నువ్వు భరించాల్సి వుంటుంది. తరువాత వీక్ వాయిదా మొత్తంలో అది కలుపబడుతుంది!"

"నో! ఇది అక్రమం! నేను నీకేం అపకారం చేశాను? ఎందుకు నన్ను...."

"రంగనాథం ఆవేశపడొద్దు. నిజం చెప్పాలంటే నువ్వు నాకు అపకారం చేయలేదు; ఉపకారమే చేశావ్! ఆ పిల్లతో నువ్వు పెంపొందించుకున్న అక్రమ సంబంధం నాకు లాభం కలిగిస్తోంది! కీపిటప్!" అవతలి వ్యక్తి కులాసాగా నవ్వాడు.

"మిస్టర్, రీజనబుల్‌గా వ్యవహారం చేద్దాం. పదివేలిచ్చేస్తాను. అవన్నీ నా మొహాన పారేసి, నీ దారి నువ్వు చూసుకో. నన్ను వారం వారం పీడించొద్దు!" రంగనాథం ప్రాధేయపూర్వకంగా అన్నాడు.

అతను పకపక నవ్వాడు. "నువ్వు రీజనబుల్‌గా లేవు. ఎంతో కొంత పారేసి ఆ పిల్లతో ఒక ఆదివారం గడిపి నువ్వు ఆమెని మరిచిపోలేదు. వారం వారం ఆ పిల్ల అందం నీకు కైవారం చేయాల్సిందే. చేస్తోంది కూడా! ప్రతిఫలంగా ఆమెకి ఉంగరాలూ, బ్రాసియర్లూ తప్ప నీనుండి పెద్దగా దక్కడంలేదు! ప్రతిదానికీ ఈ ప్రపంచంలో విలువ వుంది రంగనాథం! నువ్వూ ఆ విలువ చెల్లించాలి, ఎవరికో ఒకరికి!"

"ఆమె....ఆమె నన్ను ప్రేమించింది. నా ప్రేమని ఆమెకి ప్రతిఫలంగా ఇస్తున్నాను. మధ్య విలువకట్టి బేరాలు చేయడానికి నువ్వెవరు?" రంగనాథం కోపంగా ప్రశ్నించాడు.

"కార్మికులు రెక్కలు ముక్కలు చేసుకుని గడ్డలు తీస్తున్నారు. కారుచవగ్గా వాటిన్ని కొనేసి, పాలిష్ చేసి, షో కేసుల్లో పెట్టి విలువకట్టి నువ్వు ప్రజల్నుంచి వసూలు చేస్తున్నావ్! ఇది కూడా అంతే!....ఆల్ రైట్, శోధనం వెళ్ళకొడదగా, రేపు ఉదయం అయిదు వందరూపాయల నోట్లని కవర్లో పెట్టి అతికించి రెడీగా వుంచుకో. కవరు మీద నీ పేరూ, అడ్రసూ రాయి. సమయం చూసి నీకు ఫోన్ చేస్తాను. ఎలా అందచేయాలో చెప్తాను...."

"ప్లీస్....మిస్టర్! బీ రీజనబుల్...."

"ఈలోగా ఈ విషయం ఎవ్వరికీ చెప్పకు. నీ పడగ్గది భాగోతం బజార్లో పడిపోతుంది! నోట్ల నంబర్లు గుర్తుంచుకోడం, పోలీస్ డాగ్స్ని ఉసిగొలపడంలాంటి అఘాయిత్యప్పనులు చేయొద్దు! బీ కేర్ఫుల్! చెప్పినట్టు చేయకపోతే, చెడిపోయేది నువ్వే!"

రంగనాథం ఏదో చెప్పబోయాడు. అతని చెవిలో క్లిక్మంది. షాపుముందు ఏదో చప్పుడైంది. అతను ఉలిక్కిపడి చూశాడు. షట్టర్ని పైకి తోసిన గుమాస్తా సాంబమూర్తి అతన్ని చూస్తూ చిరునవ్వు నవ్వాడు.

"గుడ్ మార్నింగ్ సార్!" సాంబమూర్తి హుషారుగా అన్నాడు, యజమాని దగ్గరగా నడుస్తూ.

"ఏమిటి సార్, అదోలా వున్నారు. ఆరోగ్యం బాగా లేదా?" సాంబమూర్తి రంగనాథం ముఖాన్ని అదోలా చూస్తూ అన్నాడు.

"వెళ్ళి, స్ట్రాంగ్ కాఫీ, రెండు ఆస్ప్రో పట్రా" రంగనాథం విసుగ్గా అన్నాడు. సాంబమూర్తి వెనుదిరిగి షాపులోంచి అవతలికి నడిచాడు.

రంగనాథం కళ్ళు మూసుకుని, రొటేటింగ్ కుర్చీలో

వెనక్కి వాలాడు. అప్రయత్నంగా రెండు చేతుల్తో కణతల్ని నొక్కుకుంటూ వుండిపోయాడు.

నిమిషాలు గడుస్తున్నాయి. రంగనాథం ఉలిక్కిపడ్డాడు. ఇందాకా కవర్లోంచి లీలగా వచ్చిన సెంట్ సువాసన స్ట్రాంగ్‌గా అతని వైపు దూసుకొస్తోంది. అతను తటాలున కళ్ళు తెరిచాడు.

అలవాటు తప్పకుండా ఆ సెంటుని రాసుకునే సీనియర్ సేల్స్‌గర్ల్, అతని కుడిభుజం జ్వాల అతన్నే చూస్తూ చిలిపిగా నవ్వుతోంది.

# 3

రాత్రి ఏడుగంటలు దాటింది.

నైట్ క్వీన్ లాడ్జిలో, తన గదిలో మంచం మీద కూచుని, అసహనంగా మూడో కరోనా వెలిగించాడతను. ఆరున్నరకల్లా కలుసుకుంటానన్న జ్వాల ఏడు దాటినా రాలేదు, నోరు మండుతోంది. ఆపుకోలేకుండా దగ్గుతూ, సిగార్ని గదిమూల విసిరాడతను.

గుమ్మం ముందు అడుగుల చప్పుడు. అతను ఆశగా మూసిన తలుపువేపు చూశాడు. తలుపు మెల్లగా కదులుతోంది. కాసేపట్లో తలుపు తెరిచి, లోపల దూరి, తలుపు మూసి, గొళ్ళెం బిగించి వెనుదిరిగి అతన్ని చిరునవ్వుతో చూసింది జ్వాల. తలలోని మల్లెల్లా ఆమె పళ్ళు మెరుస్తున్నాయి.

జ్వాల ముక్కుని చిట్లించింది. అతనివైపు ఆక్షేపణగా చూసింది. "చుట్ట కాల్చారా!" అందామె చెప్తున్నట్టు.

రంగనాథం మాట్లాడకుండా ఆమెనే చూస్తున్నాడు. జ్వాలకి చుట్టవాసన నచ్చదు. ఆమెని కల్సుకునే రోజా

కరోనాని దూరంగా వుంచాలన్న నియమం ఆమె విధించింది. అతను ఆ నియమాన్ని పాటించాడు, ఇంతవరకూ. ఆలోచిస్తూ రంగనాథం రెప్ప వేయడం మరచిపోయి ఆమెనే చూస్తున్నాడు. నల్లచీర, నల్లజాకెట్. నల్లటి ప్రమిదలోంచి పైకి సాగుతున్న దీపకళికలా జ్వాల మెరిసి పోతోంది....

ఇంకా తనవైపు చూసుకురాకుండా బెల్లంకొట్టిన రాయిలా వున్న రంగనాథంని జ్వాల ఆశ్చర్యంగా చూసింది. ఇద్దరూ కల్సుకుని నెల దాటింది. ఎందుకో అతను అలిగినట్టున్నాడు! తనలో నవ్వుకుంటూ జ్వాల బాత్ రూం వైపు కదిలింది.

"జ్వాలా, ఇలా రా...."

జ్వాల ఆగి, అతన్ని ప్రశ్నార్థకంగా చూసింది. "దుస్తులు మార్చుకొస్తాను....ఆగండి!"

"ఇప్పుడే వొద్దు....ఇలా కూచో...." రంగనాథం కంఠంలో ఏదో నిరాశ ధ్వనించింది.

జ్వాల విశాల నేత్రాలు యింకా విచ్చుకున్నాయి. మెల్లిగా నడిచి, అతని ముందు కుర్చీలో కూర్చుంది. ఏమిటో చెప్పమన్నట్టు అతనివైపు చూసింది.

"ఈ మధ్య వెలగా నిన్ను కలుసుకోలేకపోయాను."

"తెలుసు!" జ్వాల అడ్డొస్తూ అంది; ఎద్దేవా చేస్తున్నట్టు.

"ఒక ప్రత్యేకమైన, ముఖ్యమైన కారణంగా నిన్ను కల్సుకోలేకపోయాను...."

"అది తెలీదు!" జ్వాల నవ్వింది. ఆమె కళ్ళు ప్రశ్నార్థకంగా చూస్తున్నాయి.

రంగనాథం జేబులోంచి ఒక కవరు లాగి ఆమెకు అందించాడు. అప్రయత్నంగా కవర్ని పట్టుకుందామె.

"ఏమిటిది?"

"చూడు...." రంగనాథం నిట్టూర్చాడు.

జ్వాల ఆశ్చర్యంతో కవర్ని తెరిచి, అందులోని ఫోటోని ఇవతలికి లాగింది. రెప్పపాటు కాలం ఫోటోని చూసింది. అమాంతం ఫోటో ఆమె వేళ్ళసందు నుంచీ జారింది. ఆమె చెయ్యి అసంకల్పితంగా ఆమె నోటిని మూసింది.

రక్తం పూర్తిగా ఇంకిపోయి, తెల్లగా పాలిపోయిన జ్వాల మొహాన్ని అతను తదేకంగా చూస్తున్నాడు. ఆమె కళ్ళల్లో భయం స్పష్టంగా అవుపిస్తోంది. ఆమె చెయ్యి దూరంగా జరిగింది. ఎర్రటి పెదవులు అదురుతున్నాయి. రంగనాథం వొంగి, ఆమె ముందు పడున్న ఫోటోని తీసి జేబులో పడేసుకున్నాడు.

"ఏ....మి....టి....ది ...?" జ్వాల కంఠం వణికింది. వణుకుతున్న ఆమె చేతుల్ని అతను జాలిగా చూశాడు.

"ఆరువారాల క్రితం, ఖచ్చితంగా చెప్పాలంటే ఆరు శుక్రవారాల క్రితం ఈ ఫోటో నాకు రిజిస్టర్డు కవర్లో అందజేయబడింది" రంగనాథం ప్రారంభించాడు.

జ్వాల అడ్డుకోకుండా వింది. బలహీనంగా కుర్చీలో వెనక్కివాలి భయాందోళనలతో అతన్ని చూసింది. రంగనాథం నిట్టూర్చి, మళ్ళీ ప్రారంభించాడు.

"ప్రతివారం మొత్తాన్ని రెట్టింపు చేస్తూ ఆరువారాల పాటు ఆ వ్యక్తికి పైకం చెల్లించాను. ఇప్పటికి ముప్పై ఒక్క వేలా అయిదువందలు అతను వసూలు చేశాడు" రంగనాథం ఆగాడు.

జ్వాల మూగదానిలా అతన్నే చూస్తోంది. అతను చెల్లించిన మొత్తం ఎంతో ఆమె ఆలోచించడంలేదు. ఫోటో బైటపడితే, తను ఎంత చెల్లించాల్సి వుంటుందో, ఏమిటి చెల్లించాల్సి వుంటుందో ఆమె ఆలోచిస్తోంది.

“ఎల్లుండి శుక్రవారం. ఏడో శుక్రవారం. కిందటి శుక్రవారం చెల్లించిన మొత్తానికి రెట్టింపు. అంటే ముప్ఫైరెండు వేలు ఎల్లుండి మనం అతనికి చెల్లించాలి” అన్నాడు రంగనాథం ‘మనం’ అన్న పదాన్ని ఒక రకంగా నొక్కుతూ.

జ్వాల నాలుకతో పెదాల్ని తడుపుకుంది. మాట్లాడకుండా అతన్ని చూసింది.

“ఇప్పటికే తల ప్రాణం తోకకి వచ్చింది. నా భార్య అనుమాన పిశాచి. చాదస్తపు ఆడిటర్‌లా ప్రతి పైసాకీ వెయ్యి ప్రశ్నలు వేస్తూ సంజాయిషీ తీసేస్తోంది. ఎల్లుండి చెల్లిస్తే అరవై మూడు వేల పైగా హారతికర్పూరం అయిపోతుంది.”

“ఎవరతను?” జ్వాల చివరకు నోరు పెగల్చుకుంది.

“తెలీదు... జ్వాలా, నాతో పరిచయం కాకముందు నీతో పరిచయం వుండి నిన్ను కోరిన వ్యక్తి ఎవరేనా వున్నాడా?” రంగనాథం ప్రశ్నించాడు.

జ్వాల దెబ్బతిన్నట్టు చూసింది. “మీరు....మీరు తప్ప మరెవరూ నన్నలా చూడలేదు. మిమ్మల్ని తప్ప మరెవర్నీ నేను అలా చూడలేదు. ఇది నిజమని మీకు తెలుసు!” అందామె అతని కళ్ళల్లోకి అర్థవంతంగా చూస్తూ.

రంగనాథం తల పంకించాడు. “జ్వాలా ఎల్లుండి ముప్ఫైరెండు వేలు ఫరవాలేదు. ఆ పైవారం అరవై

నాలుగు....ఆ పైవారం అప్పు ఇరవై ఎనిమిది వేలు....ఆ పైవారం..."

"చెప్పకండి!" జ్వాల కంగారుగా అరిచింది

నుదురుకి పట్టిన చెమటని బలహీనంగా అరచేత్తో రుద్దుకున్నాడు రంగనాథం. మెల్లి మెల్లిగా షాక్‌నుంచి కోలుకున్న జ్వాల అతన్ని ఉద్రేకంతో చూసింది.

"బ్లాక్ మెయిలర్‌కి లొంగకండి!"

రంగనాథం ఆమెని నీరసంగా చూశాడు. "జ్వాలా, తొందరపడి మాట్లాడుతున్నావ్. మనిద్దర్నీ....అతను....క్యాసెట్‌గా తీశాడు. దాన్ని నా భార్యకు చూపించి, ఊరుకుంటాడన్న నమ్మకం నాకు లేదు. దేశమంతా ఆ క్యాసెట్లు సరఫరా అయిపోతాయని నాకు అనిపిస్తోంది...."

"మైగాడ్!" జ్వాల అప్రయత్నంగా అరిచింది. ఆమె కళ్ళల్లోని భయం కరిగి, నీరుగా మారుతోంది. "ఏదేనా చేయండి. ఆ క్యాసెట్లూ, ఫోటోలూ అతన్నుంచి సంపాయించండి!"

"అతను టోకుగా అన్నీ అమ్మడానికి నిశ్చయించుకుంటేగానీ మనం కొనుక్కోలేం. అంతవరకూ వీక్లీ ఇన్‌స్టాల్‌మెంట్స్ తప్పేలా లేవు" రంగనాథం బలహీనంగా అన్నాడు.

"నా దగ్గర పైకం అంతగా లేదు. మీరిచ్చినవీ, నా దగ్గరున్నవీ పాతిక వేలు చేసే నగలున్నాయి...." అంటూ జ్వాల ఆగింది.

రంగనాథం ఆమెని ప్రేమగా చూశాడు. ఆమెలోని ఈ మంచి లక్షణమే తనని జ్వాలకి దగ్గరగా చేసింది. ఇరవై నాలుగ్గంటలూ తనమీద అధిపత్యం చెలాయించే

తన భార్య, వయసుకి మించిన లావుతో తనని ఆకర్షించలేకపోతున్న తన భార్య తనని జ్వాలకి, అందాల భరిణ అయిన జ్వాలకి దగ్గరగా తోసింది....

"ఈ వారం ఇన్‌స్టాల్‌మెంట్ ఎలాగో ఫర్వాలేదు. ఆ తరవాతే....జ్వాలా, మనం పరిశోధించి, ఆ వ్యక్తి ఎవరో కనిపెట్టాలి" రంగనాథం సాలోచనగా అన్నాడు.

జ్వాల కంగారుగా చూసింది. "ఎవర్నైనా డిటెక్టివ్‌ని నియమించండి. లేకపోతే పోలీసులు...."

రంగనాథం తలని ఆందోళనగా అటూ ఇటూ ఊగించాడు.

"ఈ విషయాన్ని మనం ఎవ్వరికీ చెప్పలేం. ఏదో వేరే కారణం చెప్పి, ఎవర్ని సహాయం కోరినా తీగ పూర్తిగా లాగబడుతుంది డొంకంతా కదులుతుంది! అది లాభంలేదు. జ్వాలా, ఎల్లుండి ఎలాగో అతనికి ముప్ఫై రెండువేలూ పారేస్తాను. ఈ సారి పైకం వుంచిన కవర్ని ఎక్కడ పడవేయమంటాడో, ఎలా అందజేయమంటాడో నాకు తెలీదు. అతను సూచనలిచ్చాక నేను నీకు చెప్తాను. ఆ ప్రదేశానికి నువ్వు ముందుగా చేరుకో. మామూలుగా ధరించే దుస్తులు కాకుండా వేరే దుస్తులు వేసుకో. నేను కనుమరుగయ్యేదాకా అతను పైకం కవర్ని ముట్టుకోడు...."

"నాకు....నాకు ఎందుకో భయంగా వుంది" జ్వాల అడ్డొస్తూ అంది.

"ఇంత జరిగాక భయపడితే లాభంలేదు. ప్రతి సారీ అతని పైకం వున్న కవర్ని రైల్వేస్టేషన్ దగ్గరో, సినిమా హాల్స్ దగ్గరో, బస్టాండులోనో వుండే తుక్కు

డబ్బాలో పడేసి, తిరిగి చూడకుండా వెళ్ళిపొమ్మన్నాడు. తిరిగిచూస్తే ప్రమాదమని నికరంగా హెచ్చరించాడు. ఈ సారీ అంతే చేస్తాడు. నేను తిరిగి చూడకుండా వెళ్ళి పోతాను. ఎక్కడో దాక్కుని నువ్వు అంతా గమనించు. అతన్ని జాగ్రత్తగా ఫాలో చెయ్. ఎక్కడుంటాడో కనిపెట్టు. తిరిగిరా. చాలు!" రంగనాథం ఆవేశంతో చెప్పి ఆగాడు.

"తరువాత ఏం చేస్తారు?" జ్వాల ప్రశ్నించింది.

"అతని గూడు తెలిశాక.... ఏ అర్థరాత్రో వెళ్ళి, గాలించి అన్నీ పట్టుకొచ్చేయాలి. తన చేతిలో కత్తుల్లా ఉపయోగపడుతున్న 'వాటిని' తన గదిలో బహుజాగ్రత్తగా దాచుకుని వుంటాడు!" రంగనాథం ఉద్రేకంతో అన్నాడు.

జ్వాల అతన్ని ఆవేశంతో చూసింది. తటాలున లేచి, అతని పక్కనే మంచంమీద చతికిలబడింది.

"అలా చేయడం తప్ప వేరో మంచిమార్గం మనకి లేదు. వాట్ని మనమే సంపాయించగలిగితే, మరో వ్యక్తికి ఈ విషయం తెలిసే అవకాశం వుండదు. ఆ ఫోటోని, క్యాసెట్లనీ బూడిద చేసేశాక, మన జాగ్రత్తలో మనం క్షేమంగా వుండొచ్చు!" రంగనాథం ఆలోచనల్ని అక్షరాలుగా మార్చి తగ్గుస్వరంలో ఉచ్చరించాడు.

జ్వాల అతని దగ్గరగా జరిగింది. ప్రేమగా అతని భుజంమీద చేతిని వేసింది. ఆమె బాబ్డ్ హెయిర్ అతని చెంపకి తగిలింది. సెంటు గుప్పుమంది. రంగనాథం ఉలిక్కి పడ్డాడు.

"జ్వాలా, మనం యిలా ఒంటరిగా ఒకచోట వుండటం ప్రమాదం. తుఫాను అణగారిపోయేదాకా

దూరంగా వుండాలి! వెళ్ళు. కాస్సేపట్లో నేను వెళ్ళి పోతాను" రంగనాథం అయిష్టంగా అన్నాడు.

జ్వాల ఆశ్చర్యంగా అతన్ని చూసింది. క్షణకాలంలో ఆమె కళ్ళలోని ఆశ్చర్యాన్ని సానుభూతి మింగేసింది. ఆమె అసంకల్పితంగా కొంచెం దూరంగా జరిగింది. ఆమె చెయ్యి అతని భుజంమీంచి కిందికి బలహీనంగా జారింది.

ఆమె అదో రకంగా అతన్ని చూసింది. తను కనిపించగానే సుడిగాలిలా చుట్టేసి ఉక్కిరిబిక్కిరి చేస్తూ, ఉక్కిరిబిక్కిరై పోయే అతను ఇప్పుడు కెరటాలులేని సముద్రంలా, గాలి తీసేసిన బెలూన్‌లా వున్నాడు! తమ సంబంధం యిక కొనసాగుతుందన్న నమ్మకం ఆమెలోంచి అదృశ్యమవుతుంది.

భార్యకి, తనని ప్రేమించని భార్యకి విడాకులిచ్చేసి తనని పెళ్ళాడతాడని జ్వాల ఎంతగానో అనుకుంది. ఆ ఉద్దేశం అతనికి ఉన్నట్టూ ఆమెకి తెలుసు. తనకన్న వయసులో పెద్దవాడైనా, రంగనాథం ప్రేమ, ఉద్రేకం ఆమెని ఎంతగానో ఆకర్షించాయి. రెల్లుగడ్డిలా భగ్గున మండి, నప్పున చల్లారిపోయే యువకుల ప్రేమమీద జ్వాలకి అట్టే సదభిప్రాయంలేదు!

జ్వాల నిట్టూరుస్తూ పైకి లేచి, గుమ్మంవైపు తిరిగింది. మరో క్షణానా పిలిగించి, రంగనాథం ఆమెవైపు చూశాడు.

"జ్వాలా...."

జ్వాల ఆగి, అతనివైపు తిరిగి చూసింది ప్రశ్నార్థకంగా.

"అతనికి....నీ గురించి చాలా ఎక్కువగా తెలుసు. నువ్వు రాసుకునే బ్రాండు సెంటునే అతను ఫాటోక్కి,

కవరుకి రావాడు. నీకు లంగాలూ, బ్రాసియర్ లూ తప్ప పెద్దగా వానుండే పారితోషికం అందడం లేద న్నాను....” రంగనాథం అగి, కరోనాని పళ్ళమధ్య ఇరికించి రెప్పవేయకుండా ఆమెనే చూడసాగాడు.

జ్వాల కనుబొమలు ఎక్కుపెట్టిన విల్లులా వంకీలు తిరిగాయి. ఆమె కళ్ళల్లో ఏదో మార్పొచ్చింది. మెల్లిగా రంగనాథం వైపు అడుగులు వేసింది. ఆమె చేతులు వానిటీబాగ్ ని గట్టిగా పట్టుకున్నాయి. తటాలున ఆమె పెదవులు చిరునవ్వుతో విచ్చుకున్నాయి.

“ఆ వ్యక్తి ఎవరో నాకు తెలిసీవుండాలనీ, నాకు తెలిసే అతను మిమ్మల్ని బ్లాక్ మెయిల్ చేస్తున్నాడనీ మీరు అనుమానిస్తున్నారు!” అందామె.

రంగనాథం గుటకలు మింగుతూ అయోమయంగా చూశాడు.

“నా ప్రేమనూ, నా శరీరాన్నీ మీకు అంకితం చేసిన నాటినుండీ మిమ్మల్ని చిల్లిగవ్వ కూడా అడగలేదు! మీ ప్రేమతప్ప మరొకటి నాకు అక్కర్లేదని చాలాసార్లు చెప్పాను. అలాంటి స్థితిలో ఫోటో దగ్గి నా భవిష్యత్తుని నాశనం చేసుకుంటాననుకున్నారా? అయామ్ సారీ....”

“జ్వాలా....”

“నేను రాసుకునే సెంటు గురించి అతనికే కాదు చాలా మందికి తెలుసు. ముఖ్యంగా, కభ్యూ అతనికే కాదు; చాలా మందికి వున్నాయి. మనిద్దరి కథా తనకి తెలుసని మరోవిధంగా నిరూపించడానికి అతను ఆ సెంటుని వుపయోగించి వుండొచ్చు.”

“జ్వాలా, నన్ను క్షమించు! అది నాకు తట్టలేదు. ఆందోళనతో అలా అన్నాను” రంగనాథం కంఠంలో

పశ్చాత్తాపం ధ్వనించింది. అతని కళ్ళల్లో పశ్చాత్తాపాన్ని ఆమె చూడగలిగింది.

ఆమె ముందుకి వొంగి. అతని చెంపను అరచేత్తో రాసింది. "వెళ్తాను. ఊరికే బుర్ర పాడుచేసుకోకండి. ఎల్లుండి ఏం జరుగుతుందో చూద్దాం!"

తలుపువైపు తీరుగా నడుస్తున్న జ్వాలని విచారంతో చూస్తూ రంగనాథం రాయిలా కూచున్నాడు.

## 4

కార్నర్‌లో ఆగిన బస్సులోంచి దిగి, రంగనాథం ముందుకి నడవసాగాడు.

తనిప్పుడు లక్ష్మి టాకీస్ దాకా కాళ్ళీడ్చుకుంటూ నడవాలి. బస్సులో తిన్నగా వెళ్ళి టాకీస్ ముందే తను దిగివుండొచ్చు. కానీ, అతను 'కార్నర్‌లో దిగి, కాళ్ళీడ్చుకుంటూ వెళ్ళు!' అన్నాడు. ఛండాలుడు! అతని సూచనలని నిర్లక్ష్యంచేసే ధైర్యం, అవకాశం తనకిలేవు. కత్తి కింద ఇరుక్కున్న కంఠేలు తను!

కోపాన్నీ, నిస్సహాయతనీ నిట్టూర్పు రూపంలో వెళ్ళగక్కుతూ రంగనాథం పేవ్‌మెంటుమీద నడవసాగేడు.

గంట క్రితం అతన్నుంచి ఫోన్ రాగానే, అనుకున్న విధంగా జ్వాలకి వివరాలు తెలియజేసినందుకు రంగనాథం తనని అభినందించుకున్నాడు. ఏదో అర్జంటు పనున్న దానిలా జ్వాల మరోవైపు ఆటోలో వెళ్ళిపోయింది. తన గదికెళ్ళి, దుస్తులు మార్చుకుని, అట్నుంచి వెళ్ళి ఆమె లక్ష్మి టాకీస్ సమీపంలో ఎక్కడో దాక్కుని వుంటుంది. డబ్బున్న కవర్ని థియేటర్ కాంపౌండ్ లోపల గోడవారగా వున్న తుక్కుడబ్బాలో పడేసి తను తిరిగి చూడకుండా వచ్చిన దారినే కార్నర్ దాకా వెళ్ళి

పోతాడు.

తను కార్నర్ని సమీపించేదాకా అతను తననే చూస్తూ వుండిపోయి, ఆ తరువాత కళ్ళి తిప్పుకొని ఏమీ ఎరగనివాడిలా అలమందలో ఆబోతులా జనంలో దూరి పోతాడు. కానీ, ఈసారి అతను జ్వాల చూపుల్నుంచి తప్పించుకోలేదు! తనలో తను తృప్తిగా నవ్వుకుంటూ ఉద్రేకంతో జోరుగా అడుగులు వేశాడు రంగనాథం.

థియేటర్ కౌంటర్ల ముందు జనం కిక్కిరిసి వున్నారు. తుక్కుడబ్బాని ఓసారి చూసి, ఎదురుగా గోడకివున్న పోస్టర్ని చూశాడతను. 'చీకట్లో చిందులు', 'నైట్ క్వీన్' మరో మళయాళం పేరూ—మూడు టైటిల్సున్న మళయాళం సినిమా ప్రదర్శించబడుతూంది. రంగుల్లో పెద్దగా వున్న వాల్ పోస్టర్లో నగ్నంగా వున్న ఆడ బొమ్మమీద, నగ్నంగావున్న మగబొమ్మ బోర్లించి నట్టుంది. చటుక్కున, జ్వాలా తనూ వున్న ఫోటో గుర్తొచ్చింది రంగనాథంకి.

జలదరిస్తున్న వొంటిని కంట్రోల్ చేసుకుంటూ రంగనాథం డస్టుబిన్ దగ్గరగా నడిచాడు. దగ్గుతూ, ఉమ్మేసేవాడిలా తుక్కుడబ్బా మీదకి వంగాడు. డబ్బా సగంపైగా నిండింది. అతని ఎడమచేతిలోని కవరు డబ్బా లోకి జారింది. రంగనాథం దూరంగా జరిగి, అప్రయత్నంగా చుట్టూ పరకాయించి చూశాడు. ఎవ్వరూ తన వేపు చూడ్డంలేదు. కౌంటర్ల ముందు భుజాలతో యుద్ధం సాగుతోంది.

తనకి కనిపించకుండా ఆ వ్యక్తి తననే చూస్తూవుంటా డని రంగనాథంకి తెలుసు. అతనెక్కడున్నాడు? కసిగా ఆలోచిస్తూ, అతను సూచనల ప్రకారం కాంపౌండు

లాంచి ఇవతలికి నడిచాడు. కుడివేపుకి తిరిగి యిందాకా బస్సు దిగిన కార్నర్ వేపు నడవసాగేడు.

అతని కళ్ళు తీవ్రంగా అటూ ఇటూ చూస్తూ ఎక్కడో దాగిన జ్వాలని కనిపెట్టడానికి వ్యర్థప్రయత్నం చేస్తున్నాయి. జ్వాల తనకి కనిపించలేదు. థియేటర్ ముందున్న వందలాదిమందిలో అతను తనకి అవుపించినా తను పోల్చుకోలేడు! జ్వాలమీద భారంవేసి, రంగనాథం ఆగుతున్న బస్ వేపు జోరుగా నడిచాడు.

• • •

థియేటర్ ముందున్న కోయా రెస్టారెంట్‌లో కిటికీ ముందున్న సీట్లో కూచుంది జ్వాల. ఆమె కళ్ళు మెరిశాయి. రంగనాథం డస్టుబిన్ వేపు బరువుగా అడుగు లేస్తున్నాడు. అలర్ట్‌గా వున్న జ్వాలకళ్ళు రంగనాథం వొక్కణ్ణే చూడ్డంలేదు.

కాసేపట్లో రంగనాథం గేటుదాటి కుడివైపుకి తిరిగి వెళ్ళిపోయాడు. జ్వాల డస్టుబిన్ వైపే చూస్తోంది. నిమిషాలు గడుస్తున్నాయి. ఎవరూ డస్టుబిన్‌ని సమీపించలేదు....

రెస్టారెంట్‌లో రష్ ఎక్కువవుతోంది. ఆమె దగ్గరగా కుర్చీలు లాగబడుతున్నాయి. జ్వాల వోరగా తల తిప్పి చూసింది. కూరికే కూచోడం బాగోదని తను రెండోసారి స్ట్రాంగ్ టీ ఆర్డరిచ్చింది. ట్రేలో నీళ్ళగ్లాసులూ, కప్పులూ, సాసర్లూ వుంచుకుని సర్వర్ టేబుల్స్ మధ్య దారి చేసుకుంటూ వస్తున్నాడు.

జ్వాల తలతిప్పి తన లక్ష్యం—కుప్పడబ్బా వైపు చూసింది. ఎవరూ లేరు. జ్వాల ఉలిక్కిపడింది. భళ్ళున చప్పుడైంది. వేడిగా ఏదో ద్రవం ఆమె మొహంమ్మీదా,

ఛాతీ మీద పడింది. అసంకల్పితంగా ఆమె తల తిప్పింది.

టేబిల్ మీదికి, ట్రే మీదికి వాలిపోయిన సర్వర్ పైకి లేస్తున్నాడు. సాసర్లూ, కప్పులూ ముక్కలుగా పగిలివున్నాయి. కాఫీ, టీ టేబుల్ మీద కలిసి మడుగు కట్టాయి. వొళ్ళోవున్న బాగ్ లోంచి రుమాలు తీసి మొహాన్ని, గడ్డాన్ని వొత్తుకుందామె. వేడిమూలంగా మొహం మండుతోంది.

"సారీ.... మేడమ్....ఎవరి కాలో అడ్డు తగిలింది.." కంగారుపడిపోయిన సర్వర్ నత్తినత్తిగా అన్నాడు. చుట్టూవున్న అయిదారుగురు ఆమెవైపు అదోలా చూస్తున్నారు. మరో అయిదారుగురు యువకులు నవ్వకుండా వుంటానికి ప్రయత్నిస్తున్నారు.

జ్వాల తెప్పరిల్లి కంగారుగా కిటికీలోంచి చూసింది. అనుకోకుండా ఆమె తేలిగ్గా ఊపిరి పీల్చుకుంది. తుక్కు డబ్బా దగ్గర ఎవ్వరూ లేరు...

"మేడమ్, టీ తీసుకోండి" సర్వర్ కంఠం. అతనివైపు ఓసారి చూసి, కప్పు అందుకుని చూపుల్ని కిటికీవైపు తిప్పింది జ్వాల. టేబుల్ క్లీన్ చేసేసి, మరో టీ తెచ్చినట్టున్నాడు సర్వర్. టీ గందరగోళాన్ని క్షణంలో మరిచిపోయి జ్వాల తన కార్యక్రమంలో మునిగిపోయింది. నిమిషాలు నడుస్తున్నాయి.

పావుగంట గడిచింది. జ్వాల అసహనంగా కదిలింది. రంగనాథం కవర్ని పడేసి దాదాపు ఇరవై నిమిషాలు దాటింది. దానికోసం అతను ఇంకా ఎందుకు రాలేదు? మరెవరో దాన్ని తన్నుకుపోతే! ఉన్నట్టుండి ఆమెలో ఏదో తళుక్కుమంది. బిల్లున్న సాసర్లో టీ పైకం పడేసి

ఆమె చకచకా హోటల్లోంచి ఇవతలికి నడిచింది.

రోడ్డు దాటి జ్వాల థియేటర్ గేటుముందు ఆగింది. కౌంటర్ల ముందు ఎవ్వరూ లేరు. బాబ్డ్ హెయిర్ని సర్దుకుంటూ ఒకసారి ఇటూ అటూ పరిశీలనగా చూసింది. ఎవరూ తనని పట్టించుకోవడంలేదు. జ్వాల చకచకా డస్ట్‌బిన్ దగ్గరగా నడిచింది. టీ మరకలతో నిండిన రుమాలుని ఉండగా చుట్టి అందులో పడవేయబోతూ, జాగ్రత్తగా చూసింది. సగం పైగా చెత్తా చెదారంతో నిండిన డస్ట్‌బిన్‌లో రంగనాథం పడేసిన కవరులేదు.

• • •

నిద్రపట్టని రంగనాథం అటూ ఇటూ దొర్లసాగాడు.

జ్వాల చెప్పింది విన్నాక అతని ఆశలూ, ధైర్యం అన్నీ అంతరించిపోయాయి. ఇవాళ అతని అచూకీ తెలుస్తుందనీ, ఏదో విధంగా అతని చేతిలో ఇరుక్కున్న ఫోటోల్నీ, క్యాసెట్లనీ తస్కరించేసి ఈ పీడ కలని అంతం చేయాలనీ ఎంతగానో అనుకున్నాడతను. కానీ.... జ్వాల అతన్ని కనిపెట్టలేకపోయింది! ఆమె కంటపడకుండా తెలివిగా అతను జారుకున్నాడు!

రంగనాథం విసుగ్గా వెల్లకిలా తిరిగాడు. పక్క గదిలోంచి గజ గురక రెండు గండుపిల్లులు కొట్లాడుతూ చేసే శబ్దంలా కర్ణకఠోరంగా వినపడుతోంది. జ్వాలకి కనబడకుండా వాడు ఎలా తన పని సాధించగలిగాడు?

రంగనాథం ఉలిక్కిపడ్డాడు. టెలిఫోన్ మ్రోగుతోంది. తలవేపున వున్న రిసీవర్ని అందుకుంటూ అతను తటాలున లేచాడు.

"హలో...."

"రంగనాథంగారా?" అటువైపు కంఠం ప్రశ్నిం

చింది మర్యాదగా.

"హ్లో ను....ఎవరూ?" రంగనాథం ప్రశ్నించాడు.

"రంగనాథం నువ్వు అతి తెలివిగా ప్రవర్తించావు! నా సూచనల్ని షరతుల్ని నిర్లక్ష్యం చేశావు. నీ ప్రేయసిని నా మీదకి నిఘాకి నియమించావు."

"నో!" రంగనాథం అప్రయత్నంగా అరిచాడు. అతని చెయ్యి కొద్దిగా వణికింది.

"యస్! ఆ పిల్లని నేను పోల్చుకోలేననుకున్నావ్. ఏ దుస్తులూ ధరించకపోయినా ఆమెని నువ్వెలా పోల్చుకో గలవో, ఏ దుస్తులు ధరించినా ఆమెని నేనూ అలాగే పోల్చుకోగలను!" అతను సగర్వంగా నవ్వాడు.

"నేను.... నాకు... ఏమీ తెలీదు...." రంగనాథం ఆదుర్దాగా అన్నాడు.

"పటక్!" అతని కంఠం పిస్టల్ షాట్‌లా ధ్వనించింది. "నువ్వు చేసిన పొరపాటుకి నీకు శిక్ష విధిస్తున్నా. వచ్చే శుక్రవారం నువ్వు అరవై నాలుగు చెల్లించాలి. రూపాయలు కాదు; వేలు! నా సూచనలకి విరుద్ధంగా ప్రవర్తించినందుకు అపరాధంగా ముప్పైఆరు వేలు కలిపి, సరిగా లక్ష రూపాయలు చెల్లించాలి! అర్థమైందా?"

లక్షరూపాయలు! రంగనాథం శరీరం ఒక్కసారిగా చల్లబడిపోయింది. చెమట అతని శరీరాన్ని తడిపేస్తోంది. చేత్తోపాటు వణుకుతున్న రిసీవర్ని చెవికి అదిమాడతను.

"ఆ తరువాత శుక్రవారం దాన్ని రెట్టింపు చేయాలి. అంటే రెండు లక్షలు...."

"నో!" రంగనాథం కీచుగా అరిచాడు. "ఇది దారుణం! నా దగ్గర అంత పైకం లేదు! పొరపాటు చేశాను. క్షమించు. వచ్చేవారం అరవై నాలుగు యిచ్చే

స్తాను. ఆ తరువాత నావల్ల కాదు...నావద్ద..."

"షటప్!" అతని గద్దింపు రంగనాథం నోరు నొక్కేసింది. "శుక్రవారం లక్ష తయారుగా వుంచు. ఎలా అందజేయాలో చెప్తాను. ఏ మాత్రం పొరపాటు జరిగినా, ఏం జరుగుతుందో నీకు తెలుసు!"

రంగనాథం చెవిలో ఫోన్ క్లిక్ అంది. అప్రయత్నంగా అతని చేతిలోంచి రిసీవర్ కిందికి జారింది. రెండు చేతుల్తో మొహాన్ని కప్పేసుకున్నాడతను. పక్కగదిలోంచి వినిపిస్తున్న గురక గజలక్ష్మి నిద్రకి భంగం కలగలేదని చాటుతోంది.

మళ్ళీ తటాలున మోగిన ఫోన్ అతన్ని ఉలిక్కిపడేలా చేసింది. కాటేయడానికి కాచుకున్న నల్లత్రాచుని చూచినట్టు నల్లటి టెలిఫోన్ని క్షణకాలం ఆందోళనతో చూశాడు రంగనాథం. అప్రయత్నంగా అతని ఎడమ చెయ్యి రిసీవర్ని అందుకుంది.

"హాలోవ్..."

రంగనాథం, మరో సంగతి మరిచిపోయాను ఇందాక. ఈ క్షణం నుంచీ నువ్వు నీ నార్మల్ డెయిలీ ద్యూటీన్ తప్ప మరో పని చేయకూడదు. అంటే, ఇల్లు, దుకాణం—దుకాణం ఇల్లూ—అవసరమైనప్పుడు బ్యాంకు—అంతే! ప్రతీ గురువారం తప్ప నీకు బ్యాంకుకి వెళ్ళే అవసరం వుండదనుకుంటాను..."

"ఇది దుర్మార్గం! నా కెన్నో పనులు..."

"నోరు మూసుకో; చెవులు రిక్కించు! పై ప్రదేశాలకి తప్పా మరెక్కడికేనా వెళ్ళాలంటే నేను నిన్ను పలకరించినప్పుడే నా పర్మిషన్ తీసుకోవాలి. నువ్వు వెళ్ళాల్సిన ప్రదేశం, సమయం వగైరా నాకు వివ

రించాలి...."

"మిస్టర్ ...." రంగనాథం అడ్డు తగిలాడు.

"ఈ షరతుల్ని పాటించకపోతే ఏం జరుగుతుందో నీకు చెప్పాల్సిన అవసరంలేదు!"

రంగనాథం చెవిలో ఫోన్ క్లిక్ మంది.

# 5

"మిస్టర్ టెంపో, అయామ్ రంగనాథం. 'గజం టెక్స్టైల్స్' ప్రొప్రయిటర్ని."

టెంపో అతన్ని నవ్వుతూ చూశాడు. "గజమా, మాటరా?"

రంగనాథం నవ్వడానికి వ్యర్థప్రయత్నం చేశాడు. "గజమే. నా భార్య పేరు గజలక్ష్మి. ఆమె తండ్రి ఇచ్చిన పైకంతో వ్యాపారం స్థాపించాల్సిన గతి పట్టింది నాకు. అందుకే షాపుకి ఆమె పేరు పెట్టాల్సి వచ్చింది" అంటూ ఆగాడతను.

"చెప్పండి" డిటెక్టివ్ టెంపో హెచ్చరించాడు.

"మిస్టర్ టెంపో, నేను భయంకరమైన కష్టంలో ఇరుక్కున్నాను" అంటూ రంగనాథం ఆగాడు. సిగరెట్ ముట్టించి టెంపో చిరునవ్వుతో చూశాడు. ఏదో కష్టంలో ఇరుక్కుంటేగానీ మనుషులు తనలాంటివాళ్ళ దగ్గరికి రారు!

"నేను ఇరుక్కున్న కష్టం గురించి కొన్ని విషయాల్ని మీకు చెప్పలేను..." రంగనాథం మళ్ళీ ఆగాడు.

టెంపో అతన్ని ఆశ్చర్యంగా చూశాడు. పెదాల మధ్యనుంచి సిగరెట్ ఇవతలికి లాగి, ఏదో చెప్ప బోయాడు. అతనికి అవకాశం యివ్వకుండా రంగనాథం ప్రారంభించాడు:

"ఎవరో నన్ను బ్లాక్ మెయిల్ చేస్తున్నారు. మొదటి వారం అయిదు వందలూ, రెండో వారం వెయ్యీ, మూడో వారం రెండు వేలూ—ఇలా రెట్టింపు చేస్తూ అతనికి చెల్లిస్తూ వచ్చాను...." రంగనాథం ఆగి, కరోనా వెలిగించాడు.

డిటెక్టివ్ టెంపో కనుబొమలు నుదుర్ని పైకి తోస్తూ లేచాయి. "వారం వారం రెట్టింపు మొత్తాల్లో బ్లాక్ మెయిల్! కొత్తరకంగా వుంది. ఎప్పుడు, ఎట్లా ప్రారంభమైందో, వాయిదా ఎలా చెల్లించాలో చెప్పండి!"

రంగనాథం నిట్టూర్చి ప్రారంభించాడు: "....ఏడో శుక్రవారం ముప్పై రెండు వేలు చెల్లించాను. ఎనిమిదో శుక్రవారం—నిన్న లక్ష రూపాయలు ముట్టజెప్పాను...."

టెంపో ఆశ్చర్యంగా చూశాడు. "అరవై నాలుగు బదులుగా లక్ష ఎందుకు యిచ్చారు?"

రంగనాథం నిట్టూర్పు పాముబుసలాగా ధ్వనించింది. "అతనెవరో కనిపెట్టడానికి ప్రయత్నించాను. ఎన్నో వారాలపాటు మల్టిప్లై చేస్తూ వాడికి చదివింపులు చేయలేను! నా ప్రయత్నాన్ని అతను పసిగట్టేశాడు. ముప్పై ఆరు వేలు పెనాల్టీ వడ్డించాడు! మిస్టర్ టెంపో, ఆ స్కౌండ్రల్ ఎంత దుర్మార్గుడో, అంత తెలివైనవాడిలా వున్నాడు."

"గుంటనక్కకి తెలివిజాస్తీ! అన్నట్టు అతన్ని కని పెట్టడానికి ఎలా ప్రయత్నించారు?" టెంపో ప్రశ్నించాడు.

రంగనాథం ఇబ్బందిగా కదిలాడు. మెల్లిగా తల పంకించాడు. "ఆ ప్రయత్నంలో జ్వాల సహాయం తీసు

టున్నా. జ్వాల నా షాపులో పని చేస్తోంది లెండి. చురుకైన అమ్మాయి...." అతను ఆగుతూ ఆగుతూ అంతా వివరించాడు.

అంతా విన్న టెంపో చిన్నగా ఈల వేశాడు. "మీ బ్లాక్ మెయిలర్ నిజంగానే ఆరితేరినవాడు! మిస్టర్ రంగనాథం, ఇంతకీ నన్నేమి చేయమంటారు?"

రంగనాథం ఆశ్చర్యంగా చూశాడు. "అలా అడుగుతారేం. ఆ బ్లాక్ మెయిలర్ ఎవడో—వాణ్ని మీరు కనిపెట్టాలి. పై శుక్రవారం లోటా రెండు లక్షలు ముట్టజెప్పే శక్తి నాకులేదు. ఇప్పటిదాకా లక్షా అరవైమూడు వేలపైగా వాడికి నైవేద్యం పెట్టాను! నా భార్యకి తప్పుడు లెక్కలు చూపించి, బ్యాంకులోదంతా ఊడ్చి, రెండువందల చీరని నూటయాభై రూపాయల రేటుకి తెగనమ్మి, ఎలాగో సర్దాను. ఇంక ఇల్లూ, షాపూ, స్కూటరూ తప్ప ఏమీలేదు. నగలు నా భార్య ఒంటి మీదే తాపడం అయిపోయివున్నాయి. ప్రయత్నిస్తే ఆ బ్లాక్ మెయిలర్ నుంచేనా లాగొచ్చేమోకానీ, గజలక్ష్మి నుండి నగల్ని తీసుకోలేం!" రంగనాథం చిన్నగా నవ్వుతూ అన్నాడు.

డిటెక్టివ్ టెంపో కుర్చీలోంచి లేచాడు. మెల్లిగా కిటికీముందు నిలబడి బైటికి చూస్తూండిపోయాడు. రెండు క్షణాల తరువాత గిరుక్కున వెనుదిరిగి, రంగనాథం మొహంలోకి చూశాడు.

"రంగనాథంగారూ, వెంటనే వెళ్ళి పోలీసుల్ని కలుసుకోండి!"

రంగనాథం ఉలిక్కిపడ్డాడు. అయోమయంగా డిటెక్టివ్ టెంపోని చూశాడు. "మిస్టర్ టెంపో, అది

అసంభవం! అందుకే మీ దగ్గరికొచ్చాను...."

డిటెక్టివ్ టెంపో మాట్లాడకుండా చూశాడు.

"పోలీసుల దాకా వస్తే బ్లాక్ మెయిలర్ నన్ను సర్వ నాశనం చేస్తాడు! అదీగాక నా విషయం దండోరా వేసుకోడం నాకిష్టంలేదు."

టెంపో అర్థమైనట్టు తల పంకించాడు. "మిస్టర్ రంగ నాథం, మిమ్మల్ని అతను ఎందుకు బ్లాక్ మెయిల్ చేస్తు న్నాడు?"

"డబ్బుకోసం!" రంగనాథం తడుముకోని జవాబిచ్చాడు.

టెంపో చిన్నగా నవ్వాడు. "నా ప్రశ్న మీకు అర్థం కాలేదు! ఏ 'ఆధారం'తో అతను బ్లాక్ మెయిల్ చేస్తు న్నాడు?"

"మిస్టర్ టెంపో, కొన్ని విషయాల్ని మీకు చెప్పలే నన్నాను. వాటిలో ఇది కూడా ఒకటి!" రంగనాథం చిరునవ్వుతో అన్నాడు.

టెంపో అతన్ని తిన్నగా చూశాడు. "ఎందుకు చేస్తు న్నాడో తెలీకుండా, ఎవరు బ్లాక్ మెయిల్ చేస్తున్నారో తెలుసుకోడం అంత సులభంకాదు!"

"అయామ్ సారీ, సులభం కాకపోయినా మీరు కనుక్కో తీరాలి!"

డిటెక్టివ్ టెంపో అతన్ని చిరునవ్వుతో చూశాడు. "నా పరిశోధనలో మీరు దాస్తున్న విషయం బైట కుంది!"

రంగనాథం కళ్ళల్లో అదుర్దా ప్రత్యక్షమై క్షణంలో మాయమైంది. "మిస్టర్ టెంపో, బైటపడినా మీరు దాన్ని బయటపెట్టకూడదు...."

డిటెక్టివ్ టెంపో తన కుర్చీలో కూచుని, రంగనాథం

కళ్ళలోకి తదేకంగా చూశాడు. "మిస్టర్ రంగనాథం జ్వాలతో ఏమిటి మీ సంబంధం?"

రంగనాథం ఉలిక్కిపడ్డాడు. అతని కళ్ళల్లో ఎర్రజీర పాకింది. "అంటే?"

"జ్వాల మూలంగా మీరు మంటల్లో యిరుక్కున్నారు!" టెంపో నవ్వాడు.

రంగనాథం పెదాలు వణికాయి. "మిస్టర్ టెంపో మీరు...."

"కమాన్! చెప్పండి. అవునా, కాదా?" టెంపో అడ్డొస్తూ హెచ్చరించాడు.

"ఆల్ రైట్ ...మీకెలా తెలుసు?" రంగనాథం కంఠంలో ఓటమి ధ్వనించింది.

"ఆ అమ్మాయితో మీకు అక్రమ సంబంధం వుంది. అవునా?" టెంపో మరో ప్రశ్న రువ్వాడు.

రంగనాథం కళ్ళూ, నోరూ తెరుచుకునే వుండిపోయాయి. అతని మొహం పాలిపోయింది. చిరునవ్వుతో మెరుస్తున్న టెంపో మొహంలోకి నీరసంగా చూశాడతను. "మీకు....మీకెలా తెలుసు?" అతని కంఠం నూతిలోంచి ధ్వనించింది.

"పరిశోధనలో అది బైటపడుతుందన్నాను, ఇందాకే!" టెంపో గంభీరంగా అన్నాడు. రంగనాథం అయోమయంగా చూశాడు.

"నలుగురికీ తెలీకుండా మీరు దాచిపెడుతున్నది ఏదో వుంటేగానీ, అది తనకి దొరికితేగానీ ఎవరూ మిమ్మల్ని బ్లాక్ మెయిల్ చేయరు. అవునా?" టెంపో అడిగాడు

రంగనాథం బలహీనంగా బుర్ర ఆడించాడు.

"మీ బలహీనత, మీ రహస్యం జ్వాల అని నేను

గ్రహించాను. మీ భార్య గురించి మీరు సదభిప్రాయం వ్యక్తం చేయలేదు. మీరు జ్వాల సహాయం తీసుకున్నారు. సహజంగా బ్లాక్ మెయిలర్ మరో వ్యక్తికి విషయం చెప్పొద్దని మిమ్మల్ని భయపెట్టివుంటాడు. కాకపోయినా, మీరు మీ 'రహస్యం' తెలిసిన మరో వ్యక్తి సహాయం తీసుకునే సాహసం చేయరు. అంచేత, ఆ రహస్యం మీ ఇద్దరిమధ్యా జన్మించి, ఎదిగివుండాలి. భార్య అంటే సదభిప్రాయంలేని భర్త మధ్యా, 'ముసలైన' మరో యువతి మధ్యా జన్మించి ఎదిగే రహస్యం ఒక్కటే: అక్రమ సంబంధం!" టెంపో గంభీరంగా అన్నాడు.

రంగనాథం ఉక్కిరిబిక్కిరవుతూ చూశాడు. చెమట పూసల్లా అతని మొహాన్ని కప్పేసింది. వెర్రివాడిలా కాసేపు టెంపో వైపు చూస్తూ వుండిపోయాడతను. టెంపో సిగరెట్ వెలిగించాడు.

రంగనాథం మొహంమీద మెల్లగా నవ్వు వ్యాపించింది. "మిస్టర్ టెంపో, మీ రీజనింగ్ అద్భుతం! కంగ్రాచ్యులేషన్స్. మీ పరిశోధన ముసుగు తొలగించి అసలు వ్యక్తిని మనకి చూపిస్తుందన్న నమ్మకం ఏర్పడింది నాకు. మీకు అంతా చెప్పేస్తాను. నన్ను కబంధహస్తం లోంచి తప్పించండి!"

"మిస్టర్ రంగనాథం, అసలు వ్యక్తి చిక్కాక నేను ఏం చేయాలి? చట్టానికి అప్పగించాలిగా?" టెంపో నవ్వుతూ అడిగాడు.

"అవసరంలేదు. వాడికి శిక్షపడక పోయినా ఇప్పటి దాకా చెల్లించినది రాకపోయినా ఐ డోంట్ కేర్! నన్ను తోలుబొమ్మలా ఆడిస్తూ, వాడిచేతిలో ఇరుక్కున్న ఎవిడెన్స్‌ని మీరు ఎలాగో—ఎలాగైనా సరే సంపా

యిస్తే చాలు!" రంగనాథం ఉద్రేకంతో అన్నాడు.

"అతని చేతిలో ఇరుక్కున్న ఆ ఎవిడెన్స్ ఏమిటో నన్నే ఊహించమంటారా?" టెంపో నవ్వుతూ అడిగాడు.

"అవసరంలేదు. అంతా కక్కేస్తాను. శుక్రవారం లోగా మీరు వాడి వాడికోరలు పీకెయ్యాలి! లేకపోతే నేను సర్వనాశనం అయిపోతాను."

"మీరేకాదు; జ్వాల కూడా సర్వనాశనం అయిపోతుంది!" టెంపో నవ్వుతూ అన్నాడు.

"అయామ్ సారీ. మరిచిపోయాను" రంగనాథం సిగ్గుపడుతూ అన్నాడు.

"అవసరం వచ్చినప్పుడు మనిషి కంఫర్టబుల్‌గా ఇతర్ల గురించి మరిచిపోతాడు!" డిటెక్టివ్ టెంపో గంభీరంగా అన్నాడు. "ఆల్‌రైట్, మీరు చెప్పకూడదనుకున్న విషయాలు చెప్పండి!"

రంగనాథం నిట్టూర్చాడు. తగ్గుస్వరంలో ప్రారంభించాడు.

అడ్డుతగలకుండా డిటెక్టివ్ టెంపో రంగనాథం చెప్పిందంతా విన్నాడు.

"మిష్టర్ రంగనాథం, తల్లిచాటు నుంచి దూరంగా వెళ్ళిపోయిన కోడిపిల్లల్ని తన్నుకుపోయే గద్దలా అతను మీరు పడేసిన కవర్లని తన్నుకుంటూ మాయమైపోయాడు. మళ్ళీ అతను తన పంజా విప్పేదాకా మనం ఏమీ చేయలేం."

"అతను పంజావిప్పితే నేను తట్టుకోలేను! రెండు లక్షలు! ఇటీజ్ హైలీ ఇంపాసిబుల్!" రంగనాథం కంగారుగా అన్నాడు.

"రెండు లక్షల్ని కవర్లో పెట్టి డస్టుబిన్‌లో గిరా చేయమని ఈసారి అతను చెప్పడు. జాగ్రత్తగా పార్సెల్ని అందుకుంటాడు. ఆ సమయంలో మనం వల విసరాలి!"

"మీరు చెప్పేది బావుంది. అయితే రెండు లక్షలు నా దగ్గర లేవు. షాపుని వేలం వేయాల్సిందే...." రంగనాథం ఆగి సాలోచనగా చూశాడు. "మిస్టర్ టెంపో, ఎలాగా మీరు వాణ్ణి పట్టేస్తారు. పార్సెల్లో నోట్లకి బదులు పేపర్ ముక్కలు వుంచేస్తాను!"

తన సమయస్ఫూర్తికి మురిసిపోతున్న రంగనాథం కళ్ళల్లోకి టెంపో నవ్వుతూ చూశాడు.

"పట్టుకోడానికి ప్రయత్నిస్తాను. అంతే! అతను మనకి దొరక్కపోతే, పేపరుముక్కలు పెట్టిన మీరు సంపూర్ణంగా మునిగిపోతారు. మోసం చేసిన మిమ్మల్ని, అతను ఊరికే వదలడు!"

రంగనాథం వెర్రిగా చూస్తూ తలపంకించాడు. "అయితే .. అయితే ఏం చేయమంటారు?" తడబడుతూ అడిగాడతను.

"అతను పట్టుబడితే, సొత్తం మనకి చిక్కినట్టే. లక్షలాది రూపాయల్ని అంత తొందరగా ఖర్చు చేయడతను! అంచేత రెండు లక్షల్ని సర్దండి. అందివ్వండి. మీరు ఇంకా తన కాలికింద కీటకంలా వున్నారన్న నమ్మకం అతనిలో వుండాలి. రెండు లక్షల్తో జారుకున్నా, వారం తరవాత మళ్ళీ మీకోసం గాలం వదుల్తాడు!" టెంపో సాలోచనగా అన్నాడు.

రంగనాథం తల అడ్డంగా, ఆవేశంగా వూగింది.

"అసంభవం!"

"అది అసంభవమైతే, ఏమిటి సంభవిస్తుందో నేను చెప్పలేను!" డిటెక్టివ్ టెంపో నవ్వుతూ అన్నాడు.

రంగనాథం నీళ్ళల్లో మునిగిపోతున్న ఈతరాని వ్యక్తిలా చూశాడు. ఏదో కూనికలూ, తీసికేతలూ వేసుకుంటున్నవాడిలా వుండిపోయాడు. కింది పెదవిని కసిగా కొరుక్కున్నాడు. "ఆల్ రైట్ మిస్టర్ టెంపో. నా సర్వశక్తుల్నీ కేంద్రీకరించి, ఈసారికి వాడికి ముడుపు చెల్లిస్తాను.... ఆ తరవాత..."

"తరవాత సంగతి తరవాత!" టెంపో అడ్డుకగులుతూ అన్నాడు.

"మీ ఫీజు...." రంగనాథం అనుమానిస్తూ అన్నాడు.

"మొదట బ్లాక్ మెయిలర్ ఫీజుల గురించి తాపత్రయ పడండి!" టెంపో నవ్వుతూ అన్నాడు.

రంగనాథం మొహంమీద చిరునవ్వు కృతజ్ఞతా పూర్వకంగా ప్రత్యక్షమైంది. "మిస్టర్ టెంపో మరో సంగతి: వాడు అనుక్షణం నన్ను గమనిస్తున్నాడనిపిస్తోంది. నేను కదిలితే, నా వెనక ఎవడో ఒకడు కదులుతున్నట్టు అనిపిస్తోంది. అందుకే ఈ హోటల్ గదిలో మిమ్మల్ని కల్సుకునే ఏర్పాటు చేశాను. ఇప్పుడూ వాడు నన్ను చూస్తున్నాడేమో! ఎంతో జాగ్రత్తగా ఇక్కడికి వచ్చాను.... అయినా...."

"డోంట్ గెట్ వర్రీడ్! ఇది వాడు గమనించివుంటే శుక్రవారం ఇంకోంచెం పెనాల్టీ వడ్డిస్తాడు!"

"నా ఫోన్ ట్యాప్ చేయబడిందేమో అని భయంగా వుంది...."

టెంపో నవ్వాడు. "ఈ అపాయింట్ మెంట్ ఫిక్స్

అయినప్పుడే, మీరు ఫోన్ చేసినప్పుడే నాకా అనుమానం కలిగింది. ఆ అనుమానాన్ని నేను ముందు జాగ్రత్తతో నివృత్తి చేసుకున్నా. మీ టెలిఫోన్ క్లియర్ గా వుంది!"

రంగనాథం తేలిగ్గా నిట్టూర్చాడు. "థాంక్స్ ఎ లాట్, మిష్టర్ టెంపో! వాడు యేదైనా తెలియకేయగానే, మీకు తెలియజేస్తాను...." అంటూ లేచాడతను.

టెంపో అతన్ని ప్రశ్నార్థకంగా చూశాడు. "మిష్టర్ రంగనాథం, మీ షాపులో పనిచేసేవాళ్ళలో యెవరో ఒకరు బ్లాక్ మెయిలర్ అయ్యే అవకాశం వుందా?"

రంగనాథం తల అడ్డంగా వూగించాడు. "ముగ్గురు మగాళ్ళూ, ఆరుగురు ఆడపిల్లలూ పనిచేస్తున్నారు. మగాళ్ళలో మేనేజర్ గా వున్న సాంబమూర్తి ఒక్కడే కొంచెం పెద్దవాడు. షాపు ప్రారంభించినప్పట్నుంచీ అతను నా దగ్గరే వున్నాడు. నమ్మినబంటు. తతిమ్మా ఇద్దరూ కుర్రాళ్ళు. జ్వాల తప్ప అయిదుగురు ఆడపిల్లలూ ఇరవై యేళ్ళ లోపువాళ్ళే. అందరూ అమాయకులే. నిజం చెప్పాలంటే అంత తెలివితేటలు వాళ్ళకి వుండివుంటే నూటఇరవై రూపాయలకి నా దగ్గర చాకిరీ చేస్తూ కూర్చోరు!"

టెంపో చిన్నగా నవ్వాడు. "వాళ్ళకి లేకపోవచ్చు. వాళ్ళకి సంబంధించిన వాళ్ళెవరికో, వాళ్ళద్వారా మీ ఇద్దరి గురించీ...."

"మిష్టర్ టెంపో, జ్వాలకీ, నాకూ మధ్య జరిగే దాన్ని వాళ్ళు ఊహించలేరు కూడా! మేం .... అంత జాగ్రత్తగా వున్నాం...."

"ఆల్ రైట్; వెళ్ళిరండి" టెంపో నవ్వుతూ అన్నాడు.

రంగనాథం అంత జాగ్రత్తగా లేడని బ్లాక్ మెయిలర్ నిరూపించాడు!

# 6

రంగనాథం ఎన్నికల ఫలితం కోసం యెదురు చూస్తూ, దాదాపు ప్రసవ వేదన పడుతున్న రాజకీయ నాయకుడిలా గదిలో పచార్లు చేస్తున్నాడు.

ఎనిమిదోసారి అతను రిస్టువాచీ తీసుకున్నాడు. టెలిఫోన్ మోగడానికి ఇంకా అయిదు నిమిషాల వ్యవధి వుంది.

అయిదు నిమిషాల్లో అతని కంఠం కర్కశంగా, అమర్యాదకరంగా తనని బెదిరిస్తుంది; ఆజ్ఞాపిస్తుంది. తను చెప్పేది వింటే అతను యేమంటాడో....ఆలోచిస్తూ రంగనాథం చుట్టని ఆర్పేశాడు. కుర్చీలో కూలబడి, ఆగ్రహంతో టెలిఫోన్ని చూశాడు. అతనికి తనమీదా, భార్యమీదా, బ్లాక్ మెయిలర్ మీదా కోపం కొండలా పెరుగుతోంది. జ్వాలతో యేర్పరచుకున్న సంబంధం తనని ఇలా, ఇంతలా కాల్చిపారేస్తుందని ఊహించలేక పోయాడు తను....

రంగనాథం ఉలిక్కిపడి, మోగుతున్న టెలిఫోన్ని తటాలున అందుకున్నాడు. రిసీవర్ని చెవికి ఆనించి, బరువుగా ఊపిరిపీల్చి వదిలాడు.

“రంగనాథం?” బ్లాక్ మెయిలర్ కంఠం అతని చెవిలో గింగుర్లు తిరిగింది.

“ఆ..” అప్రయత్నంగా అన్నాడతను.

“నైవేద్యాన్ని శుభ్రంగా బ్రౌన్ పేపర్లో ప్యాక్ చెయ్. సరిగ్గా పన్నెండు గంటలకి నీ స్కూటర్లో బయల్దేరు. ట్రాఫిక్ ఐలండ్ దగ్గర స్కూటర్ని వదిలెయ్. నలభై

రెండో నంబరు బస్సెక్కు. టెర్మినస్ దాకా టిక్కెట్టు తీసుకో. పార్శిల్ ని సీటుమీద మరిచిపోయి, టెర్మినస్ లో దిగిపో. ముప్ఫైమూడో నంబరు బస్సెక్కు....”

“ఒక్క క్షణం....” రంగనాథం అడ్డుతగిలాడు. అతని నుదురు చెమటతో తడుస్తోంది.

“మాట్లాడేప్పుడు అడ్డుతగలొద్దని నీకు ఇదివరకే చెప్పాను! ముప్ఫైమూడో....”

“ఇంపాసిబుల్!” రంగనాథం కంగారుగా అరిచాడు.

“వాట్!” బ్లాక్ మెయిలర్ కంఠంలో కోపంలేదు; ఆశ్చర్యం.

“పైకం.... పైకం సర్దుబాటు కాలేదు....” రంగనాథం తడబడ్డాడు.

“రంగనాథం, రంగువెలిసిపోయేలా నీ బతుకుని బజార్లో ఉతికేస్తాను! నాతో సరసాలు....”

“అయామ్ సారీ! ప్లీస్ నన్ను నమ్ము! నువ్వడిగింది.”

“చాలా చిన్న మొత్తం!”

“నీకు చిన్న మొత్తమే. నాకు కాదు! బీ రీజనబుల్ మరో వారం గడువియ్యి. ఎలాగో తంటాలుపడి....”

“షటప్! నన్ను తంటాలు పెట్టడానికి టైం అడుగుతున్నావ్. పగ్గం అతని చేతిలో వున్నంతకాలం మనిషిని ఆవు యేమీ చేయలేదు, రంగనాథం. నీ ముక్కుకి తగిలించబడిన తాడు యెంతకాలమైనా నా చేతిలో వుంటుంది!” అతను సగర్వంగా నవ్వాడు. ఆ నవ్వు కొరడా దెబ్బలా రంగనాథాన్ని తాకింది.

“యూ ఆర్ మిస్టేకన్. నాకలాంటి ఉద్దేశంలేదు! సర్దడానికి విశ్వప్రయత్నం చేశాను. వచ్చే శుక్రవారం తప్పకుండా చెల్లిస్తాను. మరో సంగతి! యేదో మొత్తం

తీసుకొని, నాకు విముక్తి కలిగించు!" రంగనాథం ప్రాధేయపడ్డాడు.

"ఆల్ రైట్ .... నెక్స్ట్ ఫ్రైడే నువ్వు పర్దాలి. సర్దితీరుతావు! ఇది నీకు నేను మంజూరుచేస్తున్న మొట్టమొదటి, చిట్టచివరి వాయిదా! ఇంక వాయిదాలుండవ్. కక్కమన్నప్పుడు నువ్వు కక్కాల్సిందే! వచ్చేవారం నువ్వు యెంత చెల్లించుకోవాలో తెలుసుగా?"

రంగనాథం తేలిగ్గా నిట్టూర్చాడు. "తెలుసు, రెండు...."

అవతల కంఠం పగలబడి నవ్వింది. "అమాయకత్వం నటించొద్దు! ఈ వారంది రెండూ, పైవారం బాపతు నాలుగూ— మొత్తం ఆరు లక్షలు కక్కాలి నువ్వు!"

రంగనాథం వొళ్ళు ఒక్కసారిగా చల్లబడింది. "నో.. ఆరు నావల్లకాదు! రెండు...."

"నీవల్లకాదని మరోసారి చెప్పు!" అతని కంఠం కర్కశంగా సవాలు చేసింది. రంగనాథం గుటకలు మింగుతూ వుండిపోయాడు.

"రంగనాథం, వచ్చేవారం ఆరులక్షలు రెడీగా వుంచు. పొరపాటుచేస్తే ఏం జరుగుతుందో నీకు అర్థమయ్యేలా చెప్తాను; నువ్వూ, నీ జ్వాలా వందలాది క్యాసెట్లులో బంధించబడి దేశమంతా పంపిణీ చేయబడతారు!"

"నో!" రంగనాథం బొంగురుగా అరిచాడు.

"యస్, రంగనాథం! శుక్రవారం నువ్వు ఆరూ ఇవ్వకపోతే, శనివారం ఆరవైకి మీ బూతు బొమ్మల్ని వేలం వేసేస్తాను! ఈలోగా తిక్క వేషాలు వేయొద్దు!"

"ప్లీజ్ .... బీ రీజనబుల్ ... అంత మొత్తం నేను

ఆర్జించలేను.... సర్ద లేను...."

అతను గొల్లుమని నవ్వాడు. తటాలున ఆ నవ్వు ఆగింది.

"తనకిందున్న గుడ్లు యెన్నో కోడిపెట్టకి తెలీక పోవచ్చు. కానీ, మనిషికి తెలుసు! అనుకుంటే నువ్వు ఆర్జించగలవు! నీలాంటివాడి చేతికి వద్దంటే కూడా వస్తుంది డబ్బు!"

అటువైపున డిస్కనెక్టు చేయబడింది. రిసీవర్ని పెట్టేయడం మరిచిపోయి రంగనాథం వెర్రివాడిలా కూచుండిపోయాడు.

అయిదునిమిషాల తరవాత తెప్పరిల్లి, రంగనాథం సాలోచనగా ఒక నంబరు తిప్పాడు.

"డిటెక్టివ్ టెంపో."

"మిష్టర్ టెంపో, రంగనాథం మాట్లాడుతూంట. అతను ఫోన్ చేశాడు...." అంటూ రంగనాథం ప్రారంభించాడు. బ్లాక్ మెయిలర్ తో సాగిన సంభాషణని పూసగుచ్చినట్టు వినిపించాడు.

"రంగనాథంగారూ, ఇవాళ అతని కోటా చెల్లిస్తానన్నారు నాతో. ఎందుకివ్వలేదు. అడిగారా?" రంగనాథం కథనం విన్నాక టెంపో ప్రశ్నించాడు.

రంగనాథం నిట్టూర్చాడు. "సర్దుబాటు కాలేదు. లావాదేవీలన్నింటినీ నా భార్యే కంట్రోల్ చేస్తోంది. గుడ్డలమ్మి, పోగైన పైకాన్ని బ్యాంకులో జమచేసి, ఆమెకి లెక్కలు వివరించడమే రంగనాథం అనబడే ఈ నమ్మినబంటు చేసేపని!" అతని కంఠంలో ఉక్రోషం, కసీ ధ్వనించాయి.

"ఐసీ....అయినా, ఆమెకి ఏదో చెప్పి సర్దాల్సింది!"

టెంపో అన్నాడు.

"ఏదో కాదు; యెంతో చెప్పాను, బి జె నె వ్ డీలింగ్స్‌లో నీకు మీదికి వచ్చిందన్నాను. నా వ్యాపార పై పుణ్యమంతా ఉపయోగించాను. ఆవిడకి అర్థం కాలేదు. అర్, ఎండిపోయిన గడ్డనుంచీ మీరు నీళ్ళు పిండగలరు. మా ఆవిడనుంచీ పైసా తీసుకోలేరు! చివరకి, దామోదర్ కూడా చెప్పిచూశాడు.."

"దామోదర్ ఎవరు?" డిటెక్టివ్ టెంపో ప్రశ్నించాడు.

"నా భార్య తమ్ముడు. సాధారణంగా నా భార్య తన తండ్రిమాట, తమ్ముడిమాటా కాదనేదికాదు. ఈసారి దానికేవో తిక్క రేగింది. అది సంతకం చేస్తేగాని బ్యాంకులోంచీ డబ్బురాదు!" రంగనాథం చాడీ చెప్తున్నట్టు అన్నాడు.

"ఆల్ రైట్.. మీ ప్రయత్నంలో మీరుండండి. నా ప్రయత్నంలో నేనుంటాను" టెంపో సలహా యిచ్చాడు.

"మిష్టర్ టెంపో, గోడకి యెదురుగా నుంచున్నాను. వెనక్కి తిరగలేను; అటు పైపుకి దూకలేను! మీ ప్రయత్నమే ఫలించాలి! అయామ్ హెల్ప్‌లెస్!" రంగనాథం దీనంగా అన్నాడు.

"చూద్దాం."

## 7

డిటెక్టివ్ టెంపో కాఫీ తాగేసి, సిగరెట్ వెలిగించాడు.

గత రాత్రినుంచీ తను సాగించిన పరిశోధన అట్టే తృప్తికరంగాలేదు. ఆలోచిస్తూ టెంపో కాళ్ళని ముందున్న టేబుల్ మీద మోపాడు. తృప్తికరంగాలేని పరిశోధన

అతనిలో ఏదో అర్థంలేని ఆలోచనల్ని రేపుతోంది. టెలిఫోన్ మోత అతని ఆలోచనలకి అంతరాయం కలిగించింది.

భుజానికీ, తలకీ మధ్య రిసీవర్ని ఇరికించి, వాల్చిన తలతో నొక్కిపెట్టి, పెదాల మధ్యనుంచీ సిగరెట్ని ఇవతలికి లాగాడు టెంపో.

"యస్?"

"గుడ్ మార్నింగ్ గురూ!" ఇన్స్పెక్టర్ పృధ్వీరావ్ కంఠం హుషారుగా ధ్వనించింది.

"పొద్దుటే పోలీసులు 'గుడ్ మార్నింగ్' అంటూ ఫోన్ చేస్తే, అది 'బాడ్ మార్నింగే' అని నా నమ్మకం!" టెంపో చిన్నగా నవ్వాడు. "వాట్ న్యూస్?"

పృధ్వీరావ్ పకపక నవ్వాడు. "యూ మే బీ రైట్! టెంపో, అఘమేఘాలమీద నా ఆఫీసుకి వస్తావా?"

"ఏమిటి కథ? నీ ఆఫీసులో యెవర్నైనా, ఎవరేనా కిడ్నాప్ చేశారా?" డిటెక్టివ్ టెంపో నవ్వుతూ ప్రశ్నించాడు.

ఇన్స్పెక్టర్ పృధ్వీరావ్ యెవరో చక్కిలిగింతలు పెట్టినట్టు నవ్వాడు. "అసలు సంగతి వింటే నువ్వు జోకులు రువ్వవు; నవ్వవు!"

"వాట్?" టెంపో కాళ్ళని కిందికి దించి అరిచాడు.

"రంగనాథం నీ క్లయింటా?" ఇన్స్పెక్టర్ పృధ్వీరావ్ ప్రశ్నించాడు.

"రంగనాథం?"

"బి. రంగనాథం, గజం టెక్స్టైల్స్ ప్రొప్రయిటర్..."

టెంపో క్షణకాలం తటపటాయించాడు. శని వ్యవ

హోరం పోలీసుల్దాకా వెళ్ళకూడదన్నాడు రంగనాథం. ఆలోచిస్తూ టెంపో నుదుర్ని చిట్లించాడు.

"గుర్తున్నట్టు లేదు..."

ఇన్‌స్పెక్టర్ పృథ్వీరాజ్ చిన్నగా నవ్వాడు. "కమాన్, టెంపో. నీ క్లయింటు కాన్ఫిడెన్స్‌ని నువ్వేం భంగపరచనక్కర్లేదు! అతను నా ప్రశ్నలకి సరిగ్గా సమాధానాలివ్వలేడు, టెంపోగారు, టెంపోగారంటూ జపం చేస్తున్నాడు!"

"ఏమిటి సంగతి? అతన్నెందుకు ప్రశ్నిస్తున్నావ్?" టెంపో ఆశ్చర్యంతో అరిచాడు.

"వ్యాపారంలో మూతికాలే పరిస్థితి యెదురైతే, బట్టల వ్యాపారి తెలివిగా మంటరాజేసి షాపు తగలెట్టేసి, ఏమీ ఎరగనివాడిలా నిద్రోతాడు! ఇన్సూరెన్స్‌వాళ్ళు రెండుచేతులా షాపతనికి చెల్లిస్తారు! ఇదంతా నీకు తెలుసుగా! రంగనాథంకూడా అదే చేశాడు..."

"వాట్?"

"రాత్రి రెండుగంటల ప్రాంతంలో అతను తన బట్టల షాపులోకి వెళ్ళాడు. అరగంట తరవాత ఇంటికి తిరిగి వెళ్ళాడు. పొద్దుటే షాపులోంచీ పొగ ఇవతలికి చిమ్ముతోంది. నిప్పులేందే పొగరాదు!"

"అంతా కళ్ళారా చూసినట్టు చెప్తున్నావ్! నీకెలా తెలుసు?"

ఇన్‌స్పెక్టర్ పృథ్వీరాజ్ సగర్వంగా నవ్వాడు. "మా పోలీసులకి సహస్ర నేత్రాలు! నీ కళ్ళతో చూస్తారు; నీ చెవులతో వింటారు! రాత్రి గస్తీ తిరిగే గూర్ఖా తేజ్‌బహదూర్ రెండు కళ్ళతో చూశాడు. చూసిందాన్ని శుభ్రంగా వర్ణించాడు."

టెంపో చెయ్యి రిసీవర్‌ని గట్టిగా పట్టుకుంది. "పృథ్వీ, అతన్ని అరెస్టు చేశావా?"

"ఈ మధ్య సిటీలో నాలుగు షాపులు ఇలాగే తగలబడ్డాయి. ఇన్సూరెన్స్ కంపెనీ గగ్గోలు పెడుతోంది. ఈ 'మంట'లో ఏముందో, మంట వెనక ఏముందో కనిపెట్టమని మమ్మల్ని పురమాయించారు.... అంచేత అతన్ని క్వశ్చనింగ్‌కి తీసుకొచ్చాను. అన్ని ప్రశ్నలకీ అతని సమాధానం ఒక్కటే: 'టెంపోగారు, టెంపోగారు!'"

టెంపో తటాలున లేచాడు. "అయిదునిమిషాల్లో అక్కడుంటాను! పృథ్వీ...."

"తొందరేం లేదు. అతను నీ క్లయింటో, కాదో నీకు గుర్తులేదుగా!" పృథ్వీరావ్ నవ్వుతూ అన్నాడు.

"వస్తాను. చూస్తాను. అప్పుడు గుర్తొస్తుంది!" అంటూ రిసీవర్ని పడేశాడు.

* * *

"టెంపోగారూ, నన్ను నమ్మండి. నేను ఆ దారుణం చేయలేదు!" రంగనాథం ఆవేశంతో, ఆవేదనతో అన్నాడు. ఒక్కరోజులో పదేళ్ళ వయసు పెరిగినట్టుందతనికి. జుట్టు చిందరవందరగా వుంది. వాళ్ళిద్దర్నీ ఇన్‌స్పెక్టర్ ఏకాంతంలో వదిలాడు.

"రాత్రి రెండుగంటల ప్రాంతంలో మీరు షాపు కెందుకు వెళ్ళారు?" టెంపో ప్రశ్నించాడు.

"పోలీసుల్లాగే మీరు ప్రశ్నిస్తున్నారు! నేను రాత్రి ఇంట్లోంచీ కదల్లేదు!" రంగనాథం ఉద్రేకంతో అన్నాడు.

"అయితే గూర్ఖా అబద్ధం చెప్పాడా?" టెంపో

ప్రశ్నించాడు.

"నిజం మాత్రం చెప్పలేదనిపిస్తోంది...."

"ఎందుకు? అతను మీకు శత్రువా?"

"అతనితో స్నేహితమే లేదు! శత్రుత్వం యెలా వస్తుంది?" రంగనాథం ఎదురు ప్రశ్న వేశాడు.

"మీరు షాపులో కెళ్ళారు, అతను పలకరించాడు, మీరు సమాధానం చెప్పారు...."

"నో!"

"....అరగంట తరవాత మీరు స్కూటర్ మీద ఇంటి కెళ్ళారు. అప్పుడతను మీ ఇంటిసమీపంలో వున్నాడు."

"ఆ గూర్ఖా వెధవ అబద్ధమాడుతున్నాడు!" రంగనాథం హుంకరించాడు. అతని కళ్ళు ఎర్రగా వున్నాయి.

టెంపో సిగరెట్ వెలిగించి పాకెట్ ని అతనివైపు విసిరాడు. రంగనాథం పాకెట్ ని టెంపోవైపుతోశాడు. జేబులోంచి సిగార్ తీసి వెలిగించాడు. టెంపో అతన్ని నవ్వుతూ చూశాడు

"మిస్టర్ రంగనాథం, మీరు అబద్ధమాడుతున్నారు!"

రంగనాథం ఎర్రటి కళ్ళు అదోలా చూశాయి. "ఎందుకు?"

"మీ షాపుని మీరు తగలబెట్టారు...."

"ఎందుకు?" రంగనాథం అరిచాడు, బొంగురుగా.

"అమాయకత్వం నటించకండి. కావాలంటే చెప్తాను: మీకు పెద్ద మొత్తంలో డబ్బు కావాలి. మరోవిధంగా సర్దే శక్తి మీకు లేదు. షాపు తగలబడితే, ఫైర్ యాక్సిడెంట్ పాలసీమీద ఇన్సూరెన్స్ కంపెనీ మీకు పుష్కలంగా డబ్బు చెల్లిస్తుంది!"

"మిస్టర్ టెంపో, ఇది ఘోరం! ఇన్సూరెన్స్ కంపెనీ

నా భార్యకు డబ్బు చెల్లిస్తుంది. వ్యాపారం పూర్తిగా ఆమె పేరిటే వుందని మీకు ఇదివరకే చెప్పాను!" రంగనాథం కంఠంలో విచారం, నిస్సహాయతా జంటస్వరాల్లా పలికాయి.

""కావచ్చు. ధారాళంగా డబ్బున్నప్పుడు యేదో సాకుతో ఆమెనుంచీ మీక్కావాల్సింది లాక్కోవచ్చు."

"మిస్టర్ టెంపో, ఇలా అనుమానించే పని పోలీసు వాళ్ళకి వదిలేయండి. మీ అన్వేషణ సాగించండి. అసలు వ్యక్తిని పట్టండి!" రంగనాథం ఉద్రేకంతో అన్నాడు.

డిటెక్టివ్ టెంపో తటాలున లేచాడు. "ఇన్‌స్పెక్టర్‌తో నేను చెప్తాను. మీరు ఇంటికెళ్ళండి.... అన్నట్టు మీరు నన్ను ఎందుకు నియమించుకున్నారో ఇన్‌స్పెక్టర్‌కి చెప్పారా?"

"లేదు. అడిగాడు. మీతో చర్చించాలన్నాను. ఎవరికీ చెప్పలేనని మీకు తెలుసు!" రంగనాథం బలహీనంగా అన్నాడు.

"ఓకే. తరవాత కలుస్తాను" అంటూ టెంపో జోరుగా బైటికి వెళ్ళిపోయాడు.

* * *

డిటెక్టివ్ టెంపో వేళ్ళు తలుపుమీద చప్పుడు చేశాయి. తలుపు తెరుచుకుంది. గళ్ళలుంగీ, నీలంరంగు బనీనూ ధరించిన తేజ్‌బహదూర్ ఎర్రటి కళ్ళతో ప్రశ్నార్థకంగా చూశాడు.

"క్యాహోనా సాబ్?"

"బహదూర్, నీతో మాట్లాడాలి...." అంటూ టెంపో చిన్న గదిలోకి ప్రవేశించాడు.

కింద పరిచిన చాపని వోసారి చూసి, తేజ్ బహ

దూర్ టొంపోవైపు తిరిగాడు. "అవ్ ...."

"డిటెక్టివ్ టొంపో."

తేజ్ బహదూర్ కళ్ళల్లో భయం, గౌరవం ప్రత్యక్షమయ్యాయి. అతని పెదవులూ, సన్నటి మీసాలూ కదిలాయి. కానీ మాటలు బైటికి రాలేదు.

"బహదూర్, రంగనాథం నీకు తెలుసా?" టొంపో ప్రశ్నించాడు.

"గజం టెక్స్టైల్స్ మాలిక్—రంగనాథం సాబ్ తెలుసు సాబ్ ...."

"రాత్రి అతన్ని నువ్వు చూశావ్. అదంతా వివరంగా చెప్పు!" టొంపో నవ్వుతూ అన్నాడు.

"అదంతా పోలీసులకి చెప్పేశాను, సాబ్...." తేజ్ బహదూర్ అనుమానిస్తూ అన్నాడు.

"పోలీసులకి ఏం చెప్పావ్?" టొంపో నవ్వుతూ ప్రశ్నించాడు.

"అదంతా తమకి యెందుకు సాబ్?"

"ఇన్‌స్పెక్టర్ పృథ్వీరావ్, నేనూ ఆ కేసుని చూస్తున్నాం...."

బహదూర్ కళ్ళల్లో అనుమానం మాయమైంది. "కూచోండి, సాబ్" అన్నాడతను.

"ఫర్వాలేదు. త్వరగా వెళ్ళాలి."

"రాత్రి రెండు గంటలు దాటింది సాబ్. గజం టెక్స్టైల్స్ సమీపంలో నడుస్తున్నాను. రంగనాథం సాబ్ షాపుముందు స్కూటర్ ఆపి, ఆగాడు. నేను షాపుని సమీపించేసరికి ఆయన తాళాలు తెరిచి, షట్టర్‌ని పైకి తోశాడు. నమస్తే చెప్పి, ఆయన్ని పలకరించాను. ఆ వేళప్పుడు షాపులో పనేమిటని అడిగాను. స్టాక్ వచ్చిం

దనీ, డెలివరీ తీసుకోవాలనీ అన్నారు."

"బహదూర్, షాపుముందు లైటుందా? అతన్ని నువ్వు బాగా చూశావా?" టెంపో ప్రశ్నించాడు.

"షాపు ముందు లైటులేదు సాబ్. స్కూటర్ దిగి, నడిచేటప్పుడు, కొంచెం దూరంనుంచీ చూశాను. తరవాత స్కూటర్ దగ్గరగా ఆగాను. స్కూటర్ ఆయనదే పాత బజాజ్‌ని అమ్మేసి, ఈ మధ్య ఆయన కైనటిక్ హోండా కొన్నాడు. కొత్త స్కూటరు కొన్నరోజు నా కెల మామూలుతో బాటు టీ కూడా ఇప్పించాను. ఆయన స్కూటర్ నాకు బాగా గుర్తు. షాపులో దూరి, షట్టర్ని సగం పైగా కిందికి లాగారాయన. అప్పుడే ఆయన్ని పలకరించాను" బహదూర్ హరికథకి టెంపో అడ్డుతగిలాడు.

"అయితే షాపులోకి వెళ్ళాక కూడా అతన్ని నువ్వు బాగా చూడలేదు, అవునా?"

"అవసరంలేదు సాబ్. ఆయన ఆయనే అని నాకు తెలుసు. ఆయన యెప్పుడూ తెల్ల పాంటు వేసుకుంటారు. ఆయన పాంటూ, బూట్లూ — బ్రౌన్ కలర్ బూట్లు — నాకు బాగా కనిపించాయి. షాపులో కెళ్ళగానే ఆయన లైటు వేశారు. పైగా ఆయన రంగనాథం సాబే అని నేను. ఆ తరవాత కూడా గమనించాను!"

"ఎట్లా?" సిగరెట్ వెలిగిస్తూ టెంపో ప్రశ్నించాడు.

"ఆయన్ని పలకరించి నేను నడుస్తూ వెళ్ళిపోయాను. దాదాపు అరగంట తరవాత ఆయన స్కూటర్ నన్ను దాటి, దగ్గర్లోనే వున్న ఇంట కాంపౌండులోకి వెళ్ళింది. నేను అక్కడే ఆగాను. గేటులోకి తిరిగేటప్పుడు కాలుస్తున్న సిగరెట్‌ని ఆయన రోడ్డుమీద పడేశారు.... మాఫ్ కర్నా.. బీడీ కాల్చుకుందుకు అగ్గిపెట్టె లేదు.

ఆయన పారేసిన సిగరెట్ పీకతో బీడీ ముట్టించుకుంటూ అక్కడే నిలబడ్డాను. రంగనాథంగారు స్కూటర్ని షెడ్లో పెట్టి, తలుపు తెరుచుకొని ఇంట్లోకి వెళ్ళిపోయారు.." బహదూర్ ఆగాడు.

"బహదూర్, మరొకర్ని చూసి, నువ్వు రంగనాథం అనుకోలేదుగా?"

బహదూర్ దెబ్బతిన్నట్టు చూశాడు. "లేదు సాబ్. పదేళ్ళుగా ఆ వీధిలో షాపుల్ని కాపలా కాస్తున్నాను సాబ్. రంగనాథం సాబ్ నాకు బాగా తెలుసు. ఆయన తల బాగా కిందికి వాల్చి నడుస్తారు. కొద్దిగా చీకటిగా వున్నా, నడిచే విధానాన్నిబట్టి ఆయనే అని తెలుసుకున్నాను సాబ్. ఆయన కాకపోతే షాపులోకి వెళ్ళనిచ్చేవాణ్ని కాను సాబ్!"

టెంపో అతన్ని నవ్వుతూ చూశాడు. "బహదూర్, ఒళ్ళంతా కళ్ళుచేసుకుని నీ డ్యూటీని నిజాయితీగా చేస్తున్నావ్!"

బహదూర్ మొహం విప్పారింది. "షుక్రియా సాబ్. అలా వున్నాకూడా పొద్దుట అయిదుగురు షాపు యజమానులు నన్ను ఎగతాళి చేశారు సాబ్. 'తిరుగుతూనే వుంటానంటావ్. షాపులు తగలబడుతూనే వున్నాయ్!' అన్నారు సాబ్. అన్నట్టు ఉదయం కాఫీహోటల్లో రంగనాథంసాబ్ గారి షాపు కాలుతున్నట్టు విన్నాను సాబ్. నాకు నమ్మ బుద్ధికాలేదు. వెళ్ళి చూశాను. రాత్రి రెండుగంటలప్పుడు షాపు ఠీక్ గా వుంది. ఆ మాటే అక్కడున్న పోలీసువాళ్ళతో అన్నాను."

"తరవాత?"

"రంగనాథం సాబ్ 'నీ కాపలా ఇలా వుంది!'

అన్నాడు కోపంగా. నేను రౌండ్స్ తిరిగానని, ఆయన కూడా చూశారనీ అన్నాను. ఆయిన తను అటువేపు రాలేదన్నారు! నాకు మతిపోయింది. నేను అబద్ధాలాడను. నా నిజాయితీని ఆయన అవమానించారు. ఆ మాటే అన్నాను. దాంతో ఇన్‌స్పెక్టర్ సాబ్ నన్ను వెయ్యి ప్రశ్నలు వేశారు. రంగనాథం సాబ్‌ని ప్రశ్నలతో సతాయించాడు. స్టేషన్‌కి ఇద్దర్నీ తీసికెళ్ళారు. నా స్టేట్‌మెంట్ తీసుకుని 'వెళ్ళమన్నారు...." అంటూ ఆగి, బహాదూర్ అదోలా చూశాడు. "సాబ్, రంగనాథం సాబ్ చాలా పెద్దమనిషి. ఆయన ఎందుకు అబద్ధాలాడుతున్నాడు?"

టెంపో చిన్నగా నవ్వాడు. "అది కనుక్కోడానికే నీ నుండి నిజాన్ని వినాలని వచ్చాను. వస్తాను" అంటూ పదిరూపాయల నోటుని అతనికి అందించాడు.

క్షణకాలం తటపటాయించి, బహాదూర్ నోటుని అందుకున్నాడు. "షుక్రియా సాబ్!" అన్నాడు నోటుతో సలాం చేస్తూ.

# 8

డిటెక్టివ్ టెంపో బజర్ నొక్కాడు. హాల్లో చైమ్స్ మోగాయి.

"ఎవరూ? తలుపు తెరిచేవుంది!" స్త్రీ కంఠం లోపల్నుంచి తారస్థాయిలో అరిచింది.

గొళ్ళెం పెట్టకుండా మూయబడిన తలుపుని తోసుకుంటూ టెంపో హాల్లోకి ప్రవేశించాడు. మధ్యలో సోఫాలో పద్మాసనం వేసుక్కూచున్న భారీ స్త్రీ అతన్ని ప్రశ్నార్థకంగా చూసింది.

"ఎవరు?" అందామె. అక్షరాలు జీడిపప్పుతో బాటు

ఆమె నోట్లో నలుగుతూ వెలికి వచ్చాయి.

'మీ రెవరు?' అని ఆమె వికారంగా అడగనందుకు సంతోషిస్తూ టెంపో చిరునవ్వుతో చూశాడు.

"రంగనాథంగారితో మాట్లాడాలి...."

"మేడమీద గదిలో వున్నారు. అరిచినా ఆయనకి వినపడదు. మీరే వెళ్ళండి" అందామె నిర్లక్ష్యంగా.

సంతోషిస్తూ టెంపో చకచకా మేడమెట్లవైపు అడుగులేశాడు.

గుమ్మంలో నిలబడ్డ టెంపోని రంగనాథం ఆశ్చర్యంతో చూశాడు. క్షణంలో ఆశ్చర్యాన్ని తరిమివేస్తూ అతని మొహంలో ఆదుర్దా ప్రత్యక్షమైంది. అప్రయత్నంగా ముందుకి నడిచాడతను.

"మీరు.... ఇక్కడ! లోపలికి రండి...." అన్నాడతను.

టెంపో లోపల ప్రవేశించాడు. ఆదరాబాదరా తలుపు మూసి, రంగనాథం మంచంవైపు నడిచాడు. టెంపోకి యెదురుగావున్న సోఫా చూపిస్తూ, మంచం మీద చతికిలపడ్డాడు. టెంపో కూచున్నాడు.

"మిస్టర్ టెంపో....మీరు....యెందుకు వచ్చారు? అయామ్ సారీ ...మీరు రావడం నా కిష్టమే. కానీ.... అతనికి తెలిస్తే...." అన్నాడతను తగ్గుస్వరంలో.

టెంపో సిగరెట్ వెలిగించి, అతన్ని చిరునవ్వుతో చూశాడు. "మిస్టర్ రంగనాథం, మీరు అబద్ధాలాడతా రనుకోలేదు!"

"మిస్టర్ టెంపో!"

"రాత్రి మీరు మీ కైనటిక్ హోండాలో మీ షాపుకి వెళ్ళారు. వయిట్ పాంటూ, బ్రౌన్ షూస్ వేసు

కున్నారు. అరగంట తరువాత యింటికి తిరిగొచ్చారు. సిగరెట్ పీకని మా యింటిముందు, రోడ్డుమీద పారేశారు...."

"ఇదంతా మీ కెవరు చెప్పారు? పోలీసులా?" రంగనాథం అడ్డు తగిలాడు.

"గూర్ఖా తేజ్ బహదూర్."

రంగనాథం పిడికిళ్ళు బిగుసుకున్నాయి అతని మొహం కందగడ్డలా అయింది. "ఆ వెధవకి చూపు మందగించింది. ఎవర్నో చూసి నేననుకున్నాము!"

"బహదూర్ చూపులు బాగానే వున్నాయి. అతను అంతా చూశాడు. చూసిందంతా చెప్పాడు!" టెంపో నవ్వుతూ అన్నాడు. "మిస్టర్ రంగనాథం, మీరు నాతో నిజం చెప్పొచ్చు!"

రంగనాథం బరువుగా నిట్టూర్చాడు. "బహదూర్ పొరబడ్డాడు. ఎందుకంటే నేను రాత్రి గడప దాటలేదు. నిజం చెప్పాలంటే, ఈ గదిలోంచీ కదలలేదు! ఇంకా చెప్పాలంటే, నేను పాన్ వేసుకోను; యెప్పుడూ సిగరెట్ కాల్చను. చెప్పులు వేసుకుంటాను; కరోనా సిగార్ కాలుస్తాను! వాడు అబద్ధాలాడుతున్నాడు."

"ఎందుకు?"

"వాడు సరిగా పహారా తిరగడం లేదని యిరుగు పొరుగు షాపులవాళ్ళు అన్నారు. నేనూ అన్నాను. తను సక్రమంగా డ్యూటీ చేసే నిజాయితీపరుడని చాటుకోడానికి ఆ వెధవ కథలు కల్పించాడు!" రంగనాథం ఆగ్రహంతో అన్నాడు.

"ఎవరో మీ స్కూటర్ మీద మీ షాపుకి వెళ్ళారు

ఎవరో మీ తాళాలతో మీ షాపుని రాత్రి రెండుగంట లప్పుడు తెరిచారు. ఎవరో ఆ తరువాత మీ షాపు నుండి మీ స్కూటరుమీద మీ యింటికి వచ్చారు. ఇదంతా ఖచ్చితంగా జరిగింది. ఎందుకంటే రాత్రి రెండుగంటల ప్రాంతంలో మీ షాపు అంటుకుంది. ఎవరో వెళ్ళి తాళాలు తెరిచి, మంట పెడితేగానీ షాపు అంటుకోదు" టొంపో నవ్వుతూ అన్నాడు.

"ఎవరు?"

"ఎవరైనా మీ స్కూటరు తాళాల్ని, తలవాకిలి తాళాల్ని, షాపు తాళాల్ని ఉపయోగించారు. ఇవన్నీ ఎవరిదగ్గరున్నాయో వాళ్ళే అంతా చేయగలరు. అన్నీ ఉన్న వ్యక్తి మీరే!"

రంగనాథం తటాలున మంచంమీంచి లేచాడు. ఉద్రేకంతో టొంపోని క్షణకాలం చూశాడు. మెల్లిగా తనని అదుపులో పెట్టుకుంటూ, మళ్ళీ కూలబడ్డాడు. దీనంగా టొంపో కళ్ళలోకి చూశాడు.

"మిస్టర్ టొంపో, నేను ఆ పాడుపని చేయలేదు! పొద్దుట మీరు విచారించేదాకా నాకు ఇన్స్యూరెన్స్ ఆలోచనే రాలేదు."

"మీరు కాకపోతే మరెవరో ఆ పని చేశారు. ఎవరు?" టొంపో అన్నాడు.

రంగనాథం నిస్సహాయంగా చూశాడు.

"మిస్టర్ రంగనాథం, ఇంటి తాళంచెవి, స్కూటర్ కీ, షాపు తాళాలూ—వీటన్నింటిని మీరు ఎక్కడుంచారు?"

మంచం పక్కనే వున్న టీపాయ్‌మీద పెట్టిన లెదర్ బాగ్‌ని రంగనాథం చూపించాడు. "స్కూటర్ తాళం,

షాపు తాళాలూ యెప్పుడూ అందులో వుంటాయి. రాత్రంతా ఆ లెదర్ బాగ్ అక్కడే వుంది. ఇంటితాళాలు బీరువామీద పడేస్తాం."

టెంపో సాలోచనగా తల పంకించాడు.

"మిస్టర్ టెంపో, నన్ను నమ్మండి! నా షాపుని నేను తగలబెట్టుకోను!" రంగనాథం ఉద్రేకంతో అన్నాడు.

టెంపో మారు పలక్కుండా లేచాడు. రంగనాథం ముందు పచార్లు ప్రారంభించాడు. తిటాలున ఆగి, అతని మొహంలోకి తీక్షణంగా చూశాడు.

"మిస్టర్ రంగనాథం, మీరు కాకపోతే మరో వ్యక్తి ఒక్కడే ఆ పని చేసివుండాలి.... మీ తరువాత, షాపుని తగలబెట్టే మోటివ్ అతనికొక్కడికే వుంది!"

"ఎవరు?...." రంగనాథం కళ్ళు పెద్దవి చేస్తూ చూశాడు.

"బ్లాక్ మెయిలర్!"

రంగనాథం ఉలిక్కిపడి, ఆయోమయంగా చూశాడు. టెంపో తదేకంగా అతన్ని చూశాడు.

"మాట ప్రకారం శుక్రవారం మీరు చెల్లించలేక పోయారు. మరో వారం గడువు అడిగారు. ఈ వారం రెండులక్షలు చెల్లించలేని మీరు వచ్చేవారం ఆరులక్షలు చెల్లించగలరనే నమ్మకం అతనిలో వుండివుండక పోవచ్చు. మీకు డబ్బొస్తేకానీ, అతని జేబు నిండదు! మీకు డబ్బు రావడానికి— పెద్ద ఎత్తున రావడానికి— అతను సహాయం చేయాలనుకుని వుంటాడు. షాపు కాలి పోతే ఇన్సూరెన్స్ పైకం మీకు అందుతుంది. దాన్ని మీ నుండీ అతను లాక్కోవచ్చు!" టెంపో కంఠం గంభీరంగా ధ్వనించింది.

రంగనాథం కటాలున మంచంమీంచి లేచాడు. ఆవే శంతో టెంపోవైపు చూశాడు. అతని మొహంమీద స్వేదబిందువులు మెరుస్తున్నాయి.

"మైగాడ్! మిస్టర్ టెంపో, ఆ రోజు అతనన్న మాటలు ఈ క్షణంలో నాకు గుర్తొస్తున్నాయి. 'తన కిందున్న గుడ్లు ఎన్నో కోడిపెట్టకి తెలీకపోవచ్చు. కానీ మనిషికి తెలుసు! నీలాంటివాడి చేతికి వద్దంటే కూడా వస్తుంది డబ్బు!" అన్నాడతను. ఇవాళ ఉదయం అతను మళ్ళీ ఫోన్ చేశాడు...."

"వాట్?"

"వెంటనే ఇన్సూరెన్స్ క్లెయిమ్ పెట్టమన్నాడు. పైకం గుంజి, తన 'బాకీ' తీర్చమన్నాడు. అవసరమైతే ఎంతో కొంత పర్సంటేజీ ఇన్సూరెన్స్ అధికార్లకి పారేయమని సలహా కూడా యిచ్చాడు!" రంగనాథం కంఠం ఉద్రేకంతో వణికింది.

డిటెక్టివ్ టెంపో మొహంమీద చిరునవ్వు తాండవించింది. ఆరిపోయిన సిగరెట్ని యాష్ట్రేలో పక్కా మరో సిగరెట్ వెలిగించాడు.

మళ్ళీ యేదో అనుమానం అతన్ని పీక్కుతినడం ప్రారంభించింది. బ్లాక్మెయిలర్ మూర్ఖంగా ప్రవర్తించడు. రంగనాథం స్కూటర్లో వెళ్ళి, షాపుని తగలపెట్టి, అనుమానం రంగనాథంపైకి సరఫరా అయ్యేలా ప్రయత్నించడు. కానీ, గూర్ఖా సాక్ష్యం ప్రకారం అనుమానం రంగనాథం వైపు వేలెత్తి చూపుతోంది! యెక్కడో, యేదో పొరపాటు వుంది. తనకి అర్థంకాని చిక్కుముడి ఎక్కడో వుంది!

అసలు అంత రాత్రివేళ గూర్ఖా తనని చూస్తాడనీ,

తనని రంగనాథంగా అనుకుంటాడనీ అతనెందుకు ఊహించాడు? అలా ఊహించి ఉంటాడా? ఇంతకీ తన ఆలోచనలు సరైన మార్గంలో సాగుతున్నాయా?

"మిస్టర్ టెంపో...."

ఆలోచనల్లోంచీ కిందికి దిగి, టెంపో ప్రశ్నార్థకంగా చూశాడు.

"మీరు త్వరగా ఏదో చేయాలి. నా షాపుని ఇన్సూరెన్స్ పైకం కోసం నేనే కాల్చేశానని బజారులో అందరూ అనుకుంటున్నారు! అది అపఖ్యాతి! దాన్ని నేను భరించలేను. ఆ నేరం నేను చేయలేదని నిరూపించండి! ఆ బ్లాక్ మెయిలర్ ఉచ్చులోంచీ నన్ను తప్పించండి! ఈ రెండు సహాయాలూ మీరు చేసితీరాలి!" రంగనాథం దీనంగా ప్రార్థించాడు.

"ప్రయత్నిస్తాను...." అంటూ టెంపో గుమ్మంవైపు కదిలాడు. తలుపు తెరవబోతూ ఆగి, వెనుతిరిగి రంగనాథంవైపు చూశాడు.

"మిస్టర్ రంగనాథం, మీకు అతను పంపించిన రిజిస్టర్ కవరెక్కడుంది?"

"నా దగ్గరే దాచివుంచాను. ఏం?" రంగనాథం ప్రశ్నించాడు.

"ఆ రోజు యింకా ఉత్తరాలు వచ్చాయా?" సమాధానంగా టెంపో ప్రశ్నించాడు.

"ఆ.... రెండు ఇన్‌లాండ్ లెటర్లు వచ్చాయి...."

"అవి మూడూ నాకు కావాలి."

"టెంపోగారూ, దేనికి? ఆ రెండూ మా మామగారూ, నా బావమరిదీ రాశారు...."

"రిజిస్టర్డ్ కవరుమీద అతని వేలిముద్ర లుంటాయి.

అలాగే దానిమీద పోస్టుమన్ వీ, మీవీ, పోస్టాఫీసులో హేండిల్ చేసిన వ్యక్తులవీ వున్నాయి. మీ అందరి వేలిముద్రల నుండీ అతని ముద్రల్ని వేరుచేసి చూడాలి."

రంగనాథం అర్థమైనట్టు తల పంకించాడు. "కూర్చోండి. రెండు ఇన్లాండ్ లెటర్లూ మా ఆవిడ కిచ్చాను. పట్టుకొస్తాను" అంటూ కదిలాడతను.

టెంపో తోటలోకి చూస్తున్న కిటికీ ముందుకి జరిగాడు. సిగరెట్ వెలిగించి, ఆలోచిస్తూ యువతలకి చూడసాగేడు. ఉత్తరాల అవసరానికి తను యేదో కారణం చెప్పాడు. కానీ వేలిముద్రల కోసం ఉత్తరాల్ని తను తీసుకోవడంలేదు. వేలిముద్రల ఆధారంతో తను ఈ కేసుని పరిష్కరించలేడని టెంపోకి తెలుసు....

# 9

"థాంక్స్ ఎలాట్, సుధాకర్! యూ ఆర్ గ్రేట్ హెల్ప్! నువ్వు చెప్పిన విషయాలన్నీ నాకు యెంతో ఉపయోగిస్తాయ్!" డిటెక్టివ్ టెంపో ఉత్సాహంగా మౌత్ పీస్ లోకి అరిచాడు.

"మిస్టర్ టెంపో, యూ ఆర్ వెల్ కమ్! ఇంతకీ ఆ వ్యక్తి మీ పరగణాలో ఏ మర్డరేనా చేశాడా, కొంప తీసి? ఇంతవరకూ అతనిమీద యిక్కడ ఏ కేసూ రికార్డు కాలేదు!" క్రైంబ్రాంచ్ ఇన్స్పెక్టర్ కంఠం మద్రాసు నుంచి టెలిఫోన్ తీగలమ్మట పాకుతూ టెంపో చెవిలో ప్రతిధ్వనించింది.

టెంపో చిన్నగా నవ్వాడు. "నాట్ మర్డర్. మనుషుల్ని ప్రాణాలు తీయడంతో కాకుండా అనేక విధాలుగా చంపొచ్చు సుధాకర్! మన సబ్జక్ట్ అపనే చేస్తున్నాడు. రాత్రి మళ్ళీ ఫోన్ చేస్తాను. ఐ విల్ గివ్ యూ

ఎ డిటెక్టివ్స్ రిపోర్టు! ఓకే!"

"ఓకే. ఎనీ థింగ్ ఎల్స్?" ఇన్‌స్పెక్టర్ సుధాకర్ నవ్వుతూ ప్రశ్నించాడు.

"యస్. గివ్ మై లవ్ టూ మిసెస్ సుధాకర్!" టెంపో నవ్వుతూ అన్నాడు.

"సర్టెన్లీ. నేనిచ్చే లవ్ ఆమెకి ఎలాగూ చాలడం లేదు!" ఇన్‌స్పెక్టర్ సుధాకర్ పకపకా నవ్వాడు. క్షణ కాలం అతనితో శృతి కలిపి, టెంపో రిసీవర్ పడేశాడు.

* * *

స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా, నేతాజీరోడ్ బ్రాంచ్ ముందు టాక్సీ ఆగింది.

డిటెక్టివ్ టెంపో దిగి, బాంక్ వేపు అడుగులు వేశాడు. రెండుగంటల నుంచీ, ఎనిమిది బాంకుల్లో సాగిన తన అన్వేషణ గిట్టుబాటు కాలేదు. ఇక రెండు బ్రాంచీలే మిగిలాయి వాటిలోనూ తనకు కావాల్సింది దొరక్క పోతే, తన అంచనా తప్పినట్టే!

అంచనా తప్పితే ఆ తరువాత యేం చేయాలి? ఆలోచిస్తూ టెంపో బ్యాంక్ మేనేజర్ గదిలోకి దూరాడు. మేనేజర్ కుంచితపాదం తలెత్తి విసుగ్గా చూశాడు. క్షణంలో అతని విసుగు మాయమైపోయింది.

"వెల్‌కమ్ మిస్టర్ టెంపో! రాకరాక వచ్చారు. కూచోండి!" కుంచితపాదం హుషారుగా అన్నాడు.

టెంపో అతని ముందు కూచున్నాడు. కుంచితపాదం ప్రశ్నార్థకంగా చూశాడు.

"అకౌంట్ ఓపెన్ చేయాలనుకుంటున్నారా....?" ఉత్సాహంగా అడిగాడతను.

"ఓపెన్ చేయబడి వుంటుంది అనుకుంటున్న ఒక అకౌంట్ గురించి కనుక్కోవాలనుకుంటున్నా!" టెంపో నవ్వుతూ అన్నాడు.

కుంచితపాదం నిరుత్సాహంగా చూశాడు. "అయితే అది మీ అకౌంట్ అయివుండదు!"

"నాచురల్లీ!"

"మిస్టర్ టెంపో, యూ నో ది రూల్స్. ఒకరి అకౌంట్ గురించి మరొకరికి చెప్పడం...." చిరునవ్వుతో వాక్యాన్ని పూర్తిచేశాడు, కుంచితపాదం.

టెంపో చిన్నగా నవ్వి సిగరెట్ వెలిగించాడు. "రూల్స్ వుంది అప్పుడప్పుడూ రిలాక్స్ చేయడానికే!"

"ఆల్ రైట్ చెప్పండి...."

"ఫ్రెష్ అకౌంట్స్ కార్యక్రమం చూసే వ్యక్తిని పిలిపించండి; చెప్తాను."

అప్పుడే గదిలోకి లెడ్జర్ పట్టుకొచ్చిన నౌఖర్ని చూస్తూ గంగాధర్‌ని పిలవమన్నాడు కుంచితపాదం. రెండు నిమిషాల్లో గంగాధర్ గదిలో హాజరయ్యాడు. మేనేజరు అతనికి విషయం వివరించాడు.

"అతను పల్చటి తోలుబొమ్మలా సన్నగా పొడుగ్గా వుంటాడు. పొట్టిగా కత్తిరించిన క్రాపు. ఎప్పుడూ పొట్టి చేతుల చొక్కా వేసుకుంటాడు. ఎప్పుడూ జర్దాకిళ్ళీ నములుతూ వుంటాడు. అతను ఈ మధ్య మీ బ్యాంకులో అకౌంట్ ప్రారంభించి వుండాలి...."

గంగాధర్ కళ్ళు చిట్లించాడు. "పేరు చెప్పండి. రోజూ ఎన్నో మొహాల్ని చూస్తూ వుంటాం...."

డిటెక్టివ్ టెంపో చెప్పాడు. గంగాధర్ తల పంకించాడు. "ఇప్పుడే వస్తాను. రికార్డ్సు రిఫర్ చేసి

చూడాలి ..." అంటూ కదలబోయాడు.

"మిస్టర్ గంగాధర్, మీకు మరో క్లూ ఇస్తాను. అతను ఎడంచేత్తో రాస్తాడు...."

గంగాధర్ కళ్ళు మెరిశాయి. "పోయిన్నెల అనుకుంటాను....ఎడంచేత్తో సంతకాలు చేసి ఒకతను అకౌంట్ ఓపెన్ చేశాడు. పేరు గుర్తులేదు. జస్టె మోమెంట్!" అంటూ అతను గదిలోంచి ఇవతలికి నడిచాడు.

"మిస్టర్ టెంపో, ఇంతకీ అతనెవరు? అతని ఖాతా గురించి వివరాలు మీ కెందుకు?" మేనేజర్ కుంచిత పాదం అడిగాడు.

"ఒక కేసు విషయంలో అతనికి సహాయం చేశాను. నా ఫీజు ఎగ్గొట్టాడు! నేను టేకప్ చేసిన కేసు మూలంగా అతనికి బాగా లాభించింది. అడిగితే పైసా రాదే దన్నాడు. మీ బ్యాంకులో దాచుకున్నట్టు నా పరిశోధనలో తేలింది. కన్ఫర్మ్ చేసుకుని అతన్ని నిలేసి కక్కిస్తాను...."

"ఒక పని చేయండి. అతను యివ్వగానే మా బ్రాంచిలో పాతిక వేలు పడేసి అకౌంట్ తెరవండి" కుంచితపాదం కులాసాగా అన్నాడు. "అన్నట్టు అతన్నుంచీ పాతిక వేలు వస్తాయా?"

"అతను ఇవ్వాల్సిన మొత్తంలో పాతిక వేలు పాతిక వంతు మాత్రమే!" టెంపో నవ్వుతూ అన్నాడు.

"యూ ఆర్ కరెక్టు! టెంపోగారూ, అతని పేరుతో సేవింగ్స్ అకౌంటుంది!" లెడ్జర్ని మోసుకువస్తున్న గంగాధర్ ఉత్సాహంగా అన్నాడు.

డిటెక్టివ్ టెంపోలో యేదో ఉద్రేకం కట్టలు తెంచు

తో దానికి ప్రయత్నించింది.

"ఎప్పుడెప్పుడు ఎంతెంత జమచేశాడో చెప్పండి!" టెంపో అన్నాడు.

"నాలుగో తేదీ అయిదువందలు జమచేశాడు. పదకొండో తేదీ వెయ్యి. పద్దెనిమిదిన రెండువేలు. ఇరవై అయిదున నాలుగువేలు. ఈ నెల ఒకటో తారీఖున ఎనిమిది వేలు. ఎనిమిదిన పదహారువేలు. పదిహేనో తారీఖున ముప్పైరెండు వేలు. ఇరవై రెండున లక్ష రూపాయలు...."

"గుడ్! వారం వారం మల్టిప్లై అవుతూ వెళ్ళింది! ఎ గుడ్ ఎకౌంట్ హోల్డర్!" మేనేజరు కుంచితపాదం ఉద్రేకంతో అరిచాడు.

"నిస్సందేహంగా" టెంపో నవ్వుతూ అన్నాడు.

"గంగాధర్, ఆయన యేదైనా విత్ డ్రా చేశాడా?" కుంచితపాదం ప్రశ్నించాడు.

"నో విత్ డ్రాల్స్, సర్!" గంగాధర్ నవ్వుతూ అన్నాడు.

"నైస్. ఈసారి ఆయన వచ్చినప్పుడు నా దగ్గరకు తీసుకురా. ఐవిల్ సీ దట్ హి పుట్స్ సమ్ అమౌంట్ ఇన్ ఎఫ్. డి!" కుంచితపాదం మెరిసే కళ్ళతో అన్నాడు.

"అలాగే సర్...."

"మిస్టర్ కుంచితపాదం, థాంక్యూ వెరీమచ్. వెళ్తాను" అంటూ టెంపో లేచాడు.

"కూచోండి. కాఫీ తీసుకుందురుగానీ. అన్నట్టు మీ ఖాతా...." కుంచితపాదం నవ్వుతూ హెచ్చరించాడు.

టెంపో చిరునవ్వుతో చూశాడు. "తప్పకుండా. అతన్ని కలుసుకుని వసూలు చేస్తాను. మీకే యిచ్చే

స్తాను!"

"థాంక్స్ అండ్ గుడ్ లక్!"

"కాఫీ వద్దు. మరోసారి...." అంటూ టెంపో కది లాడు.

లెడ్జర్ పట్టుకున్న గంగాధర్ ముందు నడుస్తున్నాడు. టెంపో అతని దగ్గరగా చేరాడు.

"మిస్టర్ గంగాధర్, అతని అప్లికేషన్ ఫారమ్నీ, స్పెసిమెన్ సిగ్నేచర్నీ వోసారి చూపించండి. అతనే ఇతనని నేను ఖచ్చితంగా తేల్చుకోవాలి. లేకపోతే, నా డబ్బు నాకు రాదు!"

గంగాధర్ నవ్వాడు. "రండి, చూద్దురుగానీ!"

# 10

పేవ్ మెంట్ మీద నిలబడి టెంపో ఎదురుగా వున్న సన్నటి వీధిలోకి పరకాయించి చూశాడు.

ఆ వీధిలో లైట్లు వెలగడంలేదు. మెయిన్ రోడ్డుని ఆనుకుని వున్న పాత బిల్డింగ్ ఆ వీధిలోకి సాగింది. 'హ___మాన్ లా___' రూపంలో నియాన్ సైన్ వెలుగు తోంది. హనుమాన్ లాడ్జి! నవ్వుకుంటూ టెంపో వంద గజాల దూరంలో వున్న పబ్లిక్ టెలిఫోన్ బూత్ వైపు నడిచాడు,

లోపల దూరి, రిసీవరెత్తి డయల్ టోన్ విన్నాడు. సిగరెట్ని పెదాలమధ్య ఇరికించి, చూపుడువేలితో ఒక నంబర్ డయల్ చేశాడు.

"యస్!...." అవతలి కంఠంలో అధికారం ఉట్టి పడింది.

"పృథ్వీరావ్! వున్నపళాన బయల్దేరు. ఓల్డు టౌన్లో మెయిన్ రోడ్డుమీదున్న హనుమాన్ లాడ్జికి రా. సెకెండ్

ఫ్లోర్, రూం నంబర్ 116 ముందు నిలబడు...."

"ఎందుకు? ఏమిటి? ఎక్కణ్నుంచీ మాట్లాడుతూ సస్పెన్స్ క్రియేట్ చేస్తున్నావ్?" ఇన్‌స్పెక్టర్ పృథ్వీరావ్ అడ్డు తగిలాడు.

"పృథ్వీ, 'ఆకతాయి' అంటే అర్థం తెలుసా?" టెంపో నవ్వుతూ ప్రశ్నించాడు.

ఇన్‌స్పెక్టర్ పృథ్వీరావ్ నిట్టూర్చాడు. "పోకిరి వెధవ...."

"మార్కులు సున్నా! కొంపలకి నిప్పెట్టేవాడు. పాపులకి కూడా అని అర్థం చెప్పుకోవచ్చు....!"

"కమాన్, టెంపో. షూట్!" పృథ్వీరావ్ ఉసూరుగా అరిచాడు.

"రైట్! గది నంబరు 116. మూసిన తలుపు ముందు నుంచో. లోపల జరిగే నాటకాన్ని, ప్రేక్షకుడిలా విను. రంగనాథం పాపుని తగలబెట్టిన వ్యక్తి, సమయం చూసి యివతలకి వస్తాడు. ఒక చేత్తో రివాల్వరు, రెండో చేత్తో బేడీలు పట్టుకుని అతనికి స్వాగతం చెప్పు!"

"అయిదు నిమిషాల్లో అక్కడుంటా!" పృథ్వీరావ్ అరిచాడు. "గురూ, ఇంతకీ ఎవరు?"

"ప్రత్యక్షమైనప్పుడు చూస్తావుగా!" నవ్వుతూ టెంపో రిసీవర్ని పడేసి, బూత్‌లోంచీ యివతలకి, గాలిలోకి నడిచాడు.

# 11

యాభై గజాల దూరంలో కారాగింది. సెకండ్ ఫ్లోర్ బాల్కనీలో నిలబడ్డ టెంపో వెనక్కి జరిగాడు. చకచకా తనకి కావాల్సిన గది వేపు నడిచాడు.

తలుపుమీద ఆతని వేళ్ళ కణుపులు చప్పుడు చేశాయి.

"ఎవరు....?" బొంగురు కంఠం చిరాకుగా గద్దించింది.

"రూమ్ సర్వీస్ సార్...." టెంపో బిగ్గరగా అన్నాడు.

"తలుపు తోయ్!"

టెంపో తలుపు తోసుకుని గదిలోకి దూరాడు. ఆతని వీపు తలుపుని మూస్తూ, ఆనుకుంది.

"నే నేదీ ఆర్డరివ్వ...." ఆతని కంఠం మధ్యలో మూగవోయింది. ఆశ్చర్యం, కోపం, అనుమానం అన్నీ చేతకాని చిత్రకారుడు కలగాపులగంగా కలిపిన రంగుల్లా ఆతని మొహంమీద ప్రత్యక్షమయ్యాయి.

టెంపో ఆతన్నే చిరునవ్వుతో చూస్తున్నాడు. మంచం మీద ఆతను గెడకర్రలా పొడుగ్గా పడుకున్నాడు. ఆతని చేతుల్లో తెరిచిన డిబొనైర్ పత్రిక వుంది.

"ఎవర్నువ్వు?" గద్దించాడతను మోచేతుల్ని మంచం మీద ఆన్చి లేచే ప్రయత్నం చేస్తూ.

"నువ్వు తీసిన జ్వాల, రంగనాథం ఫోటోలకన్నా డిబొనైర్ లో ఫోటోలు ఆకర్షణీయంగా వున్నాయా?" డిటెక్టివ్ టెంపో నవ్వుతూ ప్రశ్నించాడు.

ఆతని కళ్ళల్లో ఏదో ఒకసారి వెలిగి, ఆరిపోయింది. ఆతను స్ప్రింగ్ టాయ్ లా తటాలున లేచాడు. కాళ్ళు కిందికి దించి మంచంమీద కూచున్నాడు.

"హూ ఆర్ యూ? ఏమిటా వాగుడు?"

"డిటెక్టివ్ టెంపో పేరు వినేవుంటావు.." టెంపో

నవ్వుతూ సిగరెట్ వెలిగించాడు.

"నేను విన్న పేపర్లలో నీ పేరులేదు! గెటౌట్ ...." హూంకరించాడతను.

"రంగనాథంకి సంబంధించిన ఫోటోలూ, నెగటివులూ, క్యాసెట్లూ, అతన్నుంచీ గుంజుకున్న లక్షా అరవై మూడు వేలా అయిదువందలూ ఇచ్చేస్తే వెళ్ళిపోతాను!" టెంపో నవ్వుతూ అన్నాడు.

"దారితప్పి వచ్చావా? మెంటల్ కార్ఖానానుంచీ తప్పించుకువచ్చావా?" అతని కంఠంలో వెటకారం గంటలా మోగింది.

"రంగనాథం ...."

"ఎవడా సింగినాదాం?" హుంకరించాడను.

"రంగనాథం అనే ఆ సింగినాదం నీ బావ అనీ నీకు నేను పరిచయం చేయాలా దామోదర్?" టెంపో ఎగతాళిగా అన్నాడు.

దామోదర్ ఉలిక్కిపడ్డాడు. అతని కళ్ళు రక్తంతో తడుస్తున్నట్టు ఎర్రగా అవుతున్నాయి. అతను తటాలున లేచి, గొత్తుగా నిలబడ్డాడు.

"ఆల్ రైట్... రంగనాథం-మా బావ రంగనాథం నాకు తెలుసు. అయితే నువ్వనేదేమిటి?" జర్దానముల్తూ ఎగతాళిగా అన్నాడతను.

"అక్క మొగుణ్ణి బ్లాక్ మెయిల్ చేసిన ఘనత చరిత్రలో నీకే దక్కుతుందంటున్నాను, దామోదర్!" టెంపో నవ్వుతూ అన్నాడు.

"పిచ్చిపట్టిందా? బావని నేనెందుకు బ్లాక్ మెయిల్ చేస్తాను?"

"సాధారణంగా ఎవరు ఎవర్ని బ్లాక్ మెయిల్ చేసినా

అది డబ్బుకోసమే!"

"నాన్ సెన్స్! అడిగితే బావ నాకు అక్షరలక్షలిస్తాడు ...అయినా నీతో ఈ కబడీ దేనికి! బైటికి నడు!" దామోదర్ బెదిరింపుగా చూస్తూ రెండడుగులు ముందుకు వేశాడు.

డిటెక్టివ్ టెంపో రెండడుగులు ముందుకువేసి, ఆగాడు. శూలంతో పొడుస్తున్నట్టు అతన్ని తీక్షణంగా చూశాడు. "బ్లాక్ మెయిల్ చేయడమేకాదు, అతని షాపుకి నిప్పుపెట్టావు!"

"శ్శహో!" దామోదర్ వెటకారంగా అన్నాడు. "డబ్బుకోసం బావని బ్లాక్ మెయిల్ చేశాను. బావుంది. షాపుని యెందుకు కాలుస్తాను? అదికూడా చెప్పు. నవ్వుకోడానికి తరవాత నాకు పనికొస్తుంది!"

"నవ్వే అవకాశం నీకుండదు, దామోదర్! రంగనాథం పోటీపోయిన అవులా తయారయ్యాడు. రెండు లక్షలు సర్దలేకపోయాడు. సర్దలేడనీ నీకు తెలుసు! అందుకే షాపుని లంకలా కాల్చావు. ఇన్సూరెన్స్ పైకం వస్తుంది. అది నీకు చదివించబడుతుంది!"

దామోదర్ రౌద్రంగా చూశాడు. "ముక్కూ మొహం తెలీని మూర్ఖుడెవడో గదిలోకి జొరబడి, బుద్ధి లేకుండా వాగుతూ వుంటే వింటూ కూచోడానికి నాకు ఓపిక లేదు! మర్యాదగా వెళ్తావా? పోలీసుల్ని పిలవమంటావా?"

"పోలీసుల పేరు ఉచ్చరించడానికే నువ్వు భయపడతావనుకున్నాను. నీ ధైర్యాన్ని మెచ్చుకుంటున్నా!" అంటూ టెంపో తలుపువైపు తిరిగాడు. "పృథ్వీరావ్, దామోదర్ కి అర్జంటుగా నువ్వు కావాలిట. కమిన్!"

టెంపో కంఠం గదిలో ప్రతిధ్వనించింది. అతను దామోదర్ వైపు తిరిగాడు.

దామోదర్ అయోమయంగా చూస్తున్నాడు. చిన్న చప్పుడుతో తలుపు తెరుచుకుంది. గొళ్ళెం బిగించి, ఇన్‌స్పెక్టర్ పృథ్వీరావ్ టెంపో పక్కగా నడిచాడు. దామోదర్ మొహంలో రక్తం కిందికి పరుగెడుతోంది. ఆశ్చర్యం విశ్వరూపంలో అతని కళ్ళల్లోంచి తొంగి చూస్తోంది. రెండు క్షణాల్లో అతను తెప్పరిల్లాడు. ఇన్‌స్పెక్టర్ చేతిలోని రివాల్వర్‌ని క్షణకాలం చూసి రెప్పలు పైకెత్తాడు.

"ఇన్‌స్పెక్టర్, ప్లీస్ టేక్ దిస్ లూనటిక్ అవే! అర్థంపర్థంలేని మాటలతో నన్ను అవమానిస్తున్నాడు" దామోదర్ దర్పం ఉట్టిపడేలా అన్నాడు.

ఇన్‌స్పెక్టర్ పృథ్వీరావ్ చేతిలోని రివాల్వర్ అతని వైపు కదిలింది.

"టెంపో, ఇతనెవరు?"

"రంగనాథం భార్య తమ్ముడు. రంగనాథంని బ్లాక్ మెయిల్ చేసిన వ్యక్తి. రంగనాథం బట్టల షాపుని తగలబెట్టిన వ్యక్తి. త్రీ ఇన్ వన్!" టెంపో నవ్వుతూ అన్నాడు.

"ఇది అన్యాయం....!" దామోదర్ అరవడం ప్రారంభించాడు.

"షటప్!" పృథ్వీరావ్ కంఠం అతని చేతిలోని రివాల్వర్‌లా చప్పుడు చేసింది. "టెంపో, అర్థమయ్యేలా చెప్పు!" అన్నాడతను టెంపోని వోరగా చూస్తూ.

"రంగనాథం తన షాపులో సేల్స్ గర్ల్‌గా పని చేస్తున్న జ్వాలతో సంబంధం డెవలప్ చేసుకున్నాడు.

ఆ విషయం పసిగట్టిన దామోదర్ అతన్ని బ్లాక్ మెయిల్ చేశాడు....” బ్లాక్ మెయిల్ గురించీ, వారం వారం రెట్టింపైన మొత్తం గురించీ టెంపో వివరించాడు. మధ్యలో దామోదర్ అడ్డుతగలబోయాడు. పృథ్వీరావ్ రివాల్వర్ అతని నోరు నొక్కేసింది.

సిగరెట్ పీకని దూరంగా విసిరి టెంపో ప్రారంభించాడు:

“రంగనాథం బోడిచెయ్యి చూపించాక, దామోదర్ బుర్ర చురుగ్గా ఆలోచించింది. షాపు కాలిపోతే ఇన్సూరెన్సు కంపెనీ డబ్బిస్తుంది. పొదగబడిన పిల్లని తన్నుకుపోయే డేగలా ఆ పైకాన్ని తన్నుకుపోడానికి దామోదర్ ఎత్తు వేశాడు. రాత్రి షాపుని తగలబెట్టాడు. పొద్దుటే....”

“నో! నేను ఏ పాపం ఎరగను! ఇన్స్పెక్టర్, టెంపో గారు క్రైమ్ రచయితలా ఊహిస్తున్నారు!” దామోదర్ బొబ్బలెట్టాడు. ఇన్స్పెక్టర్ సమక్షంలో తనని గౌరవంగా సంబోధిస్తున్న అతన్ని డిటెక్టివ్ టెంపో చిరునవ్వుతో చూశాడు.

“రంగనాథం ఇంట్లోకీ, షెటికీ ధారాళంగా వెళ్ళిరాగలిగే అవకాశం వున్న దామోదర్ రాత్రి అతని సంచీలోంచీ స్కూటర్ తాళాన్నీ, షాపు తాళాన్నీ తస్కరించాడు. స్కూటర్ మీద షాపుకెళ్ళాడు. అనుకోని విధంగా గూర్ఖా ప్రత్యక్షమై పలకరించాడు, కైనటిక్ హోండానీ, తల బాగా వంచి నడిచే విధానాన్ని చూసి, ఇతన్ని రంగనాథమే అనుకున్నాడతను. పలకరించేసరికి, కంగారుపడిన దామోదర్ సహజంగా, షాపు యజమానిలా మాట్లాడాడు....”

“ఇన్స్పెక్టర్, నిరాధారంగా నామీద ఇతను నింద

చేస్తున్నాడు! నేను చట్టరీత్యా చర్య తీసుకుంటాను. మీరు విట్నెస్‌గా వున్నారు!" దామోదర్ హుంకరించాడు.

పృథ్వీరావ్ ప్రశ్నార్థకంగా, వోరగా టెంపోని చూశాడు. టెంపో చిరునవ్వు నవ్వాడు.

"పృథ్వీరావ్. ఇతను షాపుని తగలబెట్టాడు. దానికి అవసరమైన సాక్ష్యాధారాలున్నాయ్! ఒకటి; తను చూసినప్పుడు, షాపులో వున్న రంగనాథం బ్రౌన్ కలర్ షూస్ వేసుకున్నట్టు కూడా తేజ్ బహదూర్ చెప్పాడు. పొద్దుటే నేను రంగనాథం ఇంటికెళ్ళాను. రంగనాథం చెప్పులుతప్ప బూట్లు వాడడు. అయితే అక్కడ బ్రౌన్ షూస్ వున్నాయి. వాటి సైజు ఆరు. రంగనాథం పాదాలు పెద్దవి. అతని చెప్పుల సైజు ఎనిమిది. అంటే, రంగనాథం ఇంట్లో వున్న బూట్లు దామోదర్‌వి. అవి తన తమ్ముడివని రంగనాథం భార్య నాతో అంది...."

"నో!" దామోదర్ కేక పెట్టాడు.

"యస్. వాటిని నిర్లక్ష్యంగా అక్కడ వదిలేసి, యథాలాపంగా దామోదర్ వేరే జత బూట్లు వేసుకున్నాడు. రోజంతా అక్కడా ఇక్కడా తిరిగి, ఊర లేనట్టు ఇంట్లో చెప్పి, ఈ గూట్లో దాక్కున్నాడు. తరవాత, రోడ్లోంచి కాంపౌండులోకి వెళ్ళేముందు రంగనాథం కాలుతున్న సిగరెట్ పీకని పారేసినట్టూ ఆ ముక్కలో బీడీ కాల్చుతున్నట్టూ కూడా చెప్పాడు. రంగనాథం సిగరెట్లు అస్సలు కాల్చడు. అతను కాల్చేది కరోనా సిగార్. దామోదర్ సిగరెట్స్ కాలుస్తాడని మంచం పక్కన పడున్న పీకలతప్ప చెప్తోంది!

"మరో సంగతి: దామోదర్ తన షాపుని సాధార

ణంగా రాడంటూ రంగనాథం నాతో చెప్పాడు. ఆ రోజు పొద్దుటే బ్రౌన్ షూన్ని నేను పరీక్షించాను. బూటు అడుగు భాగంలో చీర ధర వేసి అతికించే 'స్టిక్కర్' అతుక్కుంది. 'రూ. 285/-' అని వేసి వున్న ఆ స్టిక్కర్ని జేబులో పడేసుకొని రంగనాథంకి చూపించాను. స్టిక్కర్ మీద దస్తూరి తన గుమస్తా సాంబమూర్తిదని ఖచ్చితంగా చెప్పాడు!

“అంటే, అక్కయ్య ఇంటి తాళంచెవిని జాగ్రత్త చేసుకుని దామోదర్ చప్పుడుకాకుండా షాపుకి నిప్పంటించి. ఏమీ ఎరగనివాడిలా ఎక్కడికక్కడ పెట్టేసి పడుకున్నాడు. అతను ఇంట్లోకి వెళ్ళి తలుపేసుకోడం గూర్ఖా కళ్ళారా చూశాడు!” టెంపో ఆగి సిగరెట్ వెలిగించాడు.

ఇన్‌స్పెక్టర్ పృథ్వీరావ్ వజ్రాల్లా మెరుస్తున్న కళ్ళని దామోదర్ వైపు తిప్పాడు. దామోదర్ మొహంలో నెత్తురుచుక్క లేదు. అతని నుదురు చెమటతో మెరుస్తోంది. ఎండిపోతున్న పెదవులు అదురుతున్నాయి.

“ఇన్‌స్పెక్టర్ గారూ.... బావ.... సలహామీదే షాపుకి నిప్పెట్టేశాను. డబ్బు కావాలనీ షాపుని కాల్చడం తప్ప మరో మార్గం లేదనీ బావ నాతో వాపోయాడు.. ఇది నిజం. నేను.... బావని .... బ్లాక్ మెయిల్ .... చేయలేదు!” దామోదర్ తడబడుతూ అన్నాడు.

డిటెక్టివ్ టెంపో బిగ్గరగా నవ్వాడు. “పృథ్వీరావ్, తన ఆట కట్టయిందని తెలుసుకున్న దామోదర్ తెలివిగా అబద్ధాలాడుతున్నాడు. అతను రంగనాథంని బ్లాక్ మెయిల్ చేశాడు. అతన్ని, ఈ గదినీ సోదాచేయి. స్టేట్ బాంక్ ఆఫ్ ఇండియా, అకౌంట్ నంబర్ 9709

పాస్ బుక్ నీకు చిక్కుతుంది. అందులో పోయినెల నాలుగో తారీఖునుంచీ, వారం వ్యవధిలో అయిదువందలూ వెయ్యీ—ఇలా రెట్టింపవుతూ ఎనిమిది శుక్రవారాల్లో మొత్తాలు జమచేయబడ్డ ఎంట్రీస్ వుంటాయ్!"

ఇన్‌స్పెక్టర్ పృథ్వీరావ్ ముందుకి కదిలాడు. దామోదర్ ఎర్రటి కళ్ళతో వెర్రివాడిలా చూశాడు. అతని చూపులు మూసిన తలుపులమీద పడ్డాయి. లేడిలా గెంతబోయిన అతని డొక్కలో రివాల్వర్ కొన గుచ్చుకుంది. దామోదర్ బలహీనంగా, నేలమీద కూర్చుండిపోయాడు. రెండు చేతుల్లో మొహాన్ని కప్పేసుకున్నాడు. ఇన్‌స్పెక్టర్ పృథ్వీరావ్ జేబులోంచి బేడీలు తీశాడు.

డిటెక్టివ్ టెంపో సిగరెట్ పీకని గిరాటేసి, చిరునవ్వుతో చూస్తూండిపోయాడు.

# 12

"మిస్టర్ టెంపో, నేను నమ్మలేకుండా వున్నాను! దామోదర్, నా బావమరిది ఇంత ఘోరం యెందుకు చేశాడు?" రంగనాథం ఆవేశంగా ప్రశ్నించాడు.

"డబ్బుకోసం మాత్రమే కాదు!" డిటెక్టివ్ టెంపో నవ్వాడు. అతని పక్కనే కూచున్న ఇన్‌స్పెక్టర్ పృథ్వీరావ్ నవ్వుతూ తలాడించాడు.

"మరెందుకు?" రంగనాథం ఆశ్చర్యంగా అన్నాడు.

"చదువుకునే రోజుల్లో, జ్వాలని అతను విపరీతంగా ప్రేమించాడు. చెరుకుగడలా వుండే దామోదర్‌ని జ్వాల బొత్తిగా పట్టించుకోలేదు. అతన్నామె ఇగ్నోర్ చేసింది. కొంతకాలం గడిచింది. మద్రాసు వదిలేసి జ్వాల పొట్టకోసం ఈ ఊరొచ్చి, మీ దగ్గర చేరింది,

"చాలా కాలం తర్వాత దామోదర్ ఆమెని ఇక్కడ చూశాడు. ఒకరోజు రాత్రి ఎనిమిది ప్రాంతంలో ఆమెని కలుసుకోడానికి ప్రయత్నించాడు. తన ప్రేమను రిన్యూ చేసుకోవాలనుకున్నాడు. ఆ రాత్రి ఆమె గదిలోంచి ఇవతలకి వచ్చి నడవసాగింది. దామోదర్ ఫాలో చేశాడు. ఆమె హోటల్ ఎమరాల్డులోని ఒక గదిలోకి వెళ్ళింది. ఆమెపట్ల రెండోసారి పిచ్చి ముదిరిన దామోదర్ గది ముందు నక్కి దాక్కున్నాడు.

"ఆ గదిలో జ్వాల ఒంటరిగా లేదనీ, తన బావ ఆమెకి తోడుగా వున్నాడనీ కనుక్కోడానికి దామోదర్‌కి ఆట్టేసేపు పట్టలేదు! మీరిద్దరూ వ్యాపారం చేస్తూ ఆ గదిలో దాక్కోలేరనీ అతను కనిపెట్టాడు. తన అక్కయ్యని మోసం చేస్తూ, తను ప్రేమించిన యువతితో హోటల్ గదుల్లో శృంగారం జరుపుతున్న మీమీద అతని కసి ఎవరెస్టులా ఎగింది!"

"గుడ్ గాడ్!" రంగనాథం అరిచాడు.

"రెండువిధాలుగా మీమీద కసి తీర్చుకోడానికి అతను నిశ్చయించుకున్నాడు. సరైన సమయం చూసి, హోటల్ రిసెప్షనిస్టుకి లంచం యిచ్చి, మీ ఇద్దరినీ ఫోటోల్లోకి దించాడు! మీమీద బ్లాక్ మెయిలింగ్ అస్త్రం ప్రయోగించాడు! కంఠం మార్చి మీతో ఫోనులో మాట్లాడాడు! ముందు చూపుతో హోటల్ రూమ్ మెయిన్‌టెయిన్ చేశాడు...."

"మైగాడ్, ఇదంతా మీరెలా కనిపెట్టారు?" రంగనాథం ఆశ్చర్యంగా ప్రశ్నించాడు.

"అతనే అంతా కక్కేశాడు!" ఇన్‌స్పెక్టర్ పృథ్వీరావ్ నవ్వుతూ అన్నాడు.

"ఘంటాలుడు! అక్కయ్య కొంపకే నిప్పెట్టేశాడు! నెల నెలా తనికి వెయ్యేసి రూపాయలు అందిస్తున్న అక్కయ్య సంసారాన్ని గుల్ల చేయడానికి వాడికి మనసెట్లా వచ్చిందో!" రంగనాథం పళ్ళు కొరుకుతూ అన్నాడు.

"మీరు యెంత యిచ్చినా అదంతా వ్యాపారంలోని పైకమే అని .తనకి తెలుసన్నాడు దామోదర్. 'అక్కయ్యకి ఏ ఢోకా లేదు. పదిలక్షలు విలువచేసే బిల్డింగ్ వుంది. బోల్డన్ని నగలూ అవీ వున్నాయి!' అన్నాడతను. పైగా మీరిచ్చిందంతా వ్యాపారంలోంచీ మీ భార్యకి తెలీకుండా కాజేసి మీరు దాచుకొన్న సొమ్మే అని అతని నమ్మకం!" టెంపో నవ్వుతూ అన్నాడు.

"స్కౌండ్రల్!" రంగనాథం హుంకరించాడు. "మిస్టర్ టెంపో, తోలుబొమ్మని ఆడించినట్టు నన్ను ఆడించిన వాడి దగ్గరగా వుండీ నేను అనుమానించలేక పోయాను. మీరెలా పసిగట్టారు?"

"అవును! అదే నాకూ అంతుపట్టడంలేదు!" ఇన్స్పెక్టర్ పృథ్వీరావ్ నవ్వాడు.

"గూర్ఖా సాక్ష్యం నాకెంతో ఉపకరించింది. సొంత వ్యక్తిలా అతను ఇంట్లోంచీ షాపులోకీ షాపు నుంచీ ఇంటికీ మీ స్కూటర్ మీద వచ్చాడు; వెళ్ళాడు. అంత సులువుగా పరాయి వ్యక్తి ఇంట్లో దూరి తలుపు మూసుకోడు! ఆ పని మీ యింట్లో వ్యక్తుల్లో ఎవరో వొకరు చేసి వుండాలి. మీరూ, మీ భార్యా, మీతో బాటు వున్న దామోదర్. మీరు చేయలేదని మీ చెప్పులు చెప్పాయి. మీ భార్యని అనుమానించడానికీ వీల్లేదు! ఇకపోతే మిగిలింది దామోదర్! అతని బూట్లూ, సిగరెట్ నా అను

మాసాన్ని అతనిమీదికి సరఫరా చేశాయి!

"అసలు ఉద్దేశం చెప్పకుండా వేలిముద్రల కథ చెప్పి ఆ ఉత్తరాలు తీసుకున్నాను. దామోదర్ అడ్రెసూ, అతని దస్తూరీ కనుక్కోగానే దానికి వెంటనే మద్రాసు క్రైం బ్రాంచి ఇన్‌స్పెక్టర్‌కి ఫోన్ చేశాను. ఫలానా వ్యక్తి కొడుకు దామోదర్ జాతకం దగ్గరా పూర్తిగా తెలుసు కొమ్మన్నాను. ఇన్‌స్పెక్టర్ సుధాకర్ టీకా తాత్పర్యా లతో దామోదర్ జాతకాన్ని అందించాడు!

"బి.ఏ. ఫెయిలవడంతో రికార్డు సృష్టించిన దామోదర్ తిరుగుబోతుగా, జులాయిగా తయారయ్యాడు. ఇంటి పట్టున వుండేవాడు కాదు. సంపాదన లేకపోయినా వ్యసనాలన్నీ వున్నాయి. అతను ఓటికుండ అని నాకు అర్థమైంది. అతని కదలికల్ని ఫాలో చేశాను. అతనికి ఎడంచేత్తో రాసే అలవాటుందనీ నాకు తెలియజేశాడు సుధాకర్. బ్యాంకుల్లో వాకబు చేశాను. నా అంచనా నిజమైంది. మీ దగ్గర పిండుకున్న పైకాన్ని పిసినారిలా బ్యాంకులో దాచుకున్నాడు! అతని బ్యాంక్ అకౌంట్ అతన్ని పట్టిచ్చింది!" టెంపో ముగించాడు.

"మీ కలర్ ఫోటోలూ, నెగటివ్‌లూ అతని దగ్గరే దొరికాయి!" ఇన్‌స్పెక్టర్ పృథ్వీరావ్ అందుకుని, నవ్వుతూ అన్నాడు.

రంగనాథం తల వాల్చుకుని, నేలచూపులు చూడ సాగేడు.

—: అయిపోయింది :—

# సునీత గీసిన బొమ్మ

## వసుంధర

మొబైల్ వ్యాన్ శరవేగంతో పోతోంది.

డ్రైవింగ్ సీట్లో కిల్లర్ ఉత్సాహంగా ఉన్నాడు.

నిర్మానుష్యంగా ఉన్న రోడ్డుమీద అవధులు లేని వేగంతో వ్యాన్ నడపడం అతని కెంతో సరదా....

ఆ సమయంలో బాగా దూరంగా రోడ్డు కడ్డంగా నిలబడి ఉన్న మనిషి కనిపించాడు కిల్లర్ కి. ఎందుకైనా మంచిదని ముందే హారన్ ప్రయోగించాడు.

వ్యాన్ ఆ వ్యక్తిని సమీపిస్తోంది.

హారన్ ఆగకుండా మ్రోగుతోంది.

అతడు మాత్రం కదలలేదు.

చివరకు సడన్ బ్రేకుతో వ్యాన్ ఆపాడు కిల్లర్.

ఆ వ్యక్తి వ్యాన్ ఆపడానికే అక్కడలా నిలబడ్డాడని కిల్లర్ కి అర్థమయింది. ఎందుకంటే అతడు రెండు చేతులూ అడ్డంగా చాపి ఉన్నాడు.

అతడొక సర్దార్జీ.

వ్యాన్ ఆగగానే సర్దార్జీ వచ్చి డోరు తెరిచి లోపలకు ప్రవేశించి డోరు మూసి—"అర్జంటుగా దగ్గర్లోని రైల్వేస్టేషన్‌కు పోనీయ్—" అన్నాడు.

"ఎవర్నువ్వ్?" అన్నాడు కిల్లర్.

అప్పుడు సర్దార్జీ చేతిలో సాధారణంగా సిక్కులవద్ద ఉండే కృపాణం తళుక్కున మెరిసింది.

"ప్రశ్న లడగవద్దు. అర్జంటుగా స్టేషన్‌కు పోనీయ్...."

"నేను ప్రశ్నలడుగుతాను, జవాబు నచ్చితే నీకు సాయపడతాను. లేదా నీకు బుద్ధి చెబుతాను. నీ చేతిలోని కత్తులు నన్ను బెదిరించలేవు—" అన్నాడు కిల్లర్. అతడి మాటలు ముగిసేసరికి సర్దార్జీ చేతిలోని కృపాణం కిందపడింది. కిల్లర్ అతడి చేతిని మెరుపువేగంతో మెలిపెట్టాడు.

"ఎవర్నువ్వ్?" అన్నాడు సర్దార్జీ ఆశ్చర్యంగా.

"నా సంగతి తర్వాత చెబుతాను. ముందు నీ సంగతి చెప్పు. నువ్వు టెర్రరిస్టువా?" అనడిగాడు కిల్లర్.

సర్దార్జీ ముఖం అదోలాగైపోయింది—"పంజాబులో జరిగే అల్లరు ప్రతి సిక్కునూ టెర్రరిస్టు చేస్తున్నాయి. అందుకే నేనిప్పుడు పంజాబు బయల్దేరాను. టెర్రరిస్టుల్ని అంతంచేసి సిక్కుల దేశభక్తిని నిరూపించుకునేందుకు!"

"ఇక్కడ నీకేమీ పనిలేదా?" అన్నాడు కిల్లర్.

"ఉంది. నేనొక మెకానిక్కుని. గ్యారేజీ నడుపుతున్నాను. పదహారేళ్ళ వయసులో ఇక్కడకు వచ్చాను. ఇప్పుడు నాకు నలభై యేళ్ళు. ఈ ఇరవై నాలుగేళ్ళలోనూ తెలుగువారిలో ఒకడిగా కలిసిపోయి తెలుగు భాష

క్షుణ్ణంగా నేర్చుకున్నాను. నా కెందరో తెలుగు మిత్రులున్నారు. వారిలో ముఖ్యుడు శ్రీమన్నారాయణ. ఆయనన్నా నేను అన్న కంటె మిన్నగా గౌరవిస్తాను...."

"ఇదంతా నా కెందుకు చెబుతున్నావు?" అన్నాడు కిల్లర్ అతణ్ని మధ్యలో ఆపుతూ.

"ఆఫీసు పనిమీద ఢిల్లీ వెళ్ళిన శ్రీమన్నారాయణకు అమృతసర్‌లో గురుద్వారా చూడాలనిపించి వెళ్ళాడు. దారిలో కొందరు దుండగు లాయన్ని పెట్రోలు పోసి తగులబెట్టారు..." అన్నాడు సర్దార్జీ.

కిల్లర్ పిడికిళ్ళు బిగిశాయి—"ఎందుకు?"

"నిజమైన సిక్కు—అమాయకుల ప్రాణాలు తీయడు. సిక్కుల పేరుతో కొందరు విదేశీ గూఢచారులీ పని చేస్తున్నారు. వారి కారణంగా సిక్కులకు చెడ్డపేరు వస్తోంది. ఇంతకాలం యెంతో స్నేహంగా ఉన్న శ్రీమన్నారాయణ కుటుంబం నన్నిప్పుడు ద్వేషిస్తోంది. బాభీజీ నా ముఖం చూడనంటోంది. నిజం చెప్పాలంటే నా కిప్పుడు పంజాబుతో సంబంధం లేదు. నా దేశం తెలుగు దేశం. నా బిడ్డలీ గడ్డలో పుట్టి పెరిగి పెద్దవారయ్యారు. అయినప్పటికీ పంజాబులో ఎవరో చేసిన తప్పు నన్నిక్కడ నా వాళ్ళకు దూరం చేస్తోంది. అందుకే నేనిప్పుడక్కడకు వెళ్ళి వారి నంతం చేసి వస్తాను...."

కిల్లర్ అదోలా అతడివంక చూసి—"నువ్వు నిజమే చెబుతున్నావా?" అన్నాడు.

"నిజమైన సిక్కు అబద్ధం చెప్పడు—" అన్నాడు సర్దార్జీ

"అయితే ఎందరో పోలీసులు, సైనికులు చేయలేని పని నీ ఒక్కడివల్ల అవుతుందనుకుంటున్నావా?"

"కావచ్చు — కాకపోవచ్చు. నా స్నేహితుడి ప్రాణంతీసినవారి ప్రాణం తీసేదాకా నాకు నిశ్చింత ముండదు ..." అన్నాడు సర్దార్జీ.

కిల్లర్ అతడి కళ్ళలోని ఆవేశం చదివాడు. అందులో నటన లేదు.

"నిజమైన సిక్కులకు నేను సాయపడతాను. నీతో కాసేపు మాట్లాడాలి. వ్యాన్. సైడుకి పెడతాను—" అన్నాడు కిల్లర్.

మొబైల్ వేన్ రోడ్డుపక్కకు చేరింది.

"ఇప్పుడు చెప్పు—నీ పేరు?"

"రామ్‌చరణ్‌సింగ్—"

"నీ స్నేహితుడు శ్రీమన్నారాయణను పంజాబులో టెర్రరిస్టులు పెట్రోలుపోసి తగులబెట్టారు. పెట్రోలులో కాలిపోయిన మనిషికి ఆనమాలుండదు. అతడే శ్రీమన్నారాయణ అని నీకెలా తెలిసింది? అసలీ వార్త నీకెలా చేరింది?"

"శ్రీమన్నారాయణతో పాటు అమృతసర్ వెళ్ళిన నరసింగరావు ద్వారా యీ విశేషం తెలిసింది...."

"నరసింగరా వెవరు?"

"అక్కడ ఢిల్లీలో వుంటున్నాడు. శ్రీమన్నారాయణ స్నేహితుడు...."

"టెర్రరిస్టులు శ్రీమన్నారాయణను కాల్చి నరసింగరావు నెందుకు వదలిపెట్టారు?"

"నరసింగరావు కార్లో యిద్దరూ అమృతసర్‌కు బయలుదేరారు ఢిల్లీ నుంచి. దారిలో టెర్రరిస్టులు వారి కారాపారు. ఇద్దరూ కారు దిగారు. టెర్రరిస్టులు వారిద్దర్నీ "ఖలిస్థాన్ జిందాబాద్—" అనమన్నారు.

ఇద్దరూ అనలేదు. అనకపోతే చంపేస్తామన్నారు వాళ్ళు. నరసింగరావు వెంటనే అనేశాడు. శ్రీమన్నారాయణ టెర్రరిస్టుల్ని నిందించసాగాడు. అంతే వాళ్ళతన్ని పెట్రోలుపోసి తగలబెట్టి నరసింగరావుతో "— ఈ విషయం హిందువులందరికీ చెప్పుకుంటావని నిన్ను వదలి పెడుతున్నాం—" అన్నారు. నరసింగరావు వాళ్ళు వెళ్ళేదాకా ఆగి కాల్లో దగ్గరవున్న పోలీస్ స్టేషన్కి వెళ్ళి ఫిర్యాదు చేశాడు. పోలీసు సంరక్షణలో అతడు ఢిల్లీ చేరుకున్నాడు—"

రామచరణ్ సింగ్ చెబుతూంటే కిల్లర్ కళ్ళెర్ర బడ్డాయి—"మిస్టర్ సింగ్! ఇలా యెంతకాలమో కొనసాగదు. టెర్రరిస్టులపై సిక్కులు కూడా తిరగబడాలి. అప్పుడే దేశంలో సిక్కులకు కూడా రక్షణ లభిస్తుంది—"

"అందుకే—ముందుగా నేను తిరగబడుతున్నాను. నాకు నా మతమెంతో నా దేవుడెంతో నా ఆలయమెంతో నా స్నేహితులూ అంతే! నా స్నేహితులంతా హిందువులు...." అన్నాడు రామచరణ్ సింగ్ ఆవేశంగా.

కిల్లర్ మనిషి కాస్త చల్లబడ్డాడు—"నేను నిన్ను నమ్ముతున్నాను. నీకు సాయపడతాను. అయితే ఇలా ఉన్నపళంగా బయల్దేరడం కాదు. ముందుగా కొంత సమాచారం సేకరించాలి—"

"సమాచారం సేకరించడానికేముంది? పంజాబు నిండా టెర్రరిస్టులున్నారు. వాళ్ళు సామాన్యులను మత ప్రచారంతో రెచ్చగొడుతూ సోదర హిందువులమీద ద్వేషం నూరిపోస్తున్నారు. వాళ్ళను బ్రతకనివ్వ

కూడదు...."

"నువొక్కడివీ ఏం చేయగలవు?"

"ప్రతీకారం తీర్చుకుంటాను. నా ప్రాణానికి ప్రాణం శ్రీమన్నారాయణ మృతికి కారకులయినవారిని అంతం చేస్తే ఆ తర్వాత నేనేమైనా బాధుండదు—"

కిల్లర్, సింగ్ భుజం తట్టి—"నీ ఆవేశం నా కర్థమయింది. కానీ నీ ఆశయం నెరవేరాలంటే ఇలా ఉన్న పళంగా బయల్దేరి లాభంలేదు. ముందుగా నరసింగరావును కలుసుకుని కొన్ని వివరాలు సేకరించాలి—...." అన్నాడు.

"అందుకే బయల్దేరాను నేను...."

"అలాంటప్పుడిక్కడెలా ఉన్నావు?"

రామ్‌చరణ్‌సింగ్ తల వంచుకున్నాడు.

చెప్పడానికతడు తటపటాయిస్తున్నాడని గ్రహించి- "ఎటూ కాని ఈ ప్రాంతానికి నీవెలా వచ్చావో నా కాశ్చర్యంగా ఉంది—" అన్నాడు.

"శివరాజా నన్ను చంపాలని యిక్కడకు తీసుకొచ్చాడు."

"శివరా జెవరు?" అన్నాడు కిల్లర్.

"మా ఊరిగుండా! శ్రీమన్నారాయణకు స్నేహితుడు. తద్వారా నాకూ స్నేహితుడు. నన్ను మంచి మాటలతో యిక్కడకు తెచ్చి—ఇక్కడ నన్ను చంపబోయాడు. నే నప్పుడతణ్ణి వేడుకున్నాను. శివరాజా నవ్వి—"మా శ్రీమన్నారాయణకు పట్టిన గతే నీకూ పట్టాలి. మీ సిక్కులకు లేని కరుణ నా కెందుకుండాలి?" అన్నాడు. నేను వెంటనే—"శ్రీమన్నారాయణ నీ వాడే కాదు. నావాడు కూడా! అతడి చావుకు ప్రతీ

కారం తీస్తుకునేలోగా చావకూడదని నా కోరిక. నాకా అవకాశ మివ్వు. నన్ను వదలి పెట్టు—" అన్నాను.

శివరాజు వినలేదు. అప్పుడు నేను తిరగబడ్డాను. అతణ్ణి లొంగదీసుకున్నాను. శివరాజు నేను తనని చంపుతాననుకున్నాడు. నేనతడితో—నిజమైన సిక్కు అకారణంగా హత్య చేయడు. నా పట్ల నీకు గల దురభిప్రాయం తొలగించడమే నా ఆశయం. ఈ క్షణమే నేను పంజాబు వెడతాను. నీవు ఇంటికి వెళ్ళి నీ వదినకు, నా పిల్లలకు రక్షణ కల్పించు. ప్రాణాలతో తిరిగివస్తే మళ్ళీ కలుసుకుందాం—" అన్నాను. శివరాజు నన్ను తెచ్చిన జీపులో వెనక్కు వెళ్ళిపోయాడు. తర్వాత నాకు స్ఫురించింది—జీపులో నేను రైల్వేస్టేషన్‌కు పోవాల్సిందని! అప్పట్నించీ యేదయినా వాహనం వస్తుందేమోనని ఎదురుచూస్తున్నాను...."

కిల్లర్ సాలోచనగా—"శ్రీమన్నారాయణకు గూండాలు స్నేహితులుగా ఉన్నారంటే అసలతడెలాంటివాడు?" అన్నాడు.

"గూండాలూ మనుషులే! వారిలో గూండాలను చూసేవారు, వారిని గూండాలుగా ఉపయోగించుకునే వారూ కిరాతకులు. వారిలో మనుషులను చూసేవారు స్నేహితులు. శివరాజుకు శ్రీమన్నారాయణంటే గొప్ప ఆకర్షణ!" అన్నాడు సింగ్.

"శ్రీమన్నారాయణ యేం చేస్తుంటాడు?"

"బిజినెస్...."

కిల్లర్ కాసేపాలోచించి—"బాగా ఉన్నవాడా?" అన్నాడు.

"ఊఁ" అన్నాడు సింగ్—"ఆయనకు స్వంతానికే

మూడు కార్లున్నాయి. వ్యాపారానికి సంబంధించి పన్నెండు ట్రక్కులు. ఎనిమిది వ్యాన్‌లు, ఆరు కార్లున్నాయి—"

"ఏమిటాయన వ్యాపారం?"

"రవాణా—...." అని — "ఇవన్నీ ఎందుకడుగుతున్నారు?" అన్నాడు సింగ్ అనుమానంగా.

"చనిపోయిన మనిషినిబట్టి రియాక్షన్ వుంటుంది. శ్రీమన్నారాయణ బాగా గొప్పవాడైతే ఊళ్ళో చాలా పెద్ద కలకలం రేగి వుండాలి. నువ్వు భయపడి ఊళ్ళోంచి పారిపోయుండాలి—" అన్నాడు కిల్లర్ సాలోచనగా.

"విషయం అందరికీ తెలియదు—" అన్నాడు సింగ్. ఢిల్లీ పోలీసులీ విషయానికి ప్రచారమివ్వద్దని నరసింగరావును కోరారు. నరసింగరావు టెలిగ్రాం ద్వారా శ్రీమన్నారాయణ పెద్దకొడుకును ఢిల్లీ రప్పించి అసలు విషయం చెప్పి—శ్రీమన్నారాయణ ప్రమాదవశాత్తు చనిపోయినట్లు ప్రచారం చేయమన్నాడు. అతడందుకంగీకరించాడు.

ఇక్కడికొచ్చేక శ్రీమన్నారాయణ భార్యకు విషయం తెలిసింది. నాతో మాట్లాడ్డం మానేసింది. ఏం జరిగిందో నాకు తెలియదు. మాకూ వాళ్ళకీ కుటుంబ సంబంధాలు కూడా తగ్గిపోయాయి. ఒకరోజు నేను శివరాజు దగ్గర విషయం చెప్పుకుని బాధపడ్డాను. సంగతేమిటో తెలుసుకుంటానని అతడు వెళ్ళాడు. అక్కడ అతడికి విషయం తెలిసినట్లుంది. నన్నిక్కడకు తీసుకుని వచ్చాడు. విషయం తెలియగానే నేనూ ఆవేశపడ్డాను...."

కిల్లర్ నిట్టూర్చి—"ఢిల్లీలో నరసింగరావు చిరునామా తెలుసా నీకు?" అనడిగాడు.

"కర్నోల్ బాగ్‌లో సౌతిండియా హోటల్ నడుపుతున్నాడతడు. బోర్డింగూ, లాడ్జింగూ కూడా వున్నాయి. హోటల్ పేరు వరాహనృసింహా సౌతిండియన్ కాఫీ హౌస్ ...."

"అయితే మనమిద్దరం కలిసి ఇప్పుడే బయల్దేరుదాం."

"ఎక్కడికి?"

"ఛలో ఢిల్లీ!"

"మరి నీ వ్యానెక్కడ పెడతావు?"

"వ్యాన్‌లోనే మన ప్రయాణం-" అన్నాడు కిల్లర్.

"వ్యాన్‌లోనా-అయితే ఢిల్లీ ఎప్పటికి చేరేటట్లు?" అన్నాడు సింగ్ నిస్పృహగా.

"ట్రయిన్‌కంటే ముందు వెడతాం...."

"కావచ్చు. కానీ ఏకబిగిని డ్రైవ్ చేయలేం కదా!"

"నీకు నా వ్యాన్ సంగతి తెలియదులే—మనమిద్దరం రాత్రిళ్ళు సుఖంగా నిద్రపోవచ్చు. కంప్యూటర్ కంట్రోలులో వ్యాన్ దానంతటదే నడుస్తుంది..."

"నిజమా?" అన్నాడు సింగ్ ఆశ్చర్యంగా.

"కావాలంటే చూడు...." అంటూ కిల్లర్ డ్రైవింగ్ సీట్లోంచి తప్పుకున్నాడు.

వ్యాన్ యెప్పటిలాగే పయనిస్తోంది. మలుపులు తనే తిరుగుతోంది. వెనుకనుంచి వచ్చే వాహనాలకు దారినిస్తోంది. ముందున్న వాహనాలను దారివ్వగానే దాటించుకుని వెడుతోంది. స్పీడ్ బ్రేకర్ల దగ్గర స్లో అవుతోంది. దారికడ్డంగా ఏమైనా వుంటే ఆగిపోతోంది.

"కలలా వుంది. ఇలాంటి వాహనాలుంటాయని నాకు తెలియదు...." అన్నాడు సింగ్ ఆశ్చర్యంగా.

"నీకు తెలియనివెన్నో నాకు తెలుసు. అందుకే నీకు

ప్రాయం అవసరం—...." అన్నాడు కిల్లర్.

"డ్రైవింగ్ సీట్లో మనిషి కనబడకపోతే దారిన పోయేవాళ్ళు చూసి అనుమానించి విడ్డూరంగా చూడరూ?" అన్నాడు సింగ్ అనుమానంగా.

"కంప్యూటర్ డ్రైవింగ్ సమయంలో వ్యాన్ అద్దాలలోంచి మనకు బైట జరిగేదంతా కనబడుతుంది. బయటివారికి లోపలెవరున్నదీ కనపడదు. ఫిల్మ్‌స్టార్సు కార్లలో వెళ్ళేటప్పుడు తామూ యిలాంటి యేర్పాట్లే చేసుకుంటారు...." అన్నాడు కిల్లర్.

"నీవు చాలా శక్తిమంతుడిలా కనబడుతున్నావు. ఈపాటికే టెర్రరిస్టుల పనిపట్టవలసింది...."

"నిజమైన శక్తిమంతుడు శక్తికిమించిన పని తల పెట్టడు...." అన్నాడు కిల్లర్ నవ్వుతూ.

"అంటే?" అన్నాడు సింగ్.

"సామాన్యులకు సామాన్యుడిని కాకపోవచ్చు కానీ నేను సామాన్యుణ్ని. నాకున్న శక్తిని సామాన్య కోసం వినియోగించాలనుకున్నంతకాలం నేను శక్తిమంతుడిగా వుంటాను. పంజాబు టెర్రరిస్టులను ఎదుర్కోవాలను కోవడం—చిట్టెలుక సింహంతో తలపడడం వంటిది. పొట్టేలు కొండను ఢీకొనడంవంటిది. నేనప్పుడు సామాన్యులకు మిగలకుండా పోతాను. టెర్రరిస్టుల నెదుర్కో నేందుకు ప్రభుత్వముంది. ప్రభుత్వ యంత్రాంగముంది-" అన్నాడు కిల్లర్.

"అయితే ఇప్పుడెందుకు నాతో వస్తున్నావు?"

"నువ్వొక గ్యారేజిలో మెకానిక్కువి. అలాంటి నువ్వే టెర్రరిస్టుల నెదిరించడానికి బయల్దేరుతున్నావు ఒంటరిగా. నేను నేరస్థులకు సింహస్వప్నంగా వుండా

లన్న ఆశయంతో సరంజామా సేకరించుకున్నవాణ్ని. నీ ఆవేశం నన్నా వేశపరిచింది—" అన్నాడు కిల్లర్.

"ఇంతకీ ఎవరు నువ్వు?"

"నా పేరు కిల్లర్. అయామే కిల్లర్ ఆఫ్ ఎనీథింగ్ ట్రాయల్...."

సింగ్ కిల్లర్ వంక ఆశ్చర్యంగా చూశాడు.

వ్యాన్ డ్రైవింగ్ సీట్లో యెవరూ లేకుండా నే ముందుకు దూసుకుని పోతోంది.

# 2

నరసింగరావింట్లో డ్రాయింగ్ రూం....

గది మరీ అంత విశాలమైనదికాదు కానీ గది ఇంటి వారి అభిరుచిని తెలియజేస్తోంది.

గోడకు ఇండియా మ్యాప్ .... పక్కగా గాంధీ, నెహ్రూ, శాస్త్రి, ఇందిర, రాజీవ్ గాంధీల ఫోటోలు వ్రేలాడుతున్నాయి.

అందమైన కాశ్మీర్ కార్పెట్ మొత్తం నేలనంతా కవర్ చేసింది.

గది మధ్యలో సోఫాల్లో కూర్చుని వున్నారు నరసింగరావు, కిల్లర్, సింగ్ ....

కిల్లర్ నరసింగారావునే చూస్తున్నాడు.

అతడు ఖద్దరు పంచ ధరించి వున్నాడు. దానిమీద ఖద్దరు చొక్కా, కండువా! చూడ్డానికి రాజకీయ నాయకుడిలా ఉన్నాడతడు.

పచ్చటి దబ్బపండులాంటి ఛాయ ....

"నా పేరు కిల్లర్ —" అన్నాడు కిల్లర్.

"ఢిల్లీలో కిల్లర్స్‌కి లోటులేదు —" అన్నాడు నరసింగరావు.

"అయామ్ ది కిల్లరాఫ్ కిల్లర్స్...."

నరసింగరావతడి వంక కుతూహలంగా చూసి— "మీరు చెప్పదల్చుకున్న దేమిటి?" అన్నాడు.

కిల్లర్ క్లుప్తంగా అతడికి విషయం వివరించాడు.

నరసింగరావు లేచి కిల్లర్ని సమీపించి చేయిచాచి షేక్‌హ్యాండిచ్చాడు.

"అయాం వెరీ వెరీ హాపీ.... నా ప్రాణమిత్రుడు శ్రీమన్నారాయణను క్రూరంగా చంపిన ఆ దుర్మార్గులను సర్వనాశనం చేయడానికి మీకెలాంటి సహకారం కావాలన్నా నేనందజేయగలను...." అన్నాడతడు.

"అందుకే మీ దగ్గరకు వచ్చాను. మీరు దేశభక్తులని మీ డ్రాయింగ్‌రూం, దుస్తులు చూసి చెప్పవచ్చు. మీ వంటివారిచేత ఖలిస్తాన్ జిందాబాద్ అనిపించినవారిపై మీకు అపరిమితమైన ద్వేషముండాలి...." అన్నాడు కిల్లర్.

"లేదు...." అన్నాడు నరసింగరావు.

సింగ్ అతడి వంక ఆశ్చర్యంగా చూశాడు.

"ఎందుకు లేదు?" అన్నాడు కిల్లర్.

"నా బలహీనతకు నేను వారినెందుకు ద్వేషించాలి? శ్రీమన్నారాయణలా నేనూ నా ప్రాణాలకు తెగించి వారినెదిరించవచ్చు. కానీ నా దేశభక్తి వేషధారణకూ, డ్రాయింగ్‌రూంకు మాత్రమే పరిమితమయింది. నాలో ధైర్యం తక్కువ. నా ప్రాణాలు రక్షించుకునేందుకు నేనేమైనా చేయగలనని రుజువయింది. ఇప్పుడు నన్ను నేనే ద్వేషించుకోవాలి.. శ్రీమన్నారాయణను రక్షించుకోలేనందుకు .... అతడిలా ధైర్యాన్ని ప్రదర్శించలేనందుకు...."

"నిజం చెప్పాలంటే మీ పరిస్థితుల్లో నేనైనా అంతే చేసేవాణ్ణి. శ్రీమన్నారాయణ అసాధారణ పురుషుడు. అలాంటి ధైర్యం మహాత్ములకు కానీ సాధ్యపడదు—" అన్నాడు కిల్లర్.

"అందుకే అతడు పోయాడు. పాపీ చిరాయువు.... అంటారు కదా— నేను మిగిలాను...?" అంటూ నరసింగ రావు కళ్ళు మూసుకుని— "ఆ మంటల్లో మాడిపోతూ కూడా శ్రీమన్నారాయణ భరతమాతకు వందనాలు పలికాడు—" అన్నాడు.

అతడి గొంతు రుద్ధమయిందని గమనించాడు కిల్లర్.

"మీ రేరూట్లో వెళ్ళారో—ఎలా వెళ్ళారో—నాకు వివరాలు కావాలి...." అన్నాడు కిల్లర్.

"చెబుతాను. అసలా దుండగులెలావున్నారో కూడా మీకు నేను చెప్పగలను—...." అన్నాడు నరసింగ రావు.

"చెప్పండి—" అన్నాడు కిల్లర్.

నరసింగరావు లేచి లోపలకు వెళ్ళాడు. కొద్దిక్షణాల్లోనే ఆయన వెనక్కి వచ్చాడు. ఆయన చేతిలో గుండ్రంగా చుట్టబడిన ఒక అట్ట పేపరుంది.

కిల్లర్ ఆ పేపరందుకున్నాడు.

అందులో ముగ్గురు వ్యక్తులున్నారు.

ఒకడు సన్నగా పొడుగ్గా వున్నాడు. ఒకడు లావుగా పొట్టిగా వున్నాడు.

"నేను వాళ్ళ బొమ్మలు గీశాను...." అన్నాడు నరసింగరావు.

"ఎవ్వరికీ గడ్డాలు లేవు.." అన్నాడు కిల్లర్.

సింగ్ ఆ బొమ్మలవంకే చూస్తూ—"వీళ్ళు నిజంగా

నిక్కలే అయితే—ఖలిస్థాన్ విషయమెలాగున్నా ముందు మతద్రోహం చేశారు—గడ్డాలు తీసేసి..” అన్నాడు.

నరసింగరావు నిట్టూర్చి—“ఎవరు వీళ్ళ నిందుకు ప్రోత్సహిస్తున్నారో ముందు వాళ్ళ అంతు తేల్చాలి—” అన్నాడు.

కిల్లర్ ఆ బొమ్మలవంకే ఆశ్చర్యంగా చూస్తూ—“మీరు చెప్పింది నిజం, తప్పు వీళ్ళది కాదు. వీళ్ళను నడిపించే వాళ్ళది—” అన్నాడు.

“నడిపించేవాళ్ళు చెప్పినట్లు నడవడానికి మనిషికి మాత్రం బుద్ధుండొద్దూ?” అన్నాడు సింగ్ కోపంగా.

“ఒక గాంధీ ప్రబోధిస్తే—సామాన్యుడు లాఠీ దెబ్బలకు రొమ్మిచ్చి నిలబడ్డాడు. ఒక హిట్లర్ ప్రబోధిస్తే—నాజీ సైన్యం మనుషుల్ని కీటకాల్లా మార్చేసింది. నాయకత్వపు శక్తి ఉన్నవాడు తన అనుచరుల చేత మానవ కల్యాణం సాధించగలడు. మారణహోమం చేయగలడు. తప్పొప్పులు అనుచరులవి కాదు. నాయకులవి....” అన్నాడు కిల్లర్.

“ఉన్నట్లుండి మీ దృష్టి నాయకుల పైకి మళ్ళిందేం?” అన్నాడు నరసింగరావు.

“ఎందుకంటే ఈ ముగ్గురు మనుషుల్లోనూ నాకు రాక్షసత్వం కనబడడంలేదు. వారి కళ్ళలో త్యాగదీక్ష, దేశభక్తి ప్రతిఫలిస్తున్నాయి....”

“నేను బొమ్మ తప్పు వేసివుంటాను. శ్రీమన్నారాయణను వాళ్ళు పెట్రోలు పోసి తగులబెడుతూంటే వాళ్ళకళ్ళల్లో నేను పైశాచికానందాన్ని నా కళ్ళారా చూశాను. వాళ్ళు మంచివాళ్ళు కాదు. పరమ కిరాతకులు—....” అన్నాడు నరసింగరావు ఆవేశంగా.

"బ్రిటిష్‌వారిపై బాంబులు వేసి ఉరికంబ మెక్కిన వారు మనకు అమరవీరు లయ్యారు. వారి కళ్ళలో మనం క్రూరత్వాన్ని చూడగలమా? మనకు చెందనివారు మన దేశంలో అడుగుపెట్టి మనను బానిసలుగా చూస్తూంటే సహించలేక తిరగబడ్డ మహాత్ములు వారు. భరత ఖండంలో అన్ని మతాలవారూ సమానంగా సామరస్యంతో జీవిస్తూంటే—కొందరు వేర్పాటువాదులు లేని యెక్కువతక్కువల్ని సృష్టించి — సిక్కులకు హిందువులు బ్రిటిష్‌వారే నన్న దురభిప్రాయం సృష్టించారు. అది నమ్మిన అమాయకులు తాము దేశభక్తులమనీ, త్యాగపరులమనీ నమ్ముతూ సోదరుల నూచకోత కోస్తున్నారు. తప్పు వారిది కాదు. వారిని నడిపిస్తున్న వారిదే!"

"కానీ...." ఏదో అనబోయాడు నరసింగరావు.

"మీలోని చిత్రకారుడు గొప్పవాడు. చూసింది చూసినట్లుగా బొమ్మ గీశాడు. మీ స్నేహితుడు మీ కళ్ళముందే కాలిపోతూంటే మీకు వారు క్రూరులుగా కనిపించి ఉండవచ్చు. కాని మీలోని చిత్రకారుడు వారిని యథాతథంగా ఫోటో తీసి మనసులో ముద్రించాడు. ఈ ఫోటోలోని వ్యక్తులు తప్పుదారిలో నడుస్తున్న మంచి పౌరులనడంలో సందేహంలేదు—" అన్నాడు కిల్లర్ సాలోచనగా.

"మీ పరిశీలనాశక్తి అద్భుతం....ఇప్పుడు మీరేం చేయాలనుకుంటున్నారు? వీరి సాయంతో అసలువారిని పట్టగలరా? ప్రభుత్వ గూఢచారులకు సాధ్యపడనిది మీకు సాధ్యపడుతుందా....?" అన్నాడు నరసింగరావు.

"ఇలా ఆలోచించేవాడు సాహసం చేయలేడు. నేను సాహసిస్తున్నాను" అన్నాడు కిల్లర్.

"మీకు అన్ని వివరాలూ చెబుతాను. కానీ ఎక్కడా నా పేరు రాకూడదు. ఈ బొమ్మలోని వ్యక్తులను నా ద్వారా గుర్తిస్తున్నట్లు మీరెక్కడా అనకూడదు. నేను నీతిగానే బ్రతుకుతున్నా ధైర్యవంతుణ్ని కాను. బ్రతుకు మీద ఆశ, భీతి—రెండూ వున్నవాణ్ని—" అన్నాడు నరసింగరావు.

కిల్లర్ ఆయనకు హామీ యిచ్చాడు.

## 3

కిల్లర్ తనూ సిక్కు వేషంలోనే వున్నాడు. అతడు తనతో పంజాబీ మాట్లాడుతుంటే సింగ్ ఆశ్చర్యంగా "ఇరవై నాలుగు సంవత్సరాలు తెలుగు దేశంలో వుండి కూడా నేను స్వచ్ఛమైన తెలుగు నేర్చుకోలేకపోయాను. నా మాటలో పంజాబీయాస తెలిసిపోతుంది. నువ్వు అచ్చం పంజాబీలా మాట్లాడుతున్నావు—...." అన్నాడు.

"అందులో ఆశ్చర్యమేముంది—....?" అన్నాడు కిల్లర్.

"తెలుగు యాస లేదు నీ భాషలో—ఆశ్చర్యం కదూ?"

"నేను తెలుగువాడి ననీ—పంజాబీని కాదనీ నీ కెవరు చెప్పారు?—...." అన్నాడు కిల్లర్ కాస్త చిరాగ్గా.

"అయితే నువ్వు పంజాబీవా?" అన్నాడు సింగ్ ఆశ్చర్యంగా.

"నన్నిప్పుడు చూస్తుంటే నీ , కెలా కనబడు

తున్నావు?"

మొబైల్ వ్యాన్ నడుపుకుపోతూంటే సింగ్ కిల్లర్ ని పట్టి పట్టి చూశాడు. మాటలో, రూపంలో—అతడిని సిక్కు కాదనడం కష్టం!

"అచ్చం నేటివ్ సిక్కులాగున్నావు!"

కిల్లర్ నవ్వి—"చూశావా—శాస్త్ర అభ్యాసంతో మనిషి ఏ భాషనైనా మాట్లాడవచ్చు. ఏ రూపాన్నైనా ధరించవచ్చు. అంటే అర్థమేమిటి—అంతా ఒక్కటే నని కదా! ఇది తెలిసి కూడా మనిషి—మతం పేరిట, భాష పేరిట—రక్తపాతాన్నెందుకు సృష్టిస్తాడో నా కర్థంకావడం లేదు. నీకూ అర్థం కాదనుకుంటాను...." అన్నాడు.

"అవును రాష్ట్రం వదిలిపెట్టిన మూలాన అంతా ఒక్కటేనన్న భావం నాలో బాగా పేరుకుపోయింది. కానీ ఇంతకీ నువ్వెక్కడివాడివి?"

"అది తెలుసుకోవాల్సిన అవసరం నీకు లేదు. గుర్తుంచుకోవాల్సిన అవసరం నాకు లేదు. నేను భారతీయుణ్ని....అంతే!"

ఉన్నట్టుండి వ్యాన్ సడన్ బ్రేకుతో ఆగింది.

దారి కడ్డంగా పెద్ద పెద్ద బండరాళ్ళున్నాయి.

బిలబిలమంటూ పదిమంది ముసుగు మనుషులు వ్యాన్ ని చుట్టుముట్టారు. కిల్లర్ వ్యాన్ దిగి అచ్చమైన పంజాబీలో వారిని పలకరించాడు.

"ఖలిస్తాన్ విమోచనకు చందా యిచ్చి వెళ్ళండి—" అన్నారు వాళ్ళు.

"నా దగ్గర ఒక్క పైసాకూడా లేదు—" అన్నాడు కిల్లర్.

"అది మేము చూసుకుంటాం__" అన్నారు వాళ్ళు.

"మీ యిష్టం...." అన్నాడు కిల్లర్.

ఒకడు వెనుకనుంచీ వ్యాన్ తలుపు తెరిచాడు. అంతే!

బుస్సుమంటూ అదోరకం గ్యాస్ వచ్చింది.

క్షణాలమీద వ్యాన్ చుట్టూ వున్న ముసుగుమనుషులు స్పృహతప్పి పడిపోయారు.

"ఏం జరిగింది?" అన్నాడు సింగ్ ఆశ్చర్యంగా.

"వీళ్ళకు స్పృహతప్పింది. మరో గంటదాకా నిద్ర లేవరు...." అన్నాడు కిల్లర్.

"మరి మనకు తప్పలేదేం?"

"వ్యానెక్కేముందు నేను నీకో చూయింగ్‌గమ్మి చ్చాను కదా. అది దీనికి యాంటిడోట్...."

"నువ్వు అసాధ్యుడివి__...." అన్నాడు సింగ్.

"కావచ్చు. కానీ__నాకూ అసాధ్యాలున్నాయి.."

సింగ్ మాట్లాడలేదు. కిల్లర్‌తో కలిసి ఆ ముసుగు మనుషులందర్నీ వ్యాన్‌లోకి చేరవేశాడు. ఓ పదినిమిషాల్లో వాళ్ళు దగ్గర్లో వున్న పోలీస్ స్టేషన్‌కి చేరుకున్నారు. అక్కడ కిల్లర్ జరిగింది చెప్పాడు. పోలీసులా మనుషుల్ని స్వాధీనపర్చుకున్నారు.

ఇన్‌స్పెక్టర్ వాళ్ళని చూసి__"వీళ్ళు టెర్రరిస్టులు కాదు. పాత ఖైదీలు__" అన్నాడాశ్చర్యంగా.

"టెర్రరిజం ప్రారంభమైతే ఇలా ఉపయోగించు కునేందుకెందరో అవకాశవాదులుంటారు__" అన్నాడు కిల్లర్..

కిల్లర్ అక్కడ తన వివరాలేమీ చెప్పలేదు. దొంగ

అని పట్టుకున్న ఘనత పోలీసులకే వదిలిపెట్టి అతడు ముందుకు వెళ్లాడు.

చివరకు శ్రీమన్నారాయణ తగులబడ్డ చోటు చేరు కున్నాడు.

అదొక మైలురాయి. రాతి పక్కగా సన్నని కాలి బాట. కాలిబాటలో వందగజాల దూరం నడిస్తే ఓ చెట్టు.

ఆ చెట్టుకింద సజీవదహనం అయిపోయాడు శ్రీమన్నారాయణ.

జాగ్రత్తగా పరిశీలిస్తే ఇప్పటికీ అక్కడ కొన్ని గుర్తులున్నాయి—ఓ మనిషి సజీవంగా. కాలిపోయినట్లు.

కిల్లర్ ఆ ప్రాంతాన్ని శ్రద్ధగా పరిశీలించాడు.

సింగ్ అక్కడే నిలబడి వెక్కి వెక్కి ఏడ్వసాగాడు.

తన పరిశోధన అయ్యాక—"ఇంక ఏడుపు ఆపు—" అన్నాడు కిల్లర్.

"నువ్వు నన్నిక్కడే పెట్రోలు పోసి తగులబెట్టు—" అన్నాడు సింగ్.

"ఎందుకు?"

"నా జాతి చేసిన అన్యాయానికి శ్రీ మన్నారాయణ ఆహుతి అయిపోయాడు. అందుకు బదులుగా నేను ప్రాయశ్చిత్తం చేసుకుంటాను...."

"నీ ఆలోచనలు మూర్ఖత్వంతో నిండివున్నాయి. నువ్వు సిక్కువు కాదు. మనిషివి. శ్రీమన్నారాయణ హిందువుకాదు. మనిషి. ఒక మనిషి అతడిని అన్యా యంగా సజీవదహనం చేశాడు. అందుకు నువ్వు బాధ్యు డివి కాదు...."

"అంటే?"

"శ్రీమన్నారాయణను సిక్కు చంపాడు కాబట్టి అది నీ బాధ్యత అయింది. అదే ఏ ముస్లిమో, హిందువో చంపితే అది నీ బాధ్యత కాదా? నిన్ను నువ్వు ఏదో జాతికి పరిమితం చేసుకోవడం సంకుచితం. మనమిప్పుడ న్వే షిస్తున్నది సిక్కు తీవ్రవాదులను కాదు. మన స్నేహితుణ్ని దారుణంగా చంపిన కొందరు దుష్టులను. తెలిసిందా?"

సింగ్ కాస్త ఊరట చెంది — "బాభీజీ నాతో మాట్లాడ్డం మానేసింది. స్వంత అక్కలా నన్నాదరించే బాభీజీ అలా ప్రవర్తించేసరికి నామీద నాకే ద్వేషం పుట్టుకొచ్చింది. ఇక్కడ శ్రీమన్నారాయణ అహుతైన దృశ్యం తలపులోకి రాగానే నాకు పిచ్చెక్కినట్లయింది. నీ మాటలు నాకు కాస్త ఊరటను కలిగించాయి—" అన్నాడు.

"అనవసరంగా ఆవేశపడకు. ఎవరో చేసిన తప్పుకు నిన్ను బాధ్యుణ్ని చేసుకోకు....పద....పోదాం—" అన్నాడు కిల్లర్.

మళ్ళీ వాళ్ళ వ్యాన్ బయల్దేరింది.

దగ్గర్లో ఇంకో పోలీస్ స్టేషన్....

అక్కడ ఇన్‌స్పెక్టర్ బహదూర్ సింగ్ వారితో ఎంతో అభిమానంగా మాట్లాడాడు.

కిల్లర్ అతడికి శ్రీమన్నారాయణ హత్య గురించి గుర్తుచేశాడు.

"అవునవును. మహాదారుణమది. మన సిక్కులందరూ సిగ్గుపడాల్సిన చర్య అది!" అన్నాడు బహదూర్ సింగ్.

"దుండగులు దొరికారా?"

"లేదు_"

"వాళ్ళకి ఆనవాళ్ళున్నాయా?"

"తీవ్రవాదుల గురించి యెన్నో ప్రయత్నాలు చేస్తున్నాము. ప్రత్యేకించి ఈ గుండు గుల్ని పట్టుకునే ఆనవాళ్ళంలేదు. వారి ఐడెంటిటీ తెలియదు...."

"నరసింగరావు మీకు చెప్పలేదా?"

"ఏవో గుర్తులు చెప్పాడు. కానీ అవి చాలవు. ఆయన బాగా షాక్ తిన్నట్లు కనిపించాడు .... నేను పోలీసు రక్షణతో ఢిల్లీకి పంపాను..."

"ఆయన చెప్పిన వెంటనే మీరు చుట్టుపక్కలకు సెర్చి పార్టీలు పంపలేదా?"

"పంపి ప్రయోజనముండదు. అయినా అప్పుడు నా వద్ద స్టాఫు మరీ యెక్కువగా లేదు.," అన్నాడు ఇన్‌స్పెక్టరు.

కిల్లర్ కాసేపు తటపటాయించి చివరకు తనవద్దనున్న ఆర్టు పేపరు ఇన్‌స్పెక్టరుకి చూపించాడు.

"ఎవరు వీళ్ళు?" అన్నాడు బహాదూర్ సింగ్ ఆశ్చర్యంగా.

"నేను నరసింగరావు చెప్పింది విని—ఈ బొమ్మ గీశాను. ఆయనీ బొమ్మచూసి భయపడుతూ—వీళ్ళే.... వీళ్ళే..నా స్నేహితుణ్ని కాల్చేశారు..కానీ వీళ్ళ గుర్తులు నేను చెప్పినట్లెవరికీ చెప్పవద్దు. నాకు భయంగావుంది.. అన్నాడు. కాబట్టి మీరు కూడా ఆయన విషయం మరిచిపోయి — వీళ్ళలో యెవరినైనా గుర్తించగలరేమో చెప్పండి.." అన్నాడు కిల్లర్.

బహాదూర్ సింగ్ ఆ బొమ్మల వంకే ఆశ్చర్యంగా చూస్తూ—"ఆ రోజు నరసింగరావు నాకు చెప్పిన విష

వాళ్ళకీ ఈ బొమ్మలకీ పూర్తిగా పోలిక లేదు-" అన్నాడు.

"అప్పుడాయన బాగా షాక్ తిని ఉన్నాడు. ఇప్పుడు తాపీగా జరిగినవన్నీ గుర్తుచేసుకొని చెప్పిన వివరాలివి.." అన్నాడు కిల్లర్.

"మీరు చెప్పింది నిజం. ఆ రోజాయన వణికిపోతున్న తీరు చూస్తుంటే నాకు మన జాతిమీద అసహ్యం కలిగింది. మనిషి బాగా పిరికివాడిలాగున్నాడు. అలాంటి వాణ్నంతలా బెదరగొట్టడం మహాఘోరం.."

"ఎంతటి ధైర్యవంతుడైనా గుండెలు జలదరించే పని చేశారు దుండగులు.. ఆయన వణికిపోవడంలో ఆశ్చర్యమేముంది? ఈ ఫోటోలో వ్యక్తులు మీకు తెలుసా?" అన్నాడు కిల్లర్.

"తెలుసు. కానీ వీళ్ళు దుండగులు గావడానికి వీల్లేదు..."

"ఎందుకని?"

"వీళ్ళు హిందువులు!"

"మీకు బాగా తెలుసా?" తెల్లబోతూ అడిగాడు కిల్లర్.

"తెలుసు.." అన్నాడు బహదూర్ సింగ్ నమ్మకంగా.

"వాళ్ళు హిందువులే అయితే ఇలాంటి పనెందుకు చేస్తారు?"

ఇన్స్పెక్టర్ ఆలోచనలోపడ్డాడు. కాసేపాగి ఆయన "వీళ్ళు ముగ్గురూ అన్నదమ్ములు. వీళ్ళ గ్రామం ఇక్కడికి అరవై కిలోమీటర్ల దూరంలో వుంది. వీళ్ళ తండ్రి మహావీర్ సింగ్ — నీతికీ, నిజాయితీకీ, త్యాగానికీ, ధైర్యానికీ పెట్టింది పేరు. ఆ ఊళ్ళో హిందువులు తక్కువ. సిక్కులెక్కువ. అయినప్పటికీ మహావీర్ సింగ్ కారణంగా

అక్కడి సిక్కులందరూ ఒక్కటై హిందువుల నభిమానిస్తున్నారు. మత సామరస్యం అక్కడున్నంతగా యింకెక్కడా లేదు. మహావీర్ సింగ్ కు జాతీయ స్థానంలో ఏదైనా బహుమతిప్పించాలని రాష్ట్రప్రభుత్వం అనుకుంటోంది....” అన్నాడు.

కిల్లర్ తనూ ఆలోచిస్తూ — “మహావీర్ సింగ్ ఆర్థిక పరిస్థితి ఎలాంటిది?” అనడిగాడు.

“ఒకప్పుడు బాగా వుండేదిట. ఇప్పుడు చితికి పోయాడు. అప్పుల్లో ఉన్నాడంటారు. ఏడాదిక్రితం కూతురి పెళ్ళి చేసి యిల్లమ్ముకున్నాడు. ఆ ఇల్లు కొనుక్కున్న సిక్కు జాలి తలచి ఆ యింట్లోనే అతడినుండనిస్తున్నాడు....”

“మహావీర్ సింగ్ గురించి మీ కిన్ని వివరాలెలా తెలుసు?” అడిగాడు కిల్లర్.

“ఈ చుట్టుపక్కల పేరెన్నికగన్న సంఘసేవకుడాయన....”

కిల్లర్ ఇన్‌స్పెక్టర్ కు ధన్యవాదాలు చెప్పి లేచాడు. “చాలా థాంక్స్” అన్నాడతడు.

“మీరింతవరకూ వచ్చినందుకు అభినందించాలి. ప్రజలు పంజాబులో అడుగుపెట్టాలంటే భయపడిపోతున్నారు. అడపాతడపా అక్కడా యిక్కడా అల్లరు జరుగుతున్నమాట వాస్తవం. అంతమాత్రాన పంజాబు వెళ్ళడమంటే అడవికి పోవడంకాదు—” అన్నాడు ఇన్‌స్పెక్టర్.

కిల్లర్ నవ్వి—“ఆ నిజం వచ్చేదాకా తెలియదుకదా! రావడానికి ధైర్యముండాలికదా..” అన్నాడు.

అంతవరకూ మౌనంగా వారి సంభాషణ వింటున్న

సింగ్ చటుక్కున నోరు తెరిచి—"ఆ ధైర్యం నా స్నేహితుడు శ్రీమన్నారాయణకుంది. ధైర్యమితడికిచ్చిన ప్రతిఫలం చూశారుగా—" అన్నాడు.

కిల్లర్ సింగ్ భుజం తట్టి—"ఏమనిషికి చావెలా రాసి పెట్టి ఉంటుందో చెప్పడం కష్టం. పడవ మునగవచ్చు. పాము కాటేయవచ్చు. ఇల్లు కాలిపోవచ్చు. స్టవ్ పేల వచ్చు. దురదృష్టం మనిషి నకాలమృత్యువుకు గురిచే స్తుంది—" అన్నాడు.

"దురదృష్టం ధైర్యవంతుణ్ని పొట్టన బెట్టుకుంటే బాధగా వుంటుంది కదా!" అన్నాడు సింగ్.

"పద—పోదాం—" అన్నాడు కిల్లర్ అతడి భుజం తట్టి.

ఇద్దరూ ఇన్‌స్పెక్టర్ దగ్గర సెలవు తీసుకొని వ్యానెక్కారు.

"ఇంతవరకూ మనం సాధించిన దేమిటి?"

"చాలా వుంది..." అన్నాడు కిల్లర్ వ్యాన్ స్టార్టు చేస్తూ.

"చాలా ఉందా? మనం వెనక్కి వెళ్ళిపోతున్నాం కూడా.." అన్నాడు సింగ్ అర్థంకానట్లు.

"అవును..కానీ మహావీర్ సింగ్‌ను కలుసుకున్నాక.."

"అతడి నెందుకూ కలుసుకోవడం?"

వ్యాన్ స్టార్టయింది. కిల్లర్ మందహాసంచేసి—"అతడిలో పెద్దరహస్యమే ఉన్నదని నా అభిప్రాయం" అన్నాడు.

సింగ్ మాట్లాడలేదు.

"నరసింగరావు ముగ్గురు యువతుల బొమ్మలు గీశాడు. వారు మహావీర్ సింగ్ బిడ్డలు.."

"కానీ వారు హిందువులు..."

"కావచ్చు. కానీ సంఘసేవ పేరు చెప్పి ఆస్తంతా పాడు చేసుకున్న మహావీర్ సింగ్ బిడ్డలు వారు.."

"అంటే?"

"నాకు తెలుసు. అలాంటివారి బిడ్డలెలా తయారవుతారో! పేరు ప్రతిష్టలు మనిషికి కూడు పెట్టవు...." కిల్లర్ కాసేపాగి — "మహావీర్ సింగ్ మహానుభావుడు కావచ్చు. కానీ ఉగ్రవాదుల కలాంటి వారవు. వారు పేరున్న ప్రతి హిందువునూ తుడిచిపెట్టేయాలనుకుంటారు. మహావీర్ సింగ్ కుటుంబానికి ప్రమాదం రాకుండా అతడి బిడ్డలు కొందరు సిక్కు ఉగ్రవాదులకు సహకరిస్తున్నారని నా నమ్మకం...."

"హిందువుల నాశనానికి హిందువులు సహకరిస్తారా....?"

"హిందువులు, సిక్కులు అన్నది మనకు నాయకులు కల్పించే భ్రమ, నాయకులకు సంబంధించి అదంతా స్వార్థం. మన దేశంలో మన దేశానికి వ్యతిరేకంగా ఇతర దేశాలకు పనిచేసే గూఢచారులు - భారతీయులే వున్నారు. కాదంటావా?"

సింగు కళ్ళు పెద్దవయ్యాయి — "నువ్వు చెప్పింది నిజమే! డబ్బు కోసం, స్వార్థం కోసం — రష్యన్లు రష్యాకు అమెరికన్స్ అమెరికాకు, బ్రిటన్స్ ఇంగ్లండ్ కు వ్యతిరేకంగా పనిచేసిన వార్తలు చాలా విన్నాను. మహావీర్ సింగ్ పిల్లలు కూడా అలాంటివారేననుకోవాలి...."

"ఇందులోని నిజానిజాలు ఆరాతీయడానికే మనం

మహావీర్ సింగ్ యింటికి వెళుతున్నాం—" అన్నాడు కిల్లర్.

వ్యాను స్పీడందుకుంది.

## 4

అది పురాతనకాలపు పెద్దిల్లు.

ఇంట్లో పేదరికపు ఛాయలు కనబడుతున్నాయి.

కిల్లర్, సింగ్ వ్యాన్ దిగేసరికి గుమ్మంలోనే వారికి మహావీర్ సింగ్ ఎదురయ్యాడు. వాళ్ళు తనకోసమే వచ్చారని తెలుసుకుని ఆయన తనే మహావీర్ సింగ్ నని చెప్పుకున్నాడు.

ఇద్దరూ ఆయనకు ప్రణామాలు చేశారు.

మహావీర్ సింగ్ ఆశ్చర్యంగా, "మీ రెవరు? నాతో మీకేం పని?" అనడిగాడు.

"మీ గురించి విని మిమ్మల్ని చూడాలని వచ్చాం—" అన్నాడు కిల్లర్.

వాళ్ళిద్దరూ ఆంధ్రాలో స్థిరపడిన సిక్కులని తెలిసి—"ఇంత దూరం వచ్చి చూసేటంత విశేషం నాలో వుందనుకోను. మీ రింకేదో పనిమీద వచ్చారు—" అన్నాడు మహావీర్ సింగ్.

"మీరు చెప్పింది కొంతవరకూ నిజం. ఇక్కడకు మేము వేరే పనిమీద వచ్చాం. పంజాబులో సిక్కులు హిందువులను హత్య చేయడంవల్ల యితర రాష్ట్రాలలోని సిక్కులందరికీ ప్రాణాపాయ పరిస్థితి ఏర్పడింది. సిక్కులు భారతదేశమంతా నిండి వుండి హిందూ సంస్కృతిలో ఒక భాగంగా కలిసిపోయారు. ఇతర ప్రాంతాలవారితో సోదరసమానులుగా జీవిస్తున్న సిక్కుల సుఖజీవితంలో నిప్పులు పోస్తున్న పంజాబు టెర్రరిస్టుల్ని కలుసుకుని

మాట్లాడాలని వచ్చాం. వాళ్ళ నెలా కలుసుకోవాలో తెలియకుండా గానీ మీ గురించి విన్నాం. ఈ విషయంలో మీ అభిప్రాయం తెలుసుకోవడం మంచిదనిపించింది__....”

మహావీర్ సింగ్ ముఖం గంభీరంగా అయిపోయింది.

“ఈ విషయంలో మీరు చేయవలసింది ఒక్కటే! పంజాబులో లేని సిక్కులందరూ ఒక్కటై టెర్రరిజాన్ని నిరసించండి. టెర్రరిజానికి వ్యతిరేకంగా ప్రదర్శనలు జరపండి. అప్పుడు సాటి ప్రజలకు టెర్రరిజాన్ని మీరూ నిరసిస్తున్నారన్న భావం ఏర్పడుతుంది. ఇంతవరకూ ఇతర రాష్ట్రాలలో సిక్కులలాంటి ప్రయత్నాలు చేసినట్లు లేదు__....”

“మీరు చెప్పింది నిజమే!” అన్నాడు సింగ్__ “అయితే పంజాబులోని హిందువుల రక్షణకు మేమేం చేయగలం?”

మహావీర్ కళ్ళెర్రబడ్డాయి__“నేను పంజాబీని. నా రక్షణకు ఒకరిపై ఆధారపడను....”

కిల్లర్ మాట మార్చుతూ “మీ జీవన విధానం గురించి తెలుసుకోవాలనుంది__” అన్నాడు.

మహావీర్ సింగ్ తన కుటుంబం గురించి గర్వంగానే చెప్పుకున్నాడు. తన భార్య, అల్లుళ్ళ గురించి చెప్పుకున్నాక__“నా కొడుకుల పద్ధతే నాకు నచ్చలేదు__” అన్నాడు.

“ఎందుకని?”

“ముగ్గురబ్బాయిలు నాకు. వాళ్ళు పల్లె విడిచి వెళ్ళరు. ఇక్కడే వుండి నాకు సాయపడతానంటారు. నా కెవరి సాయమూ వద్దన్నా వినరు. వాళ్ళ స్నేహితులు నలుగురైదు

గురు టెర్రరిస్టులతో కలిసిపోయారు. అప్పుడప్పుడు వాళ్ళూ వీళ్ళూ కలుసుకుంటూంటారు. నేనూ మా వాళ్ళకు చెప్పాను—ఆ టెర్రరిస్టుల మనసులేనా మార్చండి. లేదా వాళ్ళ ఆచూకీ పోలీసులకు చెప్పండి— అని! కానీ వాళ్ళు వినరు. సంపాదన గురించి హెచ్చరిస్తే డబ్బు సంపాదించడానికి అడ్డ మార్గాలంటారు. ఒక్కడూ పెళ్ళి చేసుకోనంటాడు....పంజాబులో శాంతి నెలకొనేదాకా వాళ్ళు బ్రహ్మచారులుగా ఉండిపోతారట....అదిప్పట్లో జరిగే పనేనా?" అంటూ నిట్టూర్చాడు మహావీర్ సింగ్.

"ఎందరో మిమ్మల్ని గౌరవిస్తున్నారు. మీ మాట చాలామందికి శిలాశాసనం. అలాంటప్పుడు మీ వాళ్ళు మాత్రం మీరు కానిస్తే ఎందుకు వినరు?"

"ఎందుకు వినరు—వింటారు. కాని నా పిల్లలు మానవత్వంలో నన్ను మించినవారు. నాకు డబ్బుమీద మోజు లేదు...." అని—"సుమారు రెండు నెలల క్రితం అనుకుంటాను. ఓ తమాషా జరిగింది...." అన్నాడాయన.

కిల్లర్, సింగ్ వింటున్నారు.

"మా ఊరిచివర రోడ్డుదగ్గర ఓ కారాగి ఉంది. అందులో యిద్దరు తెలుగువాళ్ళున్నారు. ఒకాయన పేరు శ్రీమన్నారాయణ. రెండో ఆయన పేరు నరసింగరావు. ఆ శ్రీమన్నారాయణ కారు దిగి కంగారుగా అటూ యిటూ తిరుగుతూంటే మా వాళ్ళు చూశారు. కారులో నరసింగరావు స్పృహతప్పి పడివున్నాడు. మా వాళ్ళు వాళ్ళిద్దర్నీ మా యింటికి తెచ్చారు. మా ఊళ్ళో డాక్టరు లేడు. పొరుగూరి డాక్టరు బాగా డబ్బుమనిషి. పిలవడానికి వెడితే రానన్నాడు. మా వాళ్ళు బలవంతంగా

ఎత్తుకుని తీసుకుని వచ్చారు. డాక్టరు రావడం కాస్త లేటై వుంటే ఆ నరసింగరావు చచ్చిపోయేవాడు. డాక్టరుకు శ్రీమన్నారాయణ బాగా డబ్బిచ్చి పంపాడు. రెండ్రోజులపాటు వాళ్ళకు మేము శక్తికి మించిన ఆతిథ్యం యిచ్చాం. అదంతా మా వాళ్ళే చూసుకున్నారు. నరసింగరావు వెళ్ళిపోతూ—వాళ్ళని—మీరు మనుషులు కాదు, దేవుళ్ళు—అన్నాడు...."

"అసలా నరసింగరావు కేమయింది?"

"డాక్టరు చెప్పిన కారణం టెన్షన్!"

"టెన్షన్ ఎందుకు?"

"కావాలని అమృతసర్ వెడుతున్నారు. మనిషి మరీ అంత ధైర్యవంతుడు కాకపోవచ్చు. ఏ క్షణంలో ఏమవుతుందోనన్న భయం ఎక్కువగా వుందనుకుంటాను. నే నతణ్ణి వెనక్కి వెళ్ళిపొమ్మని సలహా యిచ్చాను. శ్రీమన్నారాయణ మాత్రం తానుండగా నరసింగరావు కే ప్రమాదం రాదనీ—ముందుకే వెడతామనీ చెప్పాడు. అందుకు నరసింగరావూ అంగీకరించాడు. మా వాళ్ళు డాక్టర్ని మోసుకొచ్చిన పద్ధతికి వాళ్ళు తల్చుకుని నవ్వుకుంటూం డేవారు—" అన్నాడు మహావీర్ సింగ్.

"ఒక్కసారి మీ వాళ్ళను చూసి వెడతాము—" అన్నాడు కిల్లర్.

"వాళ్ళిప్పుడింట్లో నే వున్నారు—" అంటూ మహావీర్ సింగ్ లోపలకు వెళ్ళాడు.

కిల్లర్, సింగ్‌తో—"అనుకోకుండా మనకు శ్రీమన్నారాయణ కథను తనే చెప్పాడీయన. ఈ కథ నన్ను మరింత అయోమయంలోనికి తోసేసింది—...." అన్నాడు.

"నాకు మొదట్నించీ అంతా అయోమయంగానే ఉంది—" అన్నాడు సింగ్.

మహావీర్ సింగ్ తన ముగ్గురు కొడుకుల్నీ తీసుకుని వచ్చాడు.

కిల్లర్ కు వాళ్ళు దేశభక్తుల్లా కాక గూండాల్లా కనిపించారు. అల్లరి చిల్లరి మనుషుల్లా వున్నారు వాళ్ళు. అతడు వాళ్ళని శ్రీమన్నారాయణ గురించి మరికొన్ని ప్రశ్నలు వేశాడు. చెప్పుకోదగ్గ సమాచారం లభించలేదు.

టెర్రరిస్టుల గురించి కిల్లర్ వారిని మరికొన్ని ప్రశ్నలు వేశాడు.

"వాళ్ళను టెర్రరిస్టులనకండి. వాళ్ళు మా స్నేహితులు...." అన్నాడు మహావీర్ సింగ్ పెద్దకొడుకు.

"మీ స్నేహితులు హిందువులను కాల్చి చంపుతున్నారు...."

"వాళ్ళు కాల్చి చంపుతున్నది హిందువులను కాదు. సిక్కుమత వ్యతిరేక ప్రచారకుల్ని. వాళ్ళకు హిందువుల మీదనే ద్వేషముంటే మమ్మల్నెప్పుడో చంపేసేవారు...."

"అయితే మీరు మీ స్నేహితులకు సహకరిస్తున్నారా?"

ముగ్గురూ మాట్లాడలేదు.

"మీ స్నేహితులు కోరితే మీ ముగ్గురూ ఓ అమాయకుణ్ని కాల్చి చంపగలరా?" అన్నాడు కిల్లర్.

"ఓ మనిషిమీద పెట్రోలు పోసి అంటించమని టెర్రరిస్టులు చెబితే మీరు చేయరూ?"

ముగ్గురూ మాట్లాడలేదు.

కిల్లర్ వాళ్ళ ముఖభావాలనే గమనిస్తున్నాడు.

"ఈ ప్రశ్నలు మీరు మమ్మల్నెందుకు అడుగుతున్నట్లు?" అన్నాడు మహావీర్ సింగ్.

కిల్లర్ అతడికి శ్రీమన్నారాయణ పెత్రరిష్టుల చేత కాల్చబడ్డ విశేషం చెప్పాడు.

"అసాధ్యం! ఆ రోజు మా స్నేహితు లీ ప్రాంతాల లేరు—" అన్నాడు మహావీర్ సింగ్ పెద్దకొడుకు.

"వాళ్ళు కాకపోతే వాళ్ళ పేరుతో మరొకరు ...." అన్నాడు కిల్లర్.

"ఇందులో ఏదో తిరకాసుంది—" అన్నాడు మహావీర్ సింగ్ రెండో కొడుకు.

మహావీర్ సింగ్ మూడో కొడుకు సాలోచనగా—

"మీరు చెప్పిన ప్రాంతాల తోతారామ్ అనే కుర్రాడు తిరుగుతూంటాడు. అక్కడేం జరిగినా వాడి దృష్టి నుంచి తప్పించుకోదు—" అన్నాడు.

"తోతారాం ఎవరు?"

"వాడొక పశువుల కాపరి. కానీ విచిత్రమైనవాడు. వాడు చెబితే పశువులు బుద్ధిగా వుంటాయి. ఇతరుల పొలాల్లోకి వెళ్ళవు. ఎక్కడికీ తప్పిపోవు. వాటి మానాన వాటిని వదిలి తనెక్కడెక్కడో తిరుగుతూంటాడు వాడు....

"అయితే మనం వాణ్ని కలుసుకుందాం—"అన్నాడు కిల్లర్.

"మీ రిక్కడే ఉండండి. నేను వాడిని కలుసుకుని అసలు విషయం తెలుసుకుని వస్తాను...." అంటూ మహావీర్ సింగ్ మూడో కొడుకు లేచాడు.

"నేనూ వస్తాను. వాణ్ని నేను స్వయంగా కలుసుకుని

మాట్లాడాలి—" అన్నాడు కిల్లర్.

"లాభంలేదు. తోతారాంను పట్టుకోవడం, మాట్లాడించడం ఇతరులవల్ల కాదు.." అంటూ జవాబుకోసం యెదురుచూడకుండా తాను వెళ్ళిపోయాడు మహావీర్ సింగ్ మూడో కొడుకు.

"నరసింగరావు టెర్రరిస్టు లెలా వుంటారో మీకు వర్ణించి చెప్పలేదా?" అన్నాడు మహావీర్ సింగ్.

"చెప్పాడు—" అన్నాడు కిల్లర్.

"వాళ్ళెలా వుంటారో చెప్పండి. మా స్నేహితుల పోలికలతో కలుస్తాయేమో చూద్దాం—" అన్నాడు మహావీర్ సింగ్ రెండో కొడుకు.

కిల్లర్ అతడి కళ్ళలోకి చూశాడు. కుతూహలం, భయం, అనుమానం వగైరా రకరకాల భావాలున్నాయి ఆ కళ్ళలో!

"వాళ్ళు ముగ్గురు. దృఢంగా ఉంటారు. గెడ్డాలూ, మీసాలూ వుండవు. చూడగానే హిందువు అనిపిస్తుంది ..." కిల్లర్ వాళ్ళ ముఖభావాలను గమనిస్తూ అన్నాడు.

మహావీర్ సింగ్ నిట్టూర్చి—"మతం గుర్తు తెలియాలంటే—మనిషికో, ఆలయానికో రూపం మార్చాలి. మత గ్రంథానికి వేరే పేరు పెట్టాలి. లేకుంటే అంతా ఒక్కటే కదా!" అన్నాడు.

సింగ్ తానెక్కువగా సంభాషణలో జోక్యం చేసుకోవడంలేదు. "అతడా ముగ్గురు యువకుల్ని నరసింగరావు హంతకులుగా చిత్రించి ఇచ్చాడన్న నిజాన్ని బయట పెడతాడా?" అని ఆలోచిస్తున్నాడు.

కిల్లర్‌కీ, సింగ్‌కీ—యింట్లోంచి పకోటాలూ, ఆలూ

మటన్ వచ్చాయి. వేడిగా వున్న ఆ పదార్థాలు వారి
కెంతో రుచికరంగా అనిపించాయి.

కాసేపు వారక్కడ విశ్రాంతి తీసుకున్నారు.

సుమారు గంట తర్వాత మహావీర్ సింగ్ మూడో
కొడుకు తిరిగివచ్చాడు. అతడి ముఖం నీరసంగా వుంది.

"ఏమయింది?" అనడిగాడు మహావీర్ సింగ్ ఆశ్చ
ర్యంగా.

కొడుకు మాట్లాడలేదు.

"తోతారాం దొంకలేదా?"

"దొరికాడు...."

"తనావేళ ఏమైనా చూశాట్టా?"

"చూశాడు—"

"ఏం చూశాడు?"

"చెబితే ఎవరూ నమ్మరు...."

"నేను నమ్మతాను—చెప్పు!"

"నరసింగరావు శ్రీమన్నారాయణను చంపే
శాట్ట...."

అందరి కంటే యెక్కువగా రామచరణ్ సింగ్
ఉలిక్కిపడ్డాడు.

"అదెలా సాధ్యం?" అన్నాడు మహావీర్ సింగ్.

"ఇద్దరు మనుషులా వస్తూంటే అంతవరకూ చెట్టు
కింద కూర్చున్న తోతారాం చెట్టుచాటుకు వెళ్ళాట్ట. ఏం
జరుగుతుందో గమనిస్తున్నాట్ట. వాళ్ళిద్దరూ వాడి కర్థం
కాని భాషలో మాట్లాడుకుంటున్నారుట. ఇద్దరూ
నవ్వుతూ స్నేహంగా మాట్లాడుకుంటున్నారుట. ఉన్న
ట్లుండి నరసింగరావు తన చేతిలోని డబ్బాలోని పెట్రోలు
చటుక్కున శ్రీమన్నారాయణమీద పోసి—ఏమేమో

చూస్తూ రేట్ట. శ్రీమన్నారాయణ భయపడ్డాట్ట. తర్వాత అతడు లైటరుతో శ్రీమన్నారాయణను అంటించే శాట్ట.... శ్రీమన్నారాయణ భయంకరంగా కేకలు పెడుతూంటే అతడిమీద మరింత పెట్రోలు విదిలించి పక పకా నవ్వేట్ట.... శ్రీమన్నారాయణ పూర్తిగా కాలి పోయేదాకా అక్కడే ఉన్నాట్ట. తర్వాత వెళ్ళి పోయాట్ట—...."

కిల్లర్ అతడివంక చూసి—"తోతారాం అబద్ధాలు చెప్పడని నమ్మకమేనా?" అన్నాడు.

"ఊం."

"ఇలా అడుగుతున్నానని యేమీ అనుకోవద్దు. తోతారాం అనేవాడు నిజంగా ఉన్నాడా?" అన్నాడు కిల్లర్ మళ్ళీ.

"ఎందుకిలా అడుగుతున్నారు?" అన్నాడు మహావీర్ సింగ్.

"ఎందుకంటే?" ఒక్కక్షణం ఆగాడు కిల్లర్— "తోతారాం నిజంగా ఉంటే తప్ప మీరు చెప్పిన నిజం తెలిసేదికాదు. ఆ నిజమేమిటంటే—... ఒక స్నేహితుణ్ని నరసింగరావు కొత్త ప్రాంతంలో చంపేశాడు. అదీ యెప్పుడు? అతడు తన ప్రాణాలు రక్షించేక....ఇలా జరగొచ్చని మీరు నమ్మతారా?"

"నేను నమ్మలేక పోయాను. నాకు మానవత్వం మీదనే నమ్మకం నశించింది. అందుకే నిరసంగా తిరిగి వచ్చాను—" అన్నాడు మహావీర్ సింగ్ మూడో రోజున.

"నాకు మానవత్వంమీద నమ్మకముంది. అందుకే

తోతారాం ఉనికిని నమ్మలేకపోతున్నాను—" అన్నాడు కిల్లర్.

మహావీర్ సింగ్ ఆశ్చర్యంగా—"లేని తోతారాంను ఉన్నట్లు చెప్పాల్సిన అవసరం మావాడి కేముంది?" అన్నాడు.

"ఏమో—అతడికే తెలియాలి— ...." అన్నాడు కిల్లర్.

మహావీర్ సింగ్ తన ముగ్గురు కొడుకులవంకా అనుమానంగా చూశాడు. కళ్ళతోనే వాళ్ళాయనకు సమాధానమిచ్చారు.

తండ్రి ప్రశ్న, కొడుకుల జవాబు కూడా కిల్లర్ చదివాడు.

"తోతారాం నిజంగా వున్నాడు—" అన్నాడు మహావీర్ సింగ్.

కిల్లర్ నవ్వి "నేనిక సెలవు తీసుకుంటాను—" అన్నాడు.

అతడలా అడిగినందుకు రామ్‌చరణ్ సింగ్ ఆశ్చర్యపడ్డాడు.

## 5

"మనం ఢిల్లీ పోయేపక్షంలో ఏం తెలుసుకున్నట్లు?" అన్నాడు సింగ్.

"మహావీర్ సింగ్ మంచివాడు. ఆయన కొడుకులు దుడుకుమనుషులు. అల్లరిచిల్లరగా డబ్బు సంపాదించే రకాలు. ఆయన వాళ్ళ గురించి పరోక్షంగా నిజాలు చెప్పి ప్రత్యక్షంగా అబద్ధాలు చెప్పాడు. వాళ్ళకు పెళ్ళి కావడం లేదంటే సంబంధాలు రావడంలేదన్న మాట. వాళ్ళూరువదలి వెళ్ళడం లేదంటే వాళ్ళకు చదువు రాలే

దన్న మాట. వాళ్ళకు టెర్రరిస్టులతో స్నేహమున్నదంటే తుంటరి స్నేహితులున్నారని అర్థం. వాళ్ళు బలవంతంగా డాక్టర్ని తెచ్చారంటే అలాంటి పనులు వాళ్ళకి మామూలన్న మాట. శ్రీమన్నారాయణిచ్చే డబ్బు కాశపడి వాళ్లాయన్నా, నరసింగరావుమా తమ ఇంటికి తీసుకుని వెళ్ళి వుంటారు—"

"అంటే వాళ్ళే శ్రీమన్నారాయణను కాల్చి చంపేరంటావా?"

"అదే నిజమని నాకు తోస్తే వెంటనే వాళ్ళ అంతు తేల్చేయణ్ని. కానీ ఈ విషయంలో వాళ్ళు నిరపరాధులు. తోతారాం అనేవాడున్నాడో లేదో నాకు తెలియదు కానీ వాళ్ళు చెప్పింది నిజం—...."

"అంటే?"

"నరసింగరావే కావాలని శ్రీమన్నారాయణుని పెట్రోలు పోసి అంటించాడు. ఆ నేరం పంజాబు టెర్రరిస్టులమీదకి తోసేయాలనే ఉద్దేశంతో అతడు శ్రీమన్నారాయణను ప్రోత్సహించి అమృతసర్ ప్రయాణానికి పురిగొల్పాడు. తను తప్పు చేయబోతున్నానని అతడికి తెలుసు. ఇలాంటి నేరాలు నతడు గతంలో చేసివుండడు. అందుకల్లే అంతులేని టెన్షన్‌కు గురయ్యాడు. తాననుకున్న చోటు సమీపించే సరికి అతడు టెన్షన్ భరించలేక స్పృహతప్పి పడిపోయాడు—" అన్నాడు కిల్లర్.

"నువ్వు చెప్పింది బాగానే వుంది. కానీ తన ప్రాణాలను రక్షించిన శ్రీమన్నారాయణ నతడెలా చంపగలడు? తన్ను రక్షించిన మహావీర్ సింగ్ ముగ్గురు కొడుకుల్ని హంతకులుగా నిరూపించాలని ఎందుకు చూస్తాడు?" అన్నాడు సింగ్.

"ఏవో కారణా లుంటాయి. అవే తెలుసుకోవాలి. శ్రీమన్నారాయణపై అతనికి బాగా కక్ష ఉండివుండాలి. ఆ కక్ష తీర్చుకుందుకు టెర్రరిస్టుల నతడు తెలివిగా ఉపయోగించుకున్నాడు. అతడికి మహావీర్ సింగ్ కొడుకు అంటే కృతజ్ఞత వుంది. అందుకే వాళ్ళను హంతకులుగా చిత్రిస్తూనే అతడు తనకు తెలియకుండానే వాళ్ళ కళ్ళలో త్యాగశీలతను ప్రతిబింబించేలా చేశాడు. వాళ్ళను నువ్వూ చూశావుగదా! వాళ్ళు మంచిమనుష్యుల్లా లేరు-" అన్నాడు కిల్లర్.

"జరిగింది బాభీజీ నమ్ముతుందా? నా నిర్దోషిత్వాన్నా కుటుంబం అంగీకరిస్తుందా?" అన్నాడు రాంచరణ్ సింగ్.

"నిజాన్ని మనం బైటపెట్టక తప్పదు. లేకుంటే మరి కొందరు దుర్మార్గులిది అవకాశంగా తీసుకుని అన్యాయాలకు, అక్రమాలకు తలపెడతారు టెర్రరిస్టుల పేరుతో జరిగిన దుశ్చర్యలను లోతుగా పరిశీలించే అవకాశంకూడా ఏర్పడుతుంది...."

సింగ్ సాలోచనగా—"పంజాబులో ప్రతి యింటా తుపాకీ ఉంటుంది. చాలామంది తమ పాత పగలను టెర్రరిస్టుల పేరుతో తీర్చుకుంటున్నారేమోనని నా కిప్పుడనుమానంగా వుంది—...." అన్నాడు.

"కొన్ని అబద్ధాల కారణంగా నిజం అబద్ధం అయిపోదు. పంజాబులో టెర్రరిజం కొనసాగుతున్న మాట నిజం. కొందరది అవకాశంగా తీసుకోవడం దురదృష్టం—...."

"నరసింగరావుకు వ్యతిరేకంగా మనం సంపాదించిన సాక్ష్యాలకు రుజావు కావాలి. మనం తోతారాంను కలు

సుకోవలసింది. మహావీర్ సింగ్ యింట్లోని విశేషాలు టేప్ చేయవలసింది—" అన్నాడు సింగ్.

"ఆ సాక్ష్యాలు కోర్టులో నిలబడవు. తోతారాం కోర్టుకు వచ్చి సాక్ష్యమివ్వకపోవచ్చు. ఇచ్చినా అతడి సాక్ష్యానికి విలువుంటుందని గ్యారంటీ లేదు. మహావీర్ సింగ్ కొడుకు ఈ హత్య చేయలేదని నిరూపించలేము. ఎందుకంటే శ్రీమన్నారాయణ హత్య గురించి విన్నాకనే వాడు తోతారాం గురించి కల్పించి వుండవచ్చు. మన పరిశోధన నరసింగరావు కెంత వ్యతిరేకంగా ఉందో మహావీర్ సింగ్ కొడుకులకీ అంతే వ్యతిరేకంగా వుంది. నాకు నరసింగరావుమీదే అనుమానముంది. అతడిచేత నిజం చెప్పించే ఉపాయం చూడాలి తప్ప—మహావీర్ సింగ్ కుటుంబాన్నిబ్బందిలో పెట్టకూడదు—" అన్నాడు కిల్లర్.

## 6

వ్యాన్ నరసింగరావింటి ప్రాంగణంలో ప్రవేశించింది. అప్పుడు కిల్లర్ మామూలు వేషంలో వున్నాడు. ఇంట్లో నరసింగరావు లేడు. చెప్పాలంటే ఎవ్వరూ లేరు. ఆయన కుమార్తె సునీత మాత్రం ఉంది. ఆమె బియ్యే ఫైనలియర్ పరీక్షలవ్వాల్సి ఉంది. అందుకే ఒంటరిగా ఉంది.

"ఒంటరిగా ఉండడం నా కలవాటే!" అందామె నవ్వుతూ.

"నాన్నగారెప్పుడొస్తారు?" అన్నాడు కిల్లర్.

"అంతా ఆగ్రా వెళ్ళారు. బహుశా రేపు సాయంత్రానికి రావచ్చు...."

"రెండ్రోజుల క్రితం మేము మీ ఇంటికి వచ్చాం...."

అన్నాడు కిల్లర్.

"మీరు నాకు తెలుసు" అందామె.

"ఎలా? ఆ రోజు మిమ్మల్నింట్లో చూడలేదు నేను...." అన్నాడు సింగ్.

ఆమె లోపలకు వెళ్ళి ఓ అర్ట్ పేపరు తెచ్చింది. దాని మీద కిల్లర్ రాంచరణ్ సింగుల బొమ్మలున్నాయి.

"మీరు వచ్చినప్పుడు నే నింట్లో లేను. నేను వచ్చే వరికి మీరు వెళ్ళిపోయారు. నాన్న ఆగ్రా వెడుతూ మీ గుర్తులు నాకు చెప్పారు. నేను బొమ్మ వేశాను. పోలికలు సరిగ్గా వచ్చేయన్నారు. ఇప్పుడు చూస్తూంటే నాకు చాలా తృప్తిగా వుంది. నాన్న గుర్తులు సరిగ్గా చెప్పగలరు. నే నది బొమ్మగా వేయగలను...."

"మీరు వేయడమెందుకు? మీ నాన్నగారే గొప్ప చిత్రకారులు కదా!" అన్నాడు కిల్లర్.

సునీత నవ్వి — "నాన్న బొమ్మ వేయడమా? ఆయన మనిషిని వేయాలనుకుంటే ఏ వంకరకాళ్ళ గాడిదో తయారవుతుంది—" అంది.

అప్పుడు కిల్లర్ తన దగ్గరున్న బొమ్మ చూపించి— "ఇది మీ నాన్నగారు వేయలేదా?" అన్నాడు.

ఆ బొమ్మను చూసి సునీత తడబడి— "ఈ బొమ్మ మీ దగ్గరకెలా వచ్చింది?" అంది.

కిల్లర్ క్లుప్తంగా తన కథ చెప్పి— "శ్రీమన్నారాయణ వంటి సచ్ఛీలుణ్ణి, నీతిపరుణ్ణి, దేశభక్తుణ్ణి, స్నేహపాత్రుణ్ణి అమానుషంగా కాల్చిచంపిన క్రూరాతిక్రూరులు వీళ్ళు. మీ నాన్నగారు నాకు వీళ్ళ బొమ్మనిచ్చారు...." అన్నాడు.

"వీళ్ళ బొమ్మను నాన్న వేయలేదు. నేను వేశాను...." అంది సునీత.

సింగ్ ఆశ్చర్యంగా కిల్లర్ వంక చూశాడు. కిల్లర్ ఆ బొమ్మవంక చూశాడు.

తన అంచనా మొత్తం తప్పుతున్నట్లుంది.

ఆ బొమ్మలోని మహావీర్ సింగ్ కొడుకులు ముగ్గురూ దుష్టుల్లా కాక కధానాయకుల్లాగున్నారు. నరసింగరావుకు సంబంధించి అందుకు కారణం వెతికాడు తను.

సునీత కేమి కారణముంది?

"నువ్వీ బొమ్మ వేసేముందు—వీళ్ళు నరహంతకులని మీ నాన్న నీకు చెప్పలేదా?"

"ఆయనేం చెప్పారో నాకు తెలియదు. కానీ నాకు మాత్రం వీళ్ళు నరహంతకుల అనిపించదు....!" అంది సునీత.

"శ్రీమన్నారాయణ వంటి సచ్ఛీలుణ్ణి....సత్పురుషుణ్ణి "

కిల్లర్ యింకా యేదో అనబోతూండగా—"ఆపండి కిల్లర్ గారూ!" అంది సునీత అసహనంగా.

"ఏమయింది?" అన్నాడు కిల్లర్.

"తండ్రి స్నేహితుడని నమ్మి సంకోచించకుండా గదిలోకి వచ్చిన కూతురీడు ఆడపిల్లను యుక్తాయుక్త విచక్షణాజ్ఞానం లేకుండా బలాత్కారంచేవాడిని సచ్ఛీలుడు, సత్పురుషుడు అనడం తప్పు. కాకపోతే మీరు శ్రీమన్నారాయణను పొగడండి కానీ నా దగ్గర పొగడొద్దు. నేను భరించలేను. ఆయన నయవంచకుడు. నరరూప రాక్షసుడు..."

"ఎలా తెలుసు మీకు?" అన్నాడు కిల్లర్ ఆశ్చర్యం నటిస్తూ.

సునీత చటుక్కున తడబడింది—"ఏమో నా కలా కనిపించింది—...." అందామె.

"సెలవు సునీతా! చాలా థాంక్స్—...." అన్నాడు కిల్లర్.

కాసేపటికి మొబైల్ వ్యాన్ ఢిల్లీ నుంచి తెలుగు దేశానికి తిరిగింది.

"మనం బయల్దేరి వెందుకు? తెల్సుకున్న దేమిటి?" అన్నాడు రామచరణ్ సింగ్. అతడి కంఠం ఆదుర్దా మయంగా ఉంది.

"శ్రీమన్నారాయణ సునీతను చెరిచాడు. వాళ్ళింట్లో శ్రీమన్నారాయణంటే యెలాంటి అభిప్రాయముందో తెలుసుకుందుకు నే నాయన్ని పొగిడితే అసలు కథ బయటపడింది. సునీత భరించలేక నిజాన్ని కొంత బైట పెట్టింది. నరసింగరావుకు శ్రీమన్నారాయణ దారుణ కృత్యం తెలిసివుంటుంది. అతడు అమృతసర్ ప్రయాణం వంకతో తప్పు టెర్రరిస్టులమీద తోసేయొచ్చునని శ్రీమన్నారాయణను పంజాబులో చంపాడు. నిజం కూతురి క్కూడా చెప్పలేదు.

మహావీర్ సింగ్ కొడుకుల రూపం వర్ణించి కూతురికి చెప్పివుంటాడు. ఆమె వారిపట్ల ఆరాధనా భావంతో బొమ్మ గీసింది. నరసింగరావును హంతకుడిగా నిరూపించడం కష్టంకాదు. హత్య అతడు చేశాడో, మహావీర్ సింగ్ కొడుకులు చేశారో తను తెలుసుకోదల్చుకోలేదు. ఎందుకంటే శ్రీమన్నారాయణ తన బుద్ధికి తగ్గ దాకే

చచ్చాడు. అలాంటి స్నేహితుడు చచ్చినందుకు నువ్వు విచారించ నవసరంలేదు. ఆ కుటుంబంలో నీకు స్నేహ సంబంధాలు నశించినా బాధపడకు. నేను మాత్రం నీ ప్రమేయం లేకుండా విడిగా వెళ్ళి వాళ్ళింట్లో శ్రీమన్నా రాయణ ఎలా చచ్చాడో ఎందుకు చచ్చాడో తెలు కొను—" అన్నాడు కిల్లర్.

"అందువల్ల ప్రయోజనం?" అన్నాడు రామ్‌చరణ్ సింగ్.

"వాళ్ళింట్లో వాళ్ళు ఆయన పోయినందుకు బాధ పడుతూ ఉంటారు. ఆ బాధ కాయన అర్హుడు కాదు—...."

"నాకు తెలిసిన శ్రీమన్నారాయణ యెంతో మంచి వాడు...."

కిల్లర్ నవ్వి—"మంచితనం పైకి కనపడవచ్చు. సునీత వంటి చిన్న అమ్మాయిని బలాత్కారించినవాడు స్వతహాగా చెడ్డవాడై ఉండాలి....అలాంటి బుద్ధి ఒక్కరోజులో ఏర్పడేది కాదు...."

"ఏమో—ఆ అమ్మాయి యెలాంటిదో?" అన్నాడు రాంచరణ్ సింగ్.

"ఆ అమ్మాయెలాంటిదైనా శ్రీమన్నారాయణ దుర్మార్గం ఋజువు చేయడానికొక్క తిరుగులేని సాక్ష్యముంది—"

"ఏమిటది!"

"సునీత గీసిన బొమ్మ....ఆ బొమ్మలో ముగ్గురు హంతకు లున్నారు. వారికళ్ళలో పవిత్రకార్యా నిర్వహించినవారి లక్షణాలున్నాయి. త్యాగశీలత, ధైర్యసాహసాలు...."

ఆతన్ని ఆమెకు శ్రీమన్నారాయణపట్ల గల ద్వేషాన్ని తెలియబర్చుతాయి...."

"నీవు చెప్పినది నిజమే! నేనైతే యింత దూరం ఆలోచించలేను. కానీ యిలా జరిగిందంటే యెవరు నమ్ముతారు?" అన్నాడు సింగ్.

"నువ్వు చెబితే యెవరూ నమ్మరు. కానీ నేను చెబితే నమ్ముతారు. శ్రీమన్నారాయణ కుటుంబంలో అంతా ఆయనవంటి వారేమో నాకు తెలియదు. వారెలాంటి వారైనా ఆయన గురించిన నిజం తెలుసుకోవడం మంచిది."

"తెలుసుకుంటే నరసింగరావు నురికంబ మెక్కించా లనుకుంటారు!"

"నరసింగరావు ఉరికంబ మెక్కాలంటే—శ్రీమన్నారాయణ అసలు రంగు బయటపడుతుంది...."

సింగ్ తల పట్టుకుని—"ఇప్పుడేం జరుగుతుంది!" అన్నాడు.

"అసలు కథ తెలుసుకున్నాక ఆ యింట్లో యెవరికైనా కొద్దిగ బుద్ధుంటే మానుకుంటారు. మంచి బుద్ధి ఉంటే నీ బోటివాళ్లతో తిరిగి స్నేహం చేస్తారు...."

"శ్రీమన్నారాయణలాంటివారైనా నాకు బాధిక అంటే ఇష్టం. ఆమె మంచిది. ఆ కుటుంబంతో స్నేహ సంబంధాలు కోరుతున్నాను నేను.... నేను కోరినది జరిగితే—నువ్వు కోరిన ఫీజు నిస్తాను...."

"వెర్రరికాన్ని నిరసించే సిక్కుగా పేపర్లో కక్కు. నీవారిందర్నీ అందుకు ప్రోత్సహించు. నీ నుంచి నేను కోరే ఫీజు అదే!" అన్నాడు కిల్లర్.

ఆ తర్వాత మూడు రోజులకి శివరాజా సింగ్ ఇంటికి వెళ్ళాడు.

"ఇంట్లోనే ఉన్నావా? ఎప్పుడొచ్చావ్?" అని స్నేహపూర్వకంగా పలకరించాడతడు.

"నాతో నీ కేమిటి పని?" అన్నాడు సింగ్.

"నాకేం పనిలేదు. బాభీజీ నిన్ను టీకి రమ్మని పిలిచింది. చెప్పడానికి వచ్చాను...." అన్నాడు శివరాజా.

రామచరణ్ సింగ్ కళ్ళలో మెరుపు! మనసులో కిల్లర్‌కి ధన్యవాదాలు!

—: అ యి పో యిం ది :—

# బందిపోట్లు

## భీమవరపు పురుషోత్తం

గుబురుగా ఉన్న చెట్టుకొమ్మల్ని తోసుకొంటూ నడిచాడు విశ్వనాథ్!

ఎదురుగా నిశ్చలంగా కనిపిస్తూంది తెల్లటి కోనేరు! అతడి కళ్ళు మెరిశాయి. దాహం రెట్టింపయింది. కోనేటి దగ్గరకు వెళ్ళి సగం నీటిలో మునిగిపోయి ఉన్న పెద్ద రాయిమీద కాలు పుంచి వంగి, దోసిళ్ళతో నీళ్ళు తీసుకొని తాగాడు.

హాయిగా ఉన్నట్టనిపించింది అతనికి నీళ్ళు తాగాక.

కొద్ది దూరంలో కనబడుతున్న చల్లటి చెట్టునీడ కేసి నడిచాడు. పెద్ద పెద్ద వృక్షాలు కలల్లా పెనవేసుకొని పోయిన పొదలతో పచ్చగా ఇరుగ్గా ఉన్న అరణ్యమది!

శరీరం నిండా అలసటవల్ల నీడలో కాసేపు కూర్చోగానే నిద్ర ముంచుకొని రాసాగింది విశ్వనాథ్ కు. మెత్తయిన పచ్చికపై వాలి కళ్ళు మూసుకున్నాడు.

క్రమంగా నిద్రలోకి జారిపోయాడు.

అతడి శరీరంపై దుస్తులు చాలావరకూ మాసిపోయి ఉన్నాయి. ఎడం మోకాలివరకూ పేంటు పీలికలుగా చిరిగిపోయి ఉంది.

అలా యెంతసేపు గడిచిందో అతడికే తెలీదు! దాదాపు సూర్యాస్తమయ సమయం అయిపోయింది అప్పటికి. హోరుమని వినిపిస్తున్న గుర్రపు డెక్కల చప్పుడు క్రమంగా పెద్దదవడం అతడికి లీలగా తెలుస్తోంది!!?

లేవటానికి ప్రయత్నించసాగాడు విశ్వనాథ్. అవయవాలు అతడి స్వాధీనంలో లేవు! అలసట అతడిని లొంగదీస్తోంది. అతి కష్టంమీద కొద్దిగా లేచి కళ్ళు విప్పసాగాడు!

గుర్రపు దండు అతడున్న ప్రాంతాన్ని సమీపించింది. కళ్ళు విప్పిన విశ్వనాథ్, తన ప్రక్కన వున్న చెట్టుచాటుకు తప్పుకోవాలని అటు కదిలాడు అతికష్టం మీద!!

గుర్రపుడెక్కల చప్పుడు ఆగిపోగా వినిపించిందో కఠినస్వరం "ఏయ్ ఎక్కడ్రా వాడు?"

"తీసుకు రండిటు!"

ప్రమాదం పక్కన చేరిందని గ్రహించాడు విశ్వనాథ్. నల్లగా ఒక మోస్తరు ఎత్తులో వున్న ఇద్దరు ధృడకాయులు అతడిని సమీపిస్తున్నారు! వాళ్ళ తలలు ఎర్రగా ఎండిపోయి దుబ్బుల్లా లేగి ఉన్నాయి.

అతడూహించింది నిజమయింది! బందిపోటు దొంగలు వాళ్ళు! వాళ్ళకు దూరంగా చాలామంది దొంగలు ఆగిన గుర్రాలపై నుండి ఇటే చూస్తున్నారు! రెండు తుపాకులు తనవైపు గురి పెట్టబడి ఉండడం గమనించాడు విశ్వ

నాథ్.

చెరో వైపు అతడిని ఒడిసిపట్టుకొని ముందుకు నడిపించారు వాళ్ళు. తనను ఎందుకు తీసుకెళుతున్నారో అర్థం కాలేదు విశ్వనాథ్ కి.

అందులో ఒకడు విశ్వనాథ్ ను, తన గుర్రం బలమైన మెడపై మూటలా ఎత్తి పడేశాడు. బాధగా మూలిగాడు విశ్వనాథ్. మళ్ళీ నాయకుడి అరుపుతో పరుగు అందుకున్నాయి గుర్రాలు

గుర్రం మెడపై నిస్సత్తువగా పడున్న విశ్వనాథ్ కు కడుపులకు పొత్తికడుపు నొక్కుకొనిపోతూ నరకంగా ఉంది!

దాదాపు అరగంటపైనే సాగింది ప్రయాణం గుర్రం వేగం తగ్గడం తెలుస్తోంది విశ్వనాథ్ కు అక్కడంతా ఇసుక ప్రాంతను కావడంవల్ల దుమ్ము చుట్టూ పొగ పెట్టినట్టు క్రమ్మేసింది వాళ్ళను. విశ్వనాథ్ కు దగ్గు వస్తోంది దుమ్ము ముఖంమీద పడి.

కొద్దిగా మెడతిప్పి చూశాడు. ఆకాశంలోనికి ఉన్నట్టున్న సన్నటి ఎత్తైన చెట్లు వాటి చుట్టూ అల్లుకొన్న ముళ్ళపొదలు, వాటి వెనుక అస్పష్టంగా కనిపిస్తున్న మెట్టలావున్న కొండ!! దానికి మూలగా పెద్ద నీటి ధార కొండపై సహజంగా ఏర్పడిన రంధ్రంలో నుండి వెలుపలికి తన్నుకువచ్చి క్రిందికి ప్రవాహంలో పడుతూంది.

గుర్రాలను ముందుకు నడిపించారు. చెట్లను దాటుకొంటూ కొద్దిదూరం వెళ్ళాక ఎడం వయిపుకు తిరిగారు! కొండను దగరగా చూశాడప్పుడు విశ్వనాథ్. పొరలు పొరలుగా ఉన్న పలకరాళ్ళు అతికినట్టు పెళుసుగా

ఉందో కొండ. గుర్రాలు బాగా ముందుకు నడిచాయి....

పైనుండి పడుతున్న నీటిధారలనుండి, విడిగా పైకి చిమ్ముతున్న నీళ్ళు, విశ్వనాథ్ ముఖంపై జల్లులా పడుతున్నాయి. అలా కాసేపు అక్కడే ఉంటే బావుండుననిపించింది అతడికి. అయినా గుర్రాలు ముందుకు సాగిపోయాయి—

ఎదురుగా నిలువెత్తులో కనిపిస్తూన్న మొక్కల వెనుక విశాలమైన నల్లటి ప్రదేశం కనిపించడంతో కళ్ళు పెద్దవి చేసి చూశాడు విశ్వనాథ్!?

క్రమంగా అర్థమైంది అతడికి. కొండ లోపలి మార్గాన్ని చూసే గుహ అది!! గుర్రాలను లోపలికి నడిపించారు. కొద్దిదూరం వెళ్ళాక నిండా కటిక చీకటిలో మునిగిపోయినట్టనిపించిందతడికి! లోపల ఒకడు కాగడా వెలిగించి, అక్కడే గోడకు అమర్చబడివున్న ఇనుప పట్టాలో గుచ్చాడు. కొద్దిగా కాగడా వెలుతురు కళ్ళకు తగలడంతో కంటి రెప్పలు టప టప లాడించాడు విశ్వనాథ్.

కాసేపు గడిచింది. గుర్రాలు ఒకచోట ఆగాయి!

చటుక్కున బలమైన చెయ్యి పడింది విశ్వనాథ్ మెడపై!? క్రిందకు లాగిందా చెయ్యి అతడిని. పైకి లేచే ఓపిక ధైర్యం లేకపోవడంతో అలాగే ఉండిపోయాడతడు క్రింద.

మళ్ళీ చెయ్యి అతడి మెడపై పడింది. కాలరువద్ద పట్టుకొని పైకి లేపింది. గబగబా ఈడుస్తున్నట్లు నడిపిస్తూ లాక్కెళ్ళాడా వ్యక్తి! అక్కడొక మూల కాగడా వెలుగుతోంది. ఎదురుగా వున్న చెక్కతలుపు తెరిచాడు.

తనను నిర్బంధిస్తున్నారని గ్రహించాడు విశ్వనాథ్.

అతడిని లోపలికి నెట్టిన తర్వాత తలుపు మూసి వేయ బడింది.

## 2

మెల్లగా లేచి చూశాడు విశ్వనాథ్. గది బాగా చిన్నది. రాతిగోడలు మెరుస్తున్నాయి. గది తలుపుకి పైన వున్న నలుచదరపు రంధ్రం ద్వారా బయట కాగడా వెలుతురు కొద్దిగా గదిలోనికి ప్రసరించడం చూశాడు విశ్వనాథ్.

బలమంతా ఉపయోగించి తలుపును ముందుకు తోశాడు. తలుపు తేలిగ్గా అటూ ఇటూ ఊగుతోంది. కానీ, అది చాలా బలంగా తయారుచేయబడిందని కొద్ది సేపట్లోనే అర్థమైంది అతడికి.

కళ్ళుమూసుకొని రాతిగోడకు జారబడి కూర్చుండి పోయాడు చాలా సేపు. ఒత్తుగా పెరిగిన గడ్డాన్ని వేళ్ళతో తడుముకొన్నాడు. రెండురోజులుగా అతడేమీ తినివుండక పోవడంవలన ఆకలి దహించివేస్తుందతడిని. లేచి తలుపు దగ్గరికి వెళ్ళి, చీకట్లో తడుముకొని రాతి ఒంపులమీద కాళ్ళువేసి పైకెక్కి రంధ్రంలోనుండి చూశాడు.

గుహ లోపలి భాగం పెద్ద విశాలంగా లేదు. అటు వైపు వరసగా పాతిన కర్ర ఆర్చిలకు గుర్రాలను కట్టే వారు. సన్నటి మసక వెలుతురులో అవి తాపీగా గడ్డి తింటున్నాయి. గుహామధ్యలో పెద్ద మంట! దానిచుట్టూ గుంపులా కూర్చుని వున్నారు బందిపోట్లు.

మాంసాన్ని మంటలో కాల్చుకొని, యేదో పొడిలో నంజుకొని తినడం మాని విశ్వనాథ్ పెదాలు తడుపు

కొన్నాడు. గుహపై నాలుగువైపులా వ్రేలాడదీయబడిన ఇనుపగొలుసులకు వున్న రింగుల్లో గుచ్చబడిన కాగడాలు చిన్నగా వెలుగుతున్నాయి. ఓ మూలగా వున్న తెల్లటి రెండు పెద్ద పెద్ద ప్లాస్టిక్ పీపాలలోనుండి సారాయిని ముంచుకొంటున్నారు అప్పుడప్పుడు!

గోలగోలగా యేదో మాట్లాడుకొంటున్నారు వాళ్లు. ఎక్కువగా బూతులు దొర్లుతున్నాయి వాళ్ళ మాటల్లో. మధ్య మధ్యలో పెళ్ళుమన్న వికృతమైన నవ్వులుకూడా వినబడుతున్నాయి.

బందిపోట్ల నాయకుడి ముఖం మంట వెలుతురులో స్పష్టంగా చూశాడు విశ్వనాథ్. క్రూరత్వం అతడి ముఖం నిండా వుంది!!

విశ్వనాథ్ క్రిందికి దిగి గుప్పెళ్ళు బిగించి చేతులతో తలుపుపైన దబా బాదసాగాడు.

రెండు నిమిషాలు గడిచాక, పై రంధ్రంలోనుండి ఏదో లోపలికి విసిరి వేయబడడం చూసి, క్రిందికి వంగి చూశాడు. పొడుగాటి మాంసంముక్క అది. మంటలో కాల్చబడింది కొద్దిగా వేడిగా వుంది.

దానికి అంటిన దుమ్మును తుడిచి, గబగబా తినేశాడు. త్రాగడానికి యేదయినా వుంటే ప్రాణం నిలబడుతుందనుకొన్నాడు విశ్వనాథ్.

సరిగ్గా నిమిషం తర్వాత చెక్కతలుపు అడుగునున్న రెండంగుళాల రంధ్రంలోనుండి, చిన్న సత్తుప్లేటు లోపలికి వచ్చింది. అందులో యేదో ద్రవం ఉండడం గమనించి, రెండు చేతులతో ప్లేటుని జాగ్రత్తగా పైకెత్తి వాసన చూశాడు. తీపికలిపిన వగరు వాసన వస్తూన్న

సారాయి అది! అయినా విశ్వనాథ్ కు త్రాగక తప్ప లేదు. ఊపిరి బిగబట్టి చిన్న చిన్న గుక్కలుగా మింగుతూ పూర్తి చేశాడు దానిని.

కాస్త కడుపు నిండినట్టయింది. గోడకు జారబడి కూర్చున్నాడు. నిద్రపోవాలని కళ్ళుమూసుకున్నాడు. చెవిరంధ్రాలు వెచ్చబడ్డట్టు అనిపిస్తూందతడికి! ఒళ్ళంతా మత్తుగా వుంది. అదంతా సారాయి ప్రభావమని అర్థమైంది విశ్వనాథ్ కు. దాదాపు మూడురోజులుగా నిద్రలేక పోవడంవల్ల మళ్ళీ గాఢంగా నిద్రపట్టేసిందతడికి....

ఎవరో తనను తట్టి లేపడంతో మెలకువ వచ్చింది విశ్వనాథ్ కు. కళ్ళు ఒకసారి నులుముకొని పూర్తిగా తెరిచి చూశాడు....!?

అతడికి యెదురుగా పొడుగాటి ఆకారం నిలబడివుంది. గది తలుపు తెర్చి ఉంది! అది రాత్రి సమయం అని నిశ్శబ్దతనుబట్టి తెలుస్తూంది!

విశ్వనాథ్ ఆశ్చర్యపోతూ యెదురుగా వున్న వ్యక్తిని పరిశీలనగా చూడసాగాడు.

అంతలో ఆ వ్యక్తి "ఏయ్, త్వరగా లే తప్పించుకొందువుగాని ఇక్కడనుండి" అన్నాడు తగ్గుస్వరంతో.

ఆ మాటలకు అసంకల్పితంగా లేచి నిలబడ్డాడు విశ్వనాథ్. అతడి గుండె వడివడిగా కొట్టుకోసాగింది.

ఆ వ్యక్తి విశ్వనాథ్ జబ్బమీద చేయివేసి తొందర పెట్టాడు. "పదు తొందరగా. ఆలస్యం చేసినకొద్దీ ప్రమాదం!" ఆ వ్యక్తి బందిపోట్లలో ఒకడని గ్రహించాడు విశ్వనాథ్.

చురుగ్గా గదినుండి వెలుపలికి వచ్చేశాడు విశ్వనాథ్. గుహలో కాంతిలేదు పెద్దగా. గుర్రాలు కట్టినవైపు,

అతడిని బంధించిన గదివైపూ రెండు కాగడాలుమాత్రం కొవ్వొత్తుల్లా వెలుగుతూ మసక వెలుతురుని ఇస్తున్నాయి.

గుహ మధ్యలో మంట ఆరిపోయి వుంది. కొన్ని నిప్పుకణికలు మాత్రం ఎర్రగా మెరుస్తున్నట్టు కనబడుతున్నాయి. ఆరిపోయిన మంటచుట్టూ బందిపోట్లు చిందరవందరగా అస్తవ్యస్తంగా పడుకొని నిద్రపోతున్నారు. అందులో కొంతమంది పెట్టే గుర్రు ఆగి ఆగి చెవులు గింగిర్లెత్తేలా వినబడుతూంది!

ఆ వ్యక్తి తలుపు దగ్గరగావేసి "ఇటురా!" అని సైగచేసి విశ్వనాథ్‌ను కొద్ది లోపలికి తీసుకొని వెళ్లాడు. ఊపిరి వదలడానికి కూడా భయంగా వుంది విశ్వనాథ్‌కు! పడుకొన్న బందిపోట్లను చూస్తూ ఉంటే యే క్షణాన అయినా వాళ్ళకు మెలకువ రావచ్చనిపిస్తోంది!!

చీకటిలో నల్లటి ఆకారంలా మాత్రమే కనబడుతున్న పెద్ద భోషాణాన్ని సమీపించాడా వ్యక్తి. చేతిలో ఉన్న తాళంచెవితో నిశ్శబ్దంగా తెరిచాడు దాన్ని. లోపల ఓ మూలవిడిగా పొడుగ్గా, లావుగా ఉన్న సంచుల్ని చూపాడు.

"ఏమిటవి?!" అయోమయంగా చూస్తూ అడిగాడు విశ్వనాథ్.

ఎదుటి వ్యక్తి నల్లటి ముఖం చీకట్లో కలిసిపోయి, అతడి ఎర్రటి కళ్లు, మాట్లాడినప్పుడు మెరిసే తెల్లటి పళ్ళు మాత్రమే కనబడుతున్నాయి విశ్వనాథ్‌కు.

విసుక్కున్నాడా వ్యక్తి విశ్వనాథ్ ప్రశ్నకు. "ముందిక్కడనుండి క్షేమంగా బయటపడడానికి సహకరించు చాలో!" చెప్పాడు మెల్లగా.

తర్వాత ఇద్దరూ చెరోవైపు పట్టి రెండు మూటల్ని, గుహ వెలుపలికి చేరుకొనే మార్గం ఉన్నచోటకు

చేర్చారు. మూటలు బరువుగానే ఉన్నాయనిపించింది విశ్వనాథ్‌కు.

అప్పటికే ఆ వ్యక్తి రెండు గుర్రాల్ని చప్పుడు గాకుండా కళ్ళాలు పుచ్చుకొని తీసుకొని వచ్చాడు.

## 3

వాళ్ళు, గుహనుండి బయటపడేసరికి రాత్రి రెండు దాటింది—

ఇద్దరూ చెరో గుర్రంపై ప్రయాణం చేస్తున్నారు వీలయినంత వేగంగా. మూటలు రెండూ మాత్రం ఆ వ్యక్తి తన గుర్రానికే తగిలించుకొన్నాడు! బహుశా, అందులో డబ్బో నగలో ఉండి వుంటాయని ముందే అనుకొన్నాడు విశ్వనాథ్!!

అప్పటికి పూర్తిగా తెల్లవారిపోయింది. గుర్రాలమీద ప్రయాణిస్తూనే, ఆ వ్యక్తి, విశ్వనాథ్ ఒకరివంక ఒకరు స్పష్టంగా చూసుకున్నారు.

“ఐదున్నర దాటింది!” చెప్పాడా వ్యక్తి చేతికున్న వాచీలో టైం చూసి.

అతడు చెప్పింది వింటూనే చుట్టూ కనిపిస్తూన్న ప్రదేశాల్ని విభ్రాంతిగా చూస్తున్నాడు విశ్వనాథ్.

వాళ్ళు ప్రయాణిస్తున్న ప్రాంతానికి కనుచూపు మేరలో చెట్లుగానీ, పర్వతాలుగానీ యెక్కడా లేవు! అంతా పీఠభూమి! క్రింద నేల అంతా రాతి ప్రదేశం. దానిపైన చాలావరకూ కాస్త ఎర్రదనం కలిసిన ఇసుక పొర కప్పేసి ఉంది! ఆ నేల రాత్రి అంతా మంచులో తడిసిందనడానికి గుర్తుగా, గుర్రపు అడుగులు పడగానే ఇసుక చెదిరిపోకుండా కొద్దిగా జారుతుందందే!

“నా పేరు ఇలాహీ—నీ పేరు?!” అడిగాడు ఆ

వ్యక్తి, విశ్వనాథ్ పరిసరాలు చూస్తూండడం గమనించి.

విశ్వనాథ్, నల్లటి ఆ వ్యక్తి ముఖంలోనికి చూశాడు. గడ్డం లేకపోవడంవలన ముందు గుర్తించలేకపోయాడు. అయినా ముఖాన్ని జాగ్రత్తగా చూస్తే తెలుస్తుంది! ఆ వ్యక్తి ముస్లిం మతస్థుడే. తర్వాత చెప్పాడు తన పేరు.

"ఎక్కడికి వెళ్ళాలి నువ్వు?" అడిగాడు ఇలాహీ కాసేపాగి.

పైన రాళ్ళ వత్తిడి లేకపోవడంవలన గుర్రాలు పరుగు వేగం తగ్గించాయి. విశ్వనాథ్, ఒడిచేతి వేళ్ళు గడ్డం లోపల దూర్చి కదుపుతూ ఉండిపోయాడు.

ఇలాహీ వింతగా చూశాడు విశ్వనాథ్ వంక! మళ్ళీ ఇలాహీయే ఏదో అనబోయాడు. అప్పుడు చెప్పాడు విశ్వనాథ్ పెదవివిప్పి: "నాకంటూ గమ్యంలేదు— నేనొక టెర్రరిస్టుని!"

ఇలాహీ కనుబొమ్మలు దగ్గరయ్యాయి వెంటనే. అతడు అలాగే తలతిప్పి కాసేపు విశ్వనాథ్‌ను చూశాడు, నిశ్చలమైన చూపులతో. "టెర్రరిస్టువా!" అడిగాడు ఆశ్చర్యంగా.

విశ్వనాథ్ తల వూపాడు. ఇలాహీ గుర్రం మెడపై అటూ ఇటూ వ్రేలాడదీయబడిన పొడవాటి ముదురు ఆకుపచ్చ సంచుల్ని చూస్తూండిపోయాడు.

ఇలాహీ మిగతా వివరాలేమీ అడగలేదు, ఇక తనకు అనవసరమన్నట్లుగా! వాళ్ళ పయనం మరో పదినిమిషాలు సాగాక, దూరంగా కనిపిస్తూన్న, రెండు మూడు ఎత్తయిన భవనాల శిఖరాలను ఆసక్తిగా చూడసాగాడు విశ్వనాథ్!!

గుర్రాలు మెల్లగా పరిగెడుతూ ముందుకు సాగు

తున్నాయి.... దూరంగా ఉన్న సిటీలో ఎత్తయిన ప్రదేశాలన్నీ క్రమంగా బయటపడుతున్నట్టు కనబడసాగాయి విశ్వనాథ్ కు!!

"అక్కడేదో సిటీ ఉన్నట్టుందే!?" అడిగాడు విశ్వనాథ్ ఇలాహీ వైపు చూస్తూ.

ఇలాహీ నవ్వి చెప్పాడు. "మనం పయణిస్తున్నది, ఎడారికి దగ్గరగా ఉన్న వాలు పీఠభూమి ప్రాంతం. దాదాపు వెయ్యి కిలోమీటర్ల వెడల్పు. రెండువందల కిలోమీటర్ల పొడవుగల ఈ పీఠభూమి ప్రాంతంలో ఇదొక్కటే సిటీ! పేరు 'దైలోరానా'. ప్రస్తుతం మనం తలదాచుకోబోయేది ఆ సిటీలోనే!"

విశ్వనాథ్ ఆసక్తిగా చూశాడు!

"నేను చేసిన మోసం గ్రహించిన మా నాయకుడు దండుతో మనల్ని తరుముతూ వస్తూంటాడు ఇప్పుడు! మరో గంటన్నరలో దైలోరానాలోనికి మామూలు వ్యక్తుల్లా ప్రవేశించి మనకోసం వేట ప్రారంభిస్తారు!" చెప్పాడు ఇలాహీ. అతడి కళ్ళల్లో బెదురు కనిపిస్తూంది!

ఇలాహీ చెప్పింది విన్న తర్వాత అడిగాడు విశ్వనాథ్ "అసలు నన్నెందుకు బంధించినట్టు మీ నాయకుడు?!"

"మా నాయకుడికి ఒక అరబ్బు నాయకుడున్నాడు. వాడెక్కువగా దొంగసరుకు చవగ్గా కొంటూంటాడు— ఎవడో వాడికి పదిహేను లక్షలకు కొన్ని వజ్రాలు అమ్మాడట! ఆ వజ్రాలు నకిలీవి అని తేలడంతో ఆ అరబ్బు నిండా మునిగిపోయాడు! ఆ కోపంతో వాడిని చంపి, శవాన్ని తన కప్పగిస్తే నాలుగులక్షలిస్తానని మా నాయకుడితో ఒప్పందం కుదుర్చుకొన్నాడు....

మా నాయకుడు మమ్మల్ని వెంటపెట్టుకొని రెండు వారాలు తీవ్రంగా గాలించాడు. ఆ మోసగాడి కోసం! వాడు దొరకలేదు. అదే వొడ్డుపొడవూ వున్న నువ్వే మా నాయకుడికి కనపడ్డావు! దాంతో నిన్ను చంపి, ముఖం రూపురేఖలు మార్చి అరబ్బు కప్పగించి నాలుగు లక్షలు పొందాలని మా నాయకుడి ఎత్తుగడ!" చెప్పాడు ఇలాహీ.

"మై గాడ్ !?" అప్రయత్నంగా అన్నాడు విశ్వనాథ్. తను ఎంత ప్రమాదంలో నుండి బయటపడ్డాడో అర్థమవగానే భయంతో ఒళ్ళు జలదరించింది అతడికి....

విశ్వనాథ్ వైపు చూసి తేలిగ్గా నవ్వి చెప్పాడు ఇలాహీ "ఈ మాత్రం దానికే కంగారుపడుతున్నావు. నాయకుడు సిటీలో మనల్ని కనిపెడితే, ఎంత ప్రమాదమో ఆలోచించు?"

అప్పుడు అవగాహన అయింది విశ్వనాథ్‌కు, ఇలాహీ తనను ఎందుకు వెంటతీసుకొని వచ్చాడో!? నాయకుడు ఇలాహీపై పగబట్టి వెంటాడితే అతనితో తోడు వుండడం మేలు చేస్తుంది!!

## 4

ఇప్పుడు డైలోరానా సిటీ శివార్లకు వచ్చేశారు, వాళ్ళిద్దరూ. గుర్రాలు నగరంలోనికి ప్రవేశించాయి.

అప్పుడే వేడెక్కుతున్న పల్చటి ఎండ వాళ్ళపై పడుతూంది. కొద్దిదూరంలో ఎత్తుగా కనబడుతున్న అద్దాల భవంతులపై ఎండ పడి అక్కడక్కడ కొన్ని అద్దాలు తెల్లగా వెలుగుతున్నట్టు మెరుస్తున్నాయి.

ఒకరిద్దరు మాసిపోయిన దుస్తుల్లో గుర్రాలపై వెళుతున్న ఇలాహీ, విశ్వనాథ్‌ల వంక విచిత్రంగా చూశారు!

"ఈ సిటీ వాళ్ళకు బాగా తెలుసు. నువ్వేం కంగారుపడకు" చెప్పాడు ఇలాహీ.

పదిహేను నిమిషాల్లో ఒక చోటుకు చేరుకున్నా రిద్దరూ.... అది నగరానికి దక్షిణంవైపు వుంది. అయితే నగరంలో వున్న ఖరీదయిన వాతావరణం లేదక్కడ! చాలావరకు ఖాళీగా, నిర్లక్ష్యంగా వదిలివేయబడి వున్న స్థలాల మధ్య 'ఎల్' షేపులో పూర్తిగా ఉడ్‌తో కట్టబడిన పాత షెడ్ అది! షెడ్ అటు చివరభాగం కొంత వరకూ శిథిలావస్థల్లో వుంది.

ఇలాహీ తన అశ్వాన్ని షెడ్ లోపలికి నడిపించాడు. విశ్వనాథ్ అనుసరించాడు అతడిని. లోపల బాగా ఎత్తుగా ఉంది. ఇద్దరూ గుర్రాలు దిగారు.

"దాదా....దాదా!!" బిగ్గరగా పిలిచాడు ఇలాహీ చుట్టూ చూస్తూ. గుర్రాలు కొద్దిపాటి ఆయాసంతో ఒగరుస్తున్నాయి.

"ఎవరది?" వాళ్ళ కెదురుగా కనిపిస్తున్న రెండు ఇనుపబద్దెలకు అడ్డుగా కట్టబడిన, పొట్టి ఇటుక గోడ వెనుకనుండి గట్టిగా వినిపించిందో స్వరం!

"దాదా ఉన్నాడా?" అడిగాడు ఇలాహీ, స్వరం వినిపించినవైపు తిరిగి.

"ఎవరంటే!" గోడ వెనుక నుండి ఒక వ్యక్తి బయటకు వచ్చాడు. పొట్టిగా, దృఢంగా తెల్లగా ఉన్నాడతడు. బట్టలనిండా ఆయిల్ మరకలు, మసి అంటుకొని ఉన్నాయి. అతడి చేతిలో ఇనుపరెంచ్ లున్నాయి.

"దాదా లేడా?"

"ఉన్నాడు. లోపలున్నాడు!" అన్నాడా వ్యక్తి, తన చిన్ని కళ్ళతో యిద్దరివంకా తెల్లబోయినట్టు

చూస్తూ.

“ఇలాహీ వచ్చాడని చెప్పి పిలువ్....” చెప్పాడు ఇలాహీ.

ఆ వ్యక్తి చేతిలో వస్తువులు గోడ దగ్గర పడేసి లోపలికి వెళ్ళాడు. విశ్వనాథ్‌కు ఒంట్లో చెప్పలేనంత అసక్తతగా వుంది. హాయిగా రెస్టు తీసుకోందామనుంది అతడికి. ఇలాహీ గుర్రాల్ని ఓ మూలగా నడిపించుకొని వెళ్ళి అక్కడ కట్టేశాడు. మూటల్ని తన గుర్రంమీద అలాగే ఉంచేశాడు!

ఇంతలో ఒక ముసలివాడిని వెంటబెట్టుకొని వచ్చాడు, ఇందాకటి వ్యక్తి. తెల్లటి జుబ్బా పంచెకట్టులో కొద్దిగా వంగినట్టున్నాడా ముసలివ్యక్తి! ఇలాహీ అడిగిన దాదా అతడే అని తెలుసుకొన్నాడు విశ్వనాథ్. సమంగా కత్తిరించబడిన దాదా తెల్లటి గడ్డం, పెదాలకు ఇంచుమించు చివర్ల నుండి గడ్డంలో కలిసిన అతడి మీసాలు చూడగానే ముస్లిం అని ఎవరైనా గ్రహిస్తారు.

ఇలాహీని చూసీ చూడగానే దాదా ముఖం వెలిగింది, “అరె! ఇలాయీ బేటా! నువ్వా? రారా చానాళ్ళకు వచ్చావు ఈ దాదా చోటుకు!” అంటూ నవ్వుతూ ఆహ్వానిస్తూ, ఇలాహీ చేతుల్ని పట్టుకొన్నాడు.

ఇలాహీ మెత్తగా నవ్వాడు.

“ఈ బేటా ఎవరు?” అడిగాడు దాదా.

ఇలాహీ చెప్పాడు “నా దోస్తు. నాతోపాటే ఉంటాడు. పాపం చాలా అలసటగా ఉన్నాడు....”

“అలాగయితే, పైన గదిలో పండుకోమను. సాయీలు టిఫిన్ తీసుకొని వస్తాడు!” అని తెల్లవ్యక్తి వైపు చూశాడు. అతడు బయటికి నడిచాడు, టిఫిన్ తేవ

దానికి.

“ఆ మూటలు ఏమిటి?!” కొద్దిపాటి ఆశ్చర్యంతో అడిగాడు దాదా, దూరంగా కట్టివున్న ఇలాహీ గుర్రాన్ని చూస్తూ.

“చెబుతాను!” అని విశ్వనాథ్ వైపు చూసి, “నీకు గది చూపిస్తాను పద!” అంటూ ముందుకు నడిచాడు ఇలాహీ.

విశ్వనాథ్ అతడిని అనుసరించాడు. సంచుల్లో యేముందో తనకు తెలీకుండా ఉంచేందుకు ఇలాహీ వీలయినంత వరకూ జాగ్రత్తపడుతున్నాడని అర్థమయింది విశ్వనాథ్ కు?!

పడిపోయిన చిన్న ఇటుకగోడకు ఓ మూలగా పైకి ఉన్న చెక్క మెట్లను చూపాడు ఇలాహీ. విశ్వనాథ్ మెట్లెక్కి నెమ్మదిగా వెళ్ళాడు పైకి!

పైన గది కొద్ది సౌకర్యంగానే ఉంది. అవలి గోడకు రెండు కిటికీలు ఉన్నాయి. తెల్లటి పరుపు వేసిన మంచం ఉంది.

కిటికీ తలుపులు తెర్చాడు. చల్లటి గాలి లోపలికి వస్తూంది అతడిని తాకుతూ. రిలీఫ్ గా మంచంపై వాలి పోయాడు.

## 5

క్రింది లోపలిగదిలో దాదా, ఇలాహీ చాపపై కూర్చుని వున్నారు. వాళ్ళకు యెదురుగా ఇలాహీ తీసుకొచ్చిన మూటలు రెండూ విప్పివున్నాయి. అందులో నోట్లకట్టలు తొంగిచూస్తున్నాయి. కొన్ని కట్టలు కుప్పలా క్రిందపోసి వున్నాయి.

ఇలాహీ, దాదా నోట్లకట్టలు గబగబా లెక్కపెడుతూ

ఒక ప్రక్కన పేరుస్తున్నారు.

"అయితే అయ్యింది కానీ ఇలాహీ బేటా, భలే పని చేశావురే! ఒక దెబ్బతో లక్షలకు లక్షలు జాక్ పాట్ కొట్టేశావు!!" నోట్లు లెక్కపెడుతూనే అన్నాడు దాదా, తన గారపట్టిన పళ్ళు బయటికి కనబడేలా నవ్వుతూ. నోట్లకట్టలను చూసి దాదా ఎంత ఆనందం పొందుతున్నాడో అతడి కళ్ళే చెబుతున్నాయి.

ఇలాహీ నవ్వడంలేదు. అతడి ముఖంలో సంతోషంగా ఉన్న చిహ్నాలు కూడా లేవు!? మౌనంగా లెక్కపెడుతున్నాడంతే!

ఇలాహీవంక కాస్త పరిశీలనగా చూసి చెప్పాడు దాదా "నీకేం బెంగ అక్కర్లేదు బేటా, ఆ ఖుందాకోర్ నిన్నేం చేయకుండా కాపాడే బాధ్యత నాది!"

కాసేపు లెక్కపెట్టాక. కొన్ని కట్టలు ఒకవైపు వలు పలకలుగా పేర్చారు యిద్దరూ. "ఈ ఐదులక్షలు నీ పేర్న బాంకులో దాయి!" చెప్పాడు ఇలాహీ, పేర్చి ఉన్న కట్టల్ని చూపించి.

"మరి మిగతాదంతా యేం చేద్దాం? అది కూడా బాంకులోనే వేసెయ్యొచ్చుగా?" కంగారుగా అడిగాడు దాదా.

"అంతా ఒకే బాంకులో వేస్తే వాళ్ళకు అనుమానం వస్తుంది దాంతో వాళ్ళు పోలీసులకు తెలియబరుస్తారు! అప్పుడు నువ్వూ నేనూ కటకటాలు లెక్కపెట్టాలి" చెప్పాడు ఇలాహీ.

"శావ్ రే! అయితే నువ్వు చెప్పినట్టే చేద్దాం" అన్నాడు దాదా.

మొత్తం సొమ్మంతా లెక్కపెట్టారిద్దరూ. పాతిక

లక్షలుంది!! రెండు లక్షలు, మూడులక్షలు. విగులక్షల చొప్పున డబ్బంతా విడివిడిగా కట్టలు కట్టేసి. యథావిధిగా సంచుల్లో కూరేసి, మూతులకు వలల్లా కట్టబడిన తాళ్ళను దగ్గరకు లాగి గట్టిగా ముడివేసేశారు.

సరిగ్గా అప్పుడే మూసివున్న గది తలుపులు తట్టిన చప్పుడయింది!? ఇలాహీ మూటల్ని పక్కకు పెట్టాడు. దాదా వెళ్ళి తలుపు గెడ తీశాడు.

సాయిబు లోపలికి వచ్చాడు! అతడి చేతిలో ఉన్న సంచీలో చపాతీ పొట్లాలున్నాయి.

"పైన అతడికి ఇచ్చావా?" దాదా అడిగాడు.

"ఇప్పుడే తేస్తే ఇచ్చివస్తున్నాను...."

సాయిబు చూపులు వెనగ్గా ఉన్న సంచులమీద పడడం గమనించి, ఇలాహీ. దాదావైపు చూశాడు!!

దాదా సాయిబు చేతిలో సంచి అందుకొని "నువ్వు హోటల్‌లో నే చేసెయ్యి భోజనం. డబ్బులున్నాయా? ఇవ్వనా?" అడిగాడు దాదా.

"అవసరంలేదు దాదా. డబ్బులున్నాయి" అని వెనుదిరిగాడు సాయిబు సంచిలో నుండి పొట్లాల్ని బయటికి తీసి విప్పాడు ఇలాహీ. చపాతీముక్క త్రుంచి కూరలో ముంచుకొని అడిగాడు, "ఎవరితను? క్రితంసారి వచ్చినప్పుడు లేడే!""

ఒక పొట్లాన్ని మెల్లగా విప్పుతూ చెప్పాడు దాదా. "దూరపు బంధువుల కుర్రాడు. పనిపాటా లేకుండా తిరుగుతున్నాడు. ఇక్కడ గేరేజ్‌లో ఉండనిమ్మని నా దగ్గరకు పంపారు. వచ్చి మూడు నెలలవుతుంది. క్లీనరీ పేను చేస్తున్నాడు. మంచివాడే. మనకేం యిబ్బంది లేదు!"

ఇద్దరూ మాట్లాడుకొంటూ తినడం పూర్తిచేశారు. డబ్బు సంచుల్ని దాదా సమాజా చేసుకొని గదిలో భద్రపరిచారు. తర్వాత బట్టలు మార్చుకొని, విదులత్తులు తీసుకొని దాదా షాంపుకి బయల్దేరాడు. మిగతా డబ్బు గేరేజ్ లో వదలి, తను దాదాకు తోడు వెళ్ళడం మంచిది కాదనిపించి ఇలాహీ ఉండిపోయాడు!!

తర్వాత అతడు దాదా దుస్తుల అరలో నుండి రెండు జతలు బయటికి తీశాడు. ఒక జత తీసుకొని వెళ్ళి పై రూమ్‌లో ఉన్న విశ్వనాథ్‌ని పిలిచి చెప్పాడు. "నీ బట్టలు విప్పేసి ఇవి తొడుక్కో. విప్పేసిన బట్టలు నాకిచ్చేయి. కాల్చేస్తాను!".

విశ్వనాథ్ కి అర్థమయింది. మాట్లాడకుండా ఇలాహీ యిచ్చిన దుస్తులు వేసుకొనిన, పాత బట్టలను ఇలాహీకి అందించాడు వెంటనే. ఇలాహీ తన బట్టలు కూడా మార్చుకొని, షెడ్ అవతలివైపుకు వెళ్ళి, పాతబట్టలపై కిరోసిన్ పోసి తగలబెట్టేశాడు!!

పైన గదిలో విశ్వనాథ్, బట్టలు మార్చుకొన్న తర్వాత చాలాసేపు మంచంపై కూర్చున్నాడు. భోజనం చేశాక, అతడికి శరీరంలో బలహీనత తగ్గిపోయి కొత్త శక్తి వచ్చినట్లుంది! పైకి లేచి చివరి కిటికీవద్ద నిలబడి క్రిందకు చూడసాగాడు.

ఏదో సన్నటి రోడ్డుకు అవతల యేదో ఓపెన్ రెస్టారెంట్ ఉన్నట్టుంది. ఖరీదైన రెస్టారెంటే! క్రింద ఎక్కడా ఎండ పడకుండా రెస్టారెంట్ వున్న భాగం పైన అంతా, నాలుగు పల్చటి రంగుల్లో ఉన్న రెక్సిన్ క్లాత్‌తో కప్పబడి వుంది. ఆ క్లాత్ పై రక రకాల సన్నటి తీగలు గల పాకుడు మొక్కలు దట్టంగా ఏర్ప

రచబడి ఉన్నాయి. రెస్టారెంట్ లో జనం ఎక్కువగానే ఉన్నారు....

హడావిడిగా తిరిగే బేరర్లు, కుర్చీల్లో కూర్చొని మాట్లాడుకొంటున్న కస్టమర్లు కనబడుతున్నారు! హఠాత్తుగా విశ్వనాథ్ దృష్టి, ఒక టేబుల్ వద్ద కూర్చుని, ఎదురుగా వున్న మరొకతనితో మెల్లగా మాట్లాడుతున్న వ్యక్తిపై పడింది!!?

విశ్వనాథ్ కనుబొమ్మలు దగ్గరగా సాగాయి.... క్రమంగా గుర్తొచ్చి అదిరిపడ్డాడతడు!!!"

ఆ వ్యక్తి బందిపోటుదొంగల నాయకుడు!

## 6

కాసేపు అలాగే కొయ్యబారిపోయి చూస్తూండిపోయాడు విశ్వనాథ్! నాయకుడు యెదురుగా కూర్చుని ఉండటంవల్ల, అతడి వెడల్పాటి ముఖం కోరమీసాలు స్పష్టంగా కనిపిస్తున్నాయి... .

వేగంగా వెళ్ళి ఇలాహీని పిల్చుకొని వచ్చాడు తన గదిలోనికి! కిటికీలో నుండి దూరంగా చూపించాడు. నాయకుడిని చూసి నిలువెల్లా ఒణికిపోయాడు ఇలాహీ. విపరీతమైన భయంతో అతడి కళ్ళచుట్టూ చర్మం వెనక్కి సాగింది!!

నిస్సత్తువగా కుర్చీలో కూలబడ్డాడు ఇలాహీ. అతడి వంక విశ్వనాథ్ జాలిగా చూశాడు.

ఇలాహీ గొణుక్కుంటున్నాడు. "ఇంత సిటీలో కూడా నాయకుడు మన ఆచూకి తెలుసుకోగలగడం మన దురదృష్టం కాక మరేమిటి!?"

"బహుశా, దాదా నీకు తెలుసునన్న సంగతి మీ నాయకుడికి ముందే తెలిసివుంటుంది...." అన్నాడు విశ్వ

నాథ్ సాలోచనగా.

"లేదు! అలా జరగదు! ఈ చోటు మా మాలో యెవ్వరికీ తెలీదు. దాదా గురించి అసలే తెలీదు!!" గట్టిగా కంపిస్తూన్న స్వరంతో చెప్పాడు ఇలాహీ.

విశ్వనాథ్ మౌనంగా చూస్తూ ఉండిపోయాడు. మరో గంటన్నర తర్వాత నాయకుడు అతనిలో ఉన్నవాడు లేచి వెళ్ళిపోయాడు!?

ఇలాహీ, విశ్వనాథ్ దాదాపు ఏడుగంటలు షెడ్ లోనే ఉండిపోయారు బయటికి రాకుండా. సాయిబాబుని కూడా బయటికి వెళ్ళనీలేదు. కానీ అంతవరకూ బాంబుకు వెళ్ళిన దాదా తిరిగిరాకపోవడంతో యేదో కీడుని శంకించసాగింది ఇలాహీ మనసు.

సాయంత్రం ఆరున్నర దాటింది అలాగే—

మూసి వున్న షెడ్ తలుపులపై, టకటకమన్న శబ్దం యెవరో కర్రతో కొట్టినట్టు వినిపించింది....

ఇద్దరూ ఉలిక్కిపడ్డారు!!

ఇలాహీ ముఖం వివర్ణమైంది. విశ్వనాథ్ ఊపిరిబిగ బట్టాడు. శబ్దం ఎక్కువకా సాగింది....

ఇలాహీ ఇక తెగించినట్టు ముందుకి కదిలాడు. గడతీసి తలుపులు తెరిచాడు!?

యూనిఫాంలో ఉన్న రాజస్థాన్ ప్రత్యేక పోలీసు దళం ఇన్‌స్పెక్టర్ నిలబడి ఉన్నాడు బయట పొడుగ్గా! వెనక ఇద్దరు కాన్‌స్టేబుల్స్ ఉన్నారు భుజాలకు రైఫిళ్ళతో!

విశ్వనాథ్ స్తంభించిపోయాడు పోలీసుల్ని చూసి! ఇలాహీ అడిగాడు "ఎవరు కావాలి?"

"దాదా అని పిలువబడే మొహియుద్దీన్ ఖాన్ ఇల్లు

ఇదేనా?"

రెండుక్షణాలాగి చెప్పాడు ఇలాహీ "ఇదే!?"

"ఇద్దరు వ్యక్తులు అతడిని ఓ గల్లీలో, కత్తులతో పొడిచి పారిపోతూండగా, అక్కడున్న జనం సహాయంతో మా కానిస్టేబుల్స్ పట్టుకొన్నారు వాళ్ళను! ఐదులక్షలు ఉంది వాళ్ళవద్ద! బహుశా దానికోసమే వాళ్ళందుకు తెగించి ఉండవచ్చు. మొహిద్దీన్ వద్ద అతని బాంక్ పాస్ బుక్ ఉంది!"

వింటున్న ఇద్దరూ స్థాణువులయిపోయారు!

"హత్యా?!" గొంతు పెగల్చుకుని అన్నాడు ఇలాహీ. అతనికి తమ నాయకుడు గుర్తొచ్చాడు!!

"అవును! ప్రస్తుతం హాస్పిటల్ లో జాయిన్ చేశామతడిని. పరిస్థితి అటూ ఇటూగా వుంది—అతని తరఫు వాళ్ళొస్తే, మిగతా తతంగం పూర్తి చేస్తాం!"

"హాస్పిటల్ ఎడ్రస్ చెప్పండి పావు గంటలో వస్తాం!" అడిగాడు ఇలాహీ మామూలుగా.

ఇలాహీ వంక ఒకసారి చూసి, కానిస్టేబుల్ చేత ఎడ్రస్ రాయించాడు ఇన్స్పెక్టర్. "మీరిద్దరేనా అతడి తరఫువారు?" అడిగాడు.

ఎడ్రస్ కాగితం అందుకొంటూ చెప్పాడు ఇలాహీ "అవును. మేమిద్దరమే అతడి తరఫువాళ్ళం!"

"సరే, త్వరగా రండి" అని వెళ్ళబోయిన ఇన్స్పెక్టర్ ఆగిపోయాడు. అతడి చూపులు విశ్వనాథ్ పై ఉండిపోయాయి.

విశ్వనాథ్ తడబాటు ముఖంలో ప్రతిఫలించకుండా జాగ్రత్తపడ్డాడు. విశ్వనాథ్ వద్దకు నడిచాడు ఇన్స్పెక్టర్! మామూలుగా చూశాడు విశ్వనాథ్.

"మిస్టర్ నీ పేరు?" ఇన్‌స్పెక్టర్ గొంతులో కరుకుదనాన్ని గమనించాడు విశ్వనాథ్.

"వసంతలాల్."

"ఏం చేస్తుంటావ్? మొహిద్దీన్ యెలా పరిచయం నీకు?!"

విశ్వనాథ్ చెప్పాడు. "కార్లు బాగు చేస్తుంటాను. దాదాకి బంధువుని!"

ఇన్‌స్పెక్టర్ ఇక వెనుదిరుగుతూ చెప్పాడు "ఓ.కే. వీలయినంత త్వరగా రావడానికి ప్రయత్నించండి హాస్పిటల్‌కు!"

పోలీసులు నిష్క్రమించాక, తలుపులు దగ్గరగా వేసి గడియ పెట్టేశాడు ఇలాహీ. ఇప్పుడు అతడి కళ్ళల్లో భయం స్పష్టంగా కనిపిస్తూంది.

విశ్వనాథ్ వైపు ఆశ్చర్యంగా చూస్తూ అడిగాడు "వాడు; నిన్ను అనుమానిస్తున్నాడు దేనికి!?"

"నేను టెర్రరిస్టునని చెప్పాను కదా! రెండు మూడు సార్లు పోలీసుల తూటాలకు బలి అవబోయి తప్పించుకొన్నాను. నా ఫోటో కూడా ఈ యేరియాలో వున్న అన్ని స్టేషన్‌లలో ఉండేవుంటుందని నా అనుమానం! నేను యిక్కడ ఉండటం యెంతయినా ప్రమాదం! వాడికి మళ్ళీ అనుమానం బలపడితే పటాలాన్నేసుకొని వస్తాడు!" చెప్పాడు విశ్వనాథ్.

"ఇక్కడ యిక వుండడం క్షేమం కాదని నాకూ అనిపిస్తూంది!" అన్నాడు ఇలాహీ, ముఖంపై చెమటలు తుడుచుకొంటూ.

"ముందు ఈ సాయిబు యెక్కడ ఉన్నాడో

చూడు!" అన్నాడు విశ్వనాథ్. ఇద్దరు దాదా గదిలోకి వెళ్ళి చూశారు. అదృష్టవశాత్తూ సాయిబు గదిలో మంచంపై నిద్రపోతూన్నాడు. తర్వాత ఇద్దరూ మేడ మీద గదిలోకి వెళ్ళి కిటికీలో నుండి చూశారు!

అప్పటికే చీకట్లు ముసురుకోవడంతో నగరంలో దాదాపు అన్నిచోట్లా లైట్లు వెలిగివున్నాయి. క్రింద రెస్టారెంట్ అనేక పల్చటిరంగుల మసకదీపాల వెలుతురులో ఆహ్లాదంగా వుంది. జనం సందడిగానే వున్నారు. ఇంతక్రితం నాయకుడు కూర్చున్న చోట యువకో కూర్చొని నవ్వుకొంటూ మాట్లాడుకొంటున్నారు.

ఊపిరి వదిలి చెప్పాడు ఇలాహీ "గుర్రాలు సిద్ధంగా ఉన్నాయి! ఈ చీకట్లో సులభంగా బయటపడవచ్చు. కాసేపు ఉంటే పోలీసులు ఖచ్చితంగా వస్తారు యిక్కడికి!"

విశ్వనాథ్ వెంటనే తన అంగీకారాన్ని తెలిపాడు. ఇద్దరూ చురుగ్గా కదిలారు....

## 7

ఉత్తరదిశగా లైలోరానా సిటీని దాటారు ఇద్దరూ.

ఇలాహీ కాళ్ళు దృఢంగా సాచి మడమలతో గుర్రం డొక్కలపై తన్నాడు. పరుగు అందుకొంది గుర్రం. విశ్వనాథ్ గుర్రం కూడా దాన్ని వెంబడించింది.

విశ్వనాథ్ వేగంగా పోతున్న గుర్రంపై తల వెనక్కి తిప్పి చూశాడు. నిండా తెల్లటి లైట్లతో మెరుస్తూన్న లైలోరానా సిటీ వెనక్కి వెళ్ళిపోతూన్నట్టనిపిస్తూంది!

చీకటిలో ముందుదారి మసక మసగ్గా కనబడుతూంది. కానీ గుర్రాలు తడుముకోకుండా పరిగెడు

తున్నాయి.

ఇలాహీ గుర్రం, మెడపై నోట్లకట్టలుంచున్న సంచులు భద్రంగా వేలాడుతున్నాయి!!

చలిగాలి ముఖానికి రివ్వున కొడుతూ చెవుల్లోనికి మారి గింగిర్లు పెడుతూంది. నేలపై అస్పష్టంగా తెల్లటి రంగులో కనిపిస్తూన్న యిసుకను చూసి ఉలిక్కిపడ్డాడు విశ్వనాథ్.

"ఇలాహీ! ఇసుక కనిపిస్తూంది చూశావా?!" అన్నాడు కంగారుగా.

"పోలీసుల బారినుండి, ముఖ్యంగా మా నాయకుడి హస్తం నుండి తప్పించుకోవాలంటే యింతకంటే గత్యంతరం లేదు మరి!" అన్నాడు ఇలాహీ తల తిప్పి. చీకట్లో అతడి కళ్ళు కొద్దిపాటి తెల్లదనంతో మెరుస్తూన్నట్టు కనపడుతున్నాయి.

"అలాగని, చూస్తూ చూస్తూ ఎడారిలోనికి పోయి పక్కాచావు చస్తామా?"

"ఆ భయం లేదు! పూర్తిగా ఎడారిలోనికి వెళ్ళడం లేదు మనం" అని, తాపీగా చెప్పాడు ఇలాహీ "నూట ఇరవై కిలోమీటర్ల వరకూ పోయాక కుడివయిపు కొన్ని గ్రామాలున్నట్టు గుర్తు నాకు!"

మళ్ళీ చెప్పాడు ఇలాహీ "మా నాయకుడివల్ల ప్రమాదం కూడా తప్పిపోయినట్లే! ఈ ఎడారిదిశగా వెళ్ళుంటామని, కలలో కూడా ఊహించలేదు మా నాయకుడు...."

విశ్వనాథ్ అడిగాడు "దాదా బ్రతుకుతాడంటావా?"

దాదా ప్రసక్తిరాగానే కొద్దిసేపు మౌనం వహించి

మెల్లగా చెప్పాడు ఇలాహి "మరణ వాఙ్మూలం ఇవ్వక ముందే చనిపోతే మనకు పోలీసుల గొడవ ఉండదు! కోలుకొని, పోలీసుల ప్రశ్నలకు బెదిరిపోయి మన సంగతి బయటపెట్టడం జరిగితే, ఇక మన గురించి పోలీసుల వేట ప్రారంభమవుతుంది—ఏది ఏమయినా అనవసరంగా దాదా వల్ల ఐదులక్షలు ఊరికినే పోగొట్టుకొన్నాను."

"మొత్తం క్యాష్ ఎంత?"

తలతిప్పి, విశ్వనాథ్ వంక చూసి "పాతిక లక్షలు! దాదాని డబ్బుతో బాంకుకి పంపడమే నేను చేసిన పొర పాటు. నాయకుడు మనుష్యుల్ని పంపించి దాదాని చంపి సొమ్ము కాజేయాలని చూశాడు! దాదా పరిస్థితి యెలా వున్నా సొమ్ము మాత్రం ప్రభుత్వానికి దక్కుండది చివరకు!" అన్నాడు. విశ్వనాథ్ మౌనంగా ఉండి పోయాడు.

వాళ్ళ ప్రయాణం ముందుకు సాగుతోంది—

వెన్నెల పెరిగేకొద్దీ విశ్వనాథ్ కలవరం రెట్టింపవు తుంది! వెన్నెల కాంతి పూర్తి స్పష్టంగా కనిపించేది ఒక్క ఎడారిలోనే!!

నేల పై మెరుస్తూన్న ఇసుకను చూస్తూ విశ్వనాథ్ కంగారుపడడం, గమనిస్తూ చెప్పాడు, ఇలాహీ "విశ్వ నాథ్! భయపడవలసింది యేం లేదు. నాకు, మనుషు లుండే ప్రాంతానికి దారి నమ్మకంగా తెలుసు!"

కాసేపు గడిచింది. చలిగాలి విసురు యెక్కువగా వుంది. సన్నగా వణుకు పుడుతోంది చలికి! సమీపంలో వెన్నెల కాంతికి మసగ్గా కొద్దిపాటి తెల్లదనంతో మెరుస్తూ కనిపించే యిసుక తప్ప, చుట్టూ దూరంగా గాఢాంధకారం!

మిణుకు మిణుకు మంటూన్న వెలుతురును దూరంగా చూశాడు విశ్వనాథ్! "ఇలాహీ, అటు చూడు!?" చెప్పాడు.

ఇలాహీ చూసి తల పంకించాడు. మరికాస్త దగ్గరయ్యారు! వెలుతురు మంటలా మారింది.

"ఏమిటది? ఎవరున్నారక్కడ!?" విశ్వనాథ్ కళ్ళు పెద్దవిచేసి అడిగాడు. ఇలాహీకి కూడా ఆశ్చర్యంగానే ఉంది, అంత చీకటిలో, చలిలో నిర్మానుష్యమైన ఎడారి ప్రదేశంలో మంట వెలుగుతూండడం!!

ఈసారి మంట ప్రజ్వరిల్లుతూన్నట్టు కనబడుతూంది, వాళ్ళకు దగ్గరగా! దానిచుట్టూ కొన్ని ఆకారాలు!?!

ఇద్దరూ గుర్రాలు దిగి వాటిని నడిపించుకొంటూ ఓ పది అడుగులు నడిచారు.

ఒక ఆకారం చటుక్కున చెట్ల చాటునుండి కనిపిస్తూన్న ఇలాహీని చూసి "ఖుజరో!?!" అంది గట్టిగా.

## 8

తెల్లవారింది—

కళ్ళు తెరిచాడు విశ్వనాథ్. కళ్ళు విరుచుకొని లేచాడు పైకి. ఇరుగ్గా వున్న ఆ గుడిసెను చుట్టూ పరికించాడు. రెండు మూడుచోట్ల యేవో జంతువుల తలలు ఎండబెట్టి, అలంకారంగా తగిలించబడి వున్నాయి. రాత్రిళ్ళు వాటిని అకస్మాత్తుగా చూస్తే జడసుకునే ప్రమాదం ఉంది.

గుడిసెకున్న చిన్న వెదురుబొంగుల కిటికీలో నుండి వెలుపల అటూ యిటూ తిరిగే జనం కనబడుతున్నారు. పక్కకి చూశాడు. ఇలాహీ మరో మంచం పై నిద్రపోతున్నాడు యింకా. విశ్వనాథ్ మంచంపై నుండి లేచి

నిల్చున్నాడు.

శబ్దం అయితే తల తిప్పాడు. మూలనున్న ఓ కిటికీ లోనుండి కొందరు పిల్లలు యిరుక్కొని చూస్తున్నారు లోపలున్నవాళ్ళను. మాసిపోయి చిరిగిన బట్టలు కట్టుకొని వున్నారు పిల్లలు.

“ఇష్....” అన్నాడు చిన్నగా. మాయమయిపోయి నట్టు పారిపోయారు పిల్లలంతా. కాసేపాగి మంచంపైకి వంగి ఇలాహీని తట్టిలేపాడు.

చటుక్కున కళ్ళు తెర్చి కంగారుగా లేచి కూర్చున్నాడు ఇలాహీ. అతడి చూపులు తలక్రింద వెదికాయి వెంటనే! రెండు సంచులు అతడి మంచంపై తల దగ్గర వుండడం చూశాడు విశ్వనాథ్.

ఇంతలో గుడిసె తలుపు తెర్చుకొంది! పొడుగాటి వ్యక్తి లోపలికి వచ్చి బల్లపై కూర్చున్నాడు. అతడివద్ద ఆయుధాలేమీ లేవు. ఒంటినిండా బట్టలు, మెడకు చేతులకు రెండు మూడు పూసల దండలు ఉన్నాయి, అంతే!

“ఎవరు మీరు? ఎక్కడినుంచి వస్తున్నారు?” కొద్దిగా అదో తరహా యాస కలిసివున్న హిందీలో ప్రశ్నించాడతడు.

విశ్వనాథ్ ఆశ్చర్యపోతూ అడిగాడు, “మీకు, హిందీ వచ్చా!?” ఇలాహీ కూడా తెల్లబోయి చూస్తున్నాడు.

అతడు సమాధానం చెప్పాడు. “వచ్చు. ఇక్కడ నాకు మరికొంతమందికి వచ్చు యిందీ! మీ వివరాలు చెప్పండి!”

ఒకసారి ఇలాహీవంక చూసి విశ్వనాథ్ “ఇటు ఒక

గ్రామంలో మా స్నేహితుడిని కలుసుకోవడానికి వెళు తున్నాము. అంతకంటే మా గురించి చెప్పడానికి యేం లేదు. దారిలో మీ వాళ్ళు మమ్మల్ని చూసి, శత్రువు అనుకొని భ్రమపడ్డారు ముందు! తర్వాత బాటసారుల మని తెలుసుకొని యిక్కడకు తీసుకొని వచ్చారు” అన్నాడు.

ఇలాహీ కొద్దిగా నవ్వాడు, ఆ వ్యక్తివంక స్నేహ పూర్వకంగా చూసి. ఆ వ్యక్తి అడిగాడు. “మీరు వెళ్ళ వలసిన గ్రామం పేరేమిటి?”

“పేరు గుర్తులేదు. ఈ గ్రామం దాటిన తర్వాతే వస్తుందనుకొంటా!” చెప్పాడు విశ్వనాథ్. ఆ వ్యక్తి నమ్మాడది.

ఇంతలో ఇలాహీ ప్రశ్నించాడా వ్యక్తిని. “ఇది మామూలు గ్రామమా! ఆటవిక గూడేమా?”

అంతవరకూ కాస్త గంభీరంగా ఉన్న ఆ వ్యక్తి చిన్నగా నవ్వి, వాళ్ళకి ధైర్యం చెప్పే పద్ధతిలో చెప్పాడు “ఒకప్పుడు యిది ఆటవిక గూడెమే! కాల క్రమేణా చుట్టు ప్రక్కల నాగరికత సోకడంతో గ్రామంగా మారింది! ఈ గ్రామం పేరు ‘సపానా’. మీ రనుకొన్నట్టు యిక్కడ మనుషులు ఆటవికులు, ప్రమాద కారులు యేమాత్రం కాదు. వేషధారణ పూర్వపు పద్ధతుల్లో వున్నా, వాళ్ళు కేవలం మామూలు గ్రామ స్థులు మాత్రమే!”

ఇలాహీ నిట్టూర్చాడు. తర్వాత అడిగాడు మళ్ళీ “మేము, గుర్రపు ప్రయాణం వలన బాగా అలసిపోయాము. రెండు మూడు రోజులు మేమిక్కడే వుండడానికి మీ కేం అభ్యంతరం లేదుగా!?”

"తప్పకుండా వుండండి. ఇది అతిధి గృహమే. ఇక్కడే వుండండి. మీకు అన్ని యేర్పాట్లు జరుగుతాయి. మీరు బయట స్వేచ్ఛగా తిరగవచ్చు" అన్నాడా వ్యక్తి చిరునవ్వుతో పైకి లేస్తూ.

# 9

రాత్రి ఆహారం తిని, అదే గుడిసెలో పడుకొన్నారు. సరిగ్గా తెల్లవారుజామునకి ముందు సమయంలో యెందుకో మెలకువ వచ్చింది ఇలాహీకి!?

అప్పటికే కళ్ళు తెరచి వినసాగాడు విశ్వనాథ్.

చెవులు గింగిర్లెత్తే అరుపులు కేకలు వినిపిస్తున్నాయి. కిటికీలలో నుంచి కాగడాల వెలుతురులు అక్కడక్కడ కనిపిస్తూ మాయమవుతున్నాయి. జనం పిచ్చిగా పరుగులు తీస్తూన్నట్లు, రోదిస్తూన్నట్లు తెలుస్తూంది!!

"ఏమయ్యుంటుంది??" గాబరగా అడిగాడు విశ్వనాథ్ వెలుపలికి నడుస్తూ.

ఇలాహీ మంచంపై సంచుల్ని తీసి మెడకు తగిలించుకొన్నాడు. ఏదో ముంచుకొస్తూందని అతడికి అర్థమవుతోంది.

ఇంతలో బయట యిద్దరు వ్యక్తులు అగి చెప్పారు విశ్వనాథ్ కు గబగబా. "పారిపోండి! తొందరగా! బందిపోట్లు దాడి చేశారు కొల్లగొట్టడానికి! రాక్షసులు!!"

"మైగాడ్!" అప్రయత్నంగా అన్నాడు విశ్వనాథ్. అతడి కాళ్ళూ చేతులూ వణికాయి, బందిపోట్లు అనగానే! ముఖం భయంతో సాగింది.

"ఏమిటి?!" అరుస్తూన్నట్లు బిగ్గరగా అడిగాడు ఇలాహీ.

విశ్వనాథ్ చెప్పాడు. అది విని కొయ్యలా బిగుసుకొనిపోయాడు ఇలాహీ. అతడికి, తమ ముఠా, నాయకుడు గుర్తొచ్చారు వెంటనే! ఆ ఆలోచనకు నిలువెల్లా కంపించిపోయాడతడు.

తాను ముఠాలో వుండగా యిటువైపు యెప్పుడు దాడి చేయలేదు. చేస్తే, ఈ ప్రాంతాలు తనకు బాగా పరిచయమయ్యేవి! పైగా తనను పట్టుకొనేందుకు, పాతిక లక్షలు దక్కించుకోడానికి మాత్రమే వచ్చిన నాయకుడు, తిరిగి ఈ పని పెట్టుకొంటాడని అనుకోవడం సమంజసంగా అనిపించలేదు ఇలాహీకి....

విశ్వనాథ్ హెచ్చరించడంతో చటుక్కున కదిలాడు బయటికి. వెళ్ళేటప్పుడు, గుడిసె మూల ఒక వెదురుతో తయారుచేయబడిన డాలుకు అటూ ఇటూ వాలుగా అమర్చిన కత్తుల్ని చూసి చెప్పాడు విశ్వనాథ్. వెంటనే ఇద్దరూ చెరొకటీ అందుకొన్నారు!

గుడిసె అటువైపు తలుపు తెర్చుకొని వెలుపలికి వచ్చారు. అక్కడ కట్టివున్న గుర్రాలు విప్పారు త్వరగా! అప్పటికే చాలా గుడిసెలు తగలబడిపోతున్నాయి. గ్రామస్థుల్ని కర్కశంగా వధిస్తున్నారు బందిపోట్లు. కొంతమంది, వాళ్ళతో తమ ఆయుధాలను ఉపయోగించి పోరాడ్డానికి ప్రయత్నిస్తున్నారు. బందిపోట్లు రైఫిల్ తూటాలు నిర్విరామంగా పేలుస్తున్నారు....

ఇలాహీ సంచుల్ని గుర్రంపై వేసి పైకెక్కి గుర్రాన్ని ముందు ఉరికించాడు!!

ఊహించని విధంగా విశ్వనాథ్ పక్కనుండి దూసుకు వచ్చిన ఒక బందిపోటు, రైఫిల్ ఎత్తి మడమతో బలంగా విసిరికొట్టాడు విశ్వనాథ్ పైకి!! ఎడంచేత్తో

కళ్ళెం వెనక్కి లాగుతూ, వెనక్కి వంగాడు విశ్వనాథ్! అయినా అతడి భుజాన్ని రాసుకొంటూ తగిలింది దెబ్బ!

కొద్దిగా మూలిగి, ఎడంచేతిలో కళ్ళాన్ని కదుపుతూ ఆలస్యం చేయకుండా కుడిచేతిలో కత్తిపిడిపై వేళ్ళు బిగించి ఎత్తి రైఫిల్ మళ్ళీ విసరబోతున్న బందిపోటు చేయిమీద బలంగా కొట్టాడు!!

"యా..." అంటూ బిగ్గరగా అర్చాడు బందిపోటు. రక్తంతో కత్తి తడిసింది. కొంత రక్తం చిన్నగా పైకి చిమ్మింది. రైఫిల్ వదిలేసి, తెగిన చేయిని మరో చేత్తో పట్టుకొని విలవిల్లాడుతూ గుర్రంపై ఒరిగిపోయాడతడు.

బందిపోట్లతో పోరాడే గ్రామస్తులకన్నా పారిపోయేవారే యెక్కువగా వుండడంతో, బందిపోట్లు గుడిసెల్లో చొరబడి ఉపయోగకరమైనవన్నీ తీసుకొని గుడిసెలు తగలబెట్టేస్తున్నారు.

ఇద్దరి గుర్రాలు గ్రామస్థుల్ని, బందిపోట్లను తప్పించుకొంటూ ముందుకురుకుతున్నాయి. ఇలాహీ ఉన్నట్టుండి మెరుపులా తలను క్రిందికి వంచాడు. 'ధన్' మన్న రైఫిల్ ప్రేలుడు అతడి తలపై నుండి దూసుకుపోయింది!!

గ్రామస్థుల్ని తరుముతున్న ఒక బందిపోటు వెనుదిరిగి, పారిపోతున్న యిద్దర్నీ చూసి పేల్చాడది. ఇలాహీ కత్తి ఝుళిపిస్తూ గుర్రాన్ని పరిగెత్తించాడు.

తనవైపు వేగంగా కత్తితో వస్తూన్న ఇలాహీని గమనించి బందిపోటు రైఫిల్ యెత్తి గురిచూసి పట్టుకొన్నాడు.... ఇంతలో, గ్రామస్థుడు ఒకడు విసిరిన బరిసె, కన్నుమూసి తెరిచేంతలో బందిపోటు యెక్కివున్న గుర్రం ముందరకాళ్ళకు పైభాగంలో నాటుకొంది బలంగా!

గుర్రం బిగ్గరగా సకిలించి ముందుకాళ్ళను బాగా పైకి ఎత్తి జాడించి, క్రమంగా కాళ్ళు దించుతూ నేలపై వాలిపోయింది. గుర్రంమీద బందిపోటు పెద్దగా ఊగిసలాడుతూ కళ్ళెం వదిలేసి, గట్టిగా అరుస్తూ రైఫిల్‌తో దబ్బున క్రింద పడ్డాడు!

వెంటనే అతడిని తొక్కుకుంటూ ముందు ఇలాహీ గుర్రం, తర్వాత విశ్వనాథ్ గుర్రం సాగిపోయాయి. బందిపోటు మరి లేవలేదు.

## 10

"తెల్లవారుతున్నట్టుందే!" అన్నాడు విశ్వనాథ్ తూర్పుదిక్కుగా చూస్తూ.

ఇలాహీ చూశాడు. ఒకవైపు నుండి ఉదయపు వెలుతురు క్రమ్ముకొస్తూంది. వారు ప్రయాణించే ప్రాంతంలో మసకచీకటి పోలేదు ఇంకా. ఆ ప్రాంతమంతా దాదాపు ఎడారే అని మాత్రం తెలుస్తూంది!

"ఆ బందిపోట్లు...." అని ఆగాడు విశ్వనాథ్ ఇలాహీని చూస్తూ.

ఇలాహీకి రెండుగంటల క్రితం సహానా గ్రామంమీద దాడిచేసిన బందిపోట్లు గుర్తుకు వచ్చారు. కాగడాల వెలుతురులో చూశాడతడు అప్పుడే! ఇలాహీ ముఠా కాదు అది. రాత్రి ఆ విషయమే గొప్ప రిలీఫ్‌ని, ధైర్యాన్ని యిచ్చింది అతడికి! "వాళ్ళు మా వాళ్ళు కాదు" చెప్పాడు విశ్వనాథ్‌తో.

విశ్వనాథ్ నిట్టూర్చాడు. కాసేపటికి పూర్తి తెల్లవారడంతో స్పష్టమైన వెలుతురులో ఆ ప్రాంతమంతా నిండిపోయింది. ఇద్దరి దుస్తులు మాసిపోయి, చిరుగులు పట్టి నీలిలో వున్నాయి. ముఖాలు పీక్కుపోయాయి,

గడ్డాలు పెరిగి వున్నా యిద్దరికి.

రాను రాను యిసుక లోతుగా తగలడంవల్ల గుర్రాలు నీరసంగా నడవసాగాయి. వాటి జీనులకు ఇలాహీ, విశ్వనాథ్‌లు రాత్రి ఉపయోగించిన కత్తులు వ్రేలాడదీయబడి వున్నాయి. దూరంగా రెండు మూడు ఖర్జూరపు చెట్లు మాత్రం కనబడుతున్నాయి. ఆకాశం కొద్దిపాటి ఎండతో మిర మిట్లాడుతూన్నట్టుంది. రెండు మూడు పక్షులు నిశ్శబ్దంగా ఎగురుతున్నాయి పైన!

విశ్వనాథ్ గుర్రాన్ని ఆపాడు. ఇలాహీ కూడా విశ్వనాథ్‌ను చూసి ప్రశ్నార్థకంగా ఆగాడు. "ఎటువైపు పోవాలి ఇప్పుడు మనం?" అడిగాడు విశ్వనాథ్.

ఇలాహీ చెప్పాడు. "నిన్న సహానా గ్రామంలో మనతో హిందీలో మాట్లాడిన వ్యక్తితో, మళ్ళీ సాయంత్రం మాట్లాడి చాలా విషయాలు రాబట్టాను! యిక్కడ నుండి ఈస్ట్‌గా చాలాదూరం పోతే సహానా లాంటివే మరో రెండు గ్రామాలు కనిపిస్తాయట. ఎడం వైపు కొద్దిగా వాలుగా రెండువందల కిలోమీటర్లు వెళ్ళగలిగితే 'మీర్జా' అనే సిటీ వస్తుందట...."

అది విని విశ్వనాథ్ ముఖం కొద్దిగా వికసించింది. "సిటీయా, ఎంత వుంటుంది?" అడిగాడు.

"దాదాపు ఢిల్లీ అంతే ఉంటుందట!"

"అదృష్టం బావుండి మనం అక్కడికి చేరుకోగలిగితే-మన కష్టాలు గట్టెక్కినట్టే" విశ్వనాథ్ కళ్ళు మెరుస్తున్నాయి.

ఇలాహీ అడిగాడు "ముందు. నువ్వేం చెయ్యదల్చుకున్నావో చెప్పు?"

విశ్వనాథ్ చెప్పాడు. "మొత్తం ఎనిమిదిమంది టెర్రరిస్టులం మేం. ఇద్దరు పోలీసుల కాల్పుల్లో చని పోయారు. మిగతా ఐదుగురు పోలీసులనుండి తప్పించు కొనే ప్రయత్నంలో యెటో విడిపోయారు నానుండి! వాళ్ళు గనుక నన్ను మళ్ళీ కలవగలిగితే, మేము తిరిగి మా కార్యకలాపాలు యధావిధిగా కొనసాగిస్తాం.... అందుకు కొంత సొమ్ము అవసరమవుతుంది మాకు!"

"విశ్వనాథ్! నా దగ్గరున్న దానిలో ఐదులక్షలు నీ కివ్వడానికి ఎలాంటి అభ్యంతరం లేదు నాకు!" చెప్పాడు ఇలాహీ.

కొద్దిగా నవ్వి విశ్వనాథ్ "అలాగే. కానీ, నువ్వేం చేస్తావు?" అనడిగాడు.

ఇలాహీ కాసేపు మౌనంగా వుండి, తర్వాత చెప్పాడు మెల్లగా "ధనవంతుడైన వ్యాపారిగా కాలం హాయిగా గడపాలని నాకెప్పటినుండో కోరిక! ఈ డబ్బుతో యేదయినా వ్యాపారం ప్రారంభించి, కనీసం దానికి పాతికరెట్లయినా డబ్బు సంపాదించాలని ఉంది!!"

"క్రమమైన కోరికే!" అన్నాడు విశ్వనాథ్ నవ్వుతూ. ఇలాహీ మాట్లాడలేదు. కొద్దిగా గంభీరంగా ఉన్నట్టు కనిపించాడంతే! తర్వాత అడిగాడు ఇలాహీ "ఒకవేళ, నీ మిత్రులు కనిపించకపోతే ఐదు లక్షలతో ఏం చేస్తావ్?"

"ఆ కోరికేమాత్రం ఉండదల్చుకోలేదు. మారాజ్యాలో తీవ్ర వాదులు ఉండకపోరు! వాళ్ళతో చేయికలిపి ఆ నగ రంలో మా చర్యల్ని సాగించడానికి నా కాయశక్తులా తోడ్పడతాను...."

"ధనవంతులకు, టెర్రరిస్టులకు చుక్కెదురు కదా!

ఆ ప్రకారం నువ్వూ, నేనూ శత్రువులం అవుతామా!" పల్చగా నవ్వుతూ అన్నాడు ఇలాహీ.

తనూ నవ్వి చెప్పాడు విశ్వనాథ్ "నువ్వు ఎప్పటికీ శత్రువ్వి కాదు నాకు."

"సరే, గమ్యం కుదిరింది! ఇక ప్రయాణం సాగిద్దాం" అంటూ ఇలాహీ తన గుర్రాన్ని పరిగెత్తించాడు. విశ్వనాథ్ కూడా ఉత్సాహంగా గుర్రాన్ని అదిలించాడు.

## 11

ఎండ ఉధృతం అయింది. క్రమేణా, వారు ప్రయాణం చేసే మార్గంలో ఇసుక వైశాల్యం పెరుగుతూంది!! గుర్రాలు మునుపటిలా ఇసుకలో పరిగెత్తలేకపోతున్నాయి.

సమయం గడుస్తోంది! ఇప్పుడు వాళ్ళచుట్టూ ఎడారి ఆవరించింది!!

విశ్వనాథ్, ఇలాహీ వంక చూశాడు. అతడు మౌనంగా చూస్తున్నాడు ముందుకు. కళ్ళలో ఆశ మాత్రం నిశ్చలంగా వుంది. గుర్రాలు నడుస్తున్నట్టు పోతున్నాయి....

ఇంతలో రెండు ఖర్జూరపు చెట్లు, చిన్న నీటిగుంట కనిపించాయి వాళ్ళకు! ఇలాహీ పెదవుల చివర్లు సాగాయి చిన్న నవ్వులా. విశ్వనాథ్ వైపు చూశాడు, "విశ్వనాథ్! నిన్న ఆ వ్యక్తి చెప్పిన ప్రకారం సుమారు ప్రతి అరమైలుకు ఖర్జూరపు చెట్లు, నీటిగుంటలు కనబడితే మనం ఖచ్చితమైన మార్గంలో వెళ్తున్నట్టే లెక్క!" అన్నాడు.

ఇలాహీ గుర్రం జీనునుండి కత్తిని లాగి చెట్టువద్దకు వచ్చాడు. కత్తిని బాగా పైకెత్తి పళ్ళగుత్తులవద్ద యిరికించి తిప్పాడు! గుత్తులు క్రిందపడ్డాయి. ఇద్దరూ బాగా మగ్గిన ఖర్జూరపు పళ్ళను కడుపునిండేదాకా తిన్నారు.

నీళ్ళు తాగారు. ముఖం, చేతులూ కడుక్కొన్నారు.

తర్వాత ఇలాహీ గుర్రాలను గుంట దగ్గరకు నడిపించుకుంటూ వచ్చి మెడలు వంచి, రెండింటికీ బాగా నీళ్ళు పట్టించాడు. గుర్రాలు త్రాగడంవల్ల నీటిగుంట చుట్టూ ఇసుక, ముందుకీ వెనక్కీ తొక్కబడి గుంట సగంవరకూ కప్పబడిపోయి, నీటినిండా ఇసుక కలిసిపోయి బురదలా తయారయ్యాయి! మళ్ళీ కాసేపటికిగానీ ఆ నీళ్ళు తేటబడవు.

గుర్రాలను అధిరోహించి తాపీగా ప్రయాణమయ్యారు తిరిగి. దాదాపు మిట్టమధ్యాహ్నం కావస్తూంది. ఎండ నిమిష నిమిషానికి నిప్పులు కురిపిస్తున్నట్టుంది!!

మధ్యలో మరొక ఖర్జూరపు చెట్టును మాత్రం దాటారు వాళ్ళు నీటిగుంటలు యెక్కడా కనిపించడం లేదు. ఇసుక మాత్రం ఎండకు నిగనిగలాడుతూ కనబడుతూంది!

పెదాలు తడుముకొన్నాడు. విశ్వనాథ్ వేళ్ళతో! పెదాలు ఎండిపోయి పెళుసుగట్టాయి. కొద్దిగా చిట్లుతున్నాయి! కళ్ళు మండుతున్నాయి. చెవుల్లోకి వెచ్చటి ఆవిరి పోతూంది! ఇలాహీ ముఖం వాడిపోవడం గమనించాడు విశ్వనాథ్.

ఆకలి లేకపోయినా దాహం వేయడం మాత్రం ప్రారంభించింది ఇద్దరికీ. ఎడారిలో ఒకసారి దాహం వేయడం అంటూ ప్రారంభమయితే, ఆ కోరిక క్షణాల మీద యెంత రాక్షసంగా పెరిగిపోతుందో ఇలాహీకి తెలుసు! అందుకే అతను వీలయినంతవరకూ దాహం సంగతి మర్చిపోవడానికి ప్రయత్నించసాగాడు....

ఎంతసేపు నడిచినా మళ్ళీ చెట్లుగానీ, నీళ్ళుగానీ

దర్శనమివ్వలేదు. దూరదూరంగా ఎండమావులు మాత్రం వంపులు తిరుగుతూన్న నీళ్ళతో స్పష్టంగా కనబడు తున్నాయి!!

అరచేయి నుదురు క్రిందుగా ఎండకు అడ్డు పెట్టుకొని చూస్తూన్న విశ్వనాథ్, చటుక్కున ఉమ్మితో పెదాలు తెరుచుకొని గట్టిగా చెప్పాడు. "ఇలాహీ! అక్కడ చూడు....దూరంగా యేదో వాహనంలాంటిది వెళుతు న్నట్టుంది...."

ఇలాహీ కూడా కళ్ళు చిట్లించి ఓపిగ్గా చూశాడు. ఎక్కడ దూరం! అక్కడ యేదో కదులుతూండడం అతడికీ కనిపించింది!? "విశ్వనాథ్! ముందు వాళ్ళెవరో చూసి దగ్గర కెళ్ళడం మంచిది!" అన్నాడు.

"ఈ పరిస్థితిలో ఎవరయినా ఒకటే మనకు. మన కావలసింది మంచినీళ్ళు, కొద్ది ఆహారం!" అన్నాడు విశ్వనాథ్.

ఇలాహీ అతడి ఆత్రుత గమనించి "సరే, వెళదాం. మన దగ్గరున్న డబ్బును రక్షించుకోవడం కూడా మన కెంతో ముఖ్యమని గుర్తుంచుకో! దురదృష్టవశాత్తు ప్రమాదం ఎదురయితే మాత్రం తెగించడానికి వెను కాడవద్దు మనం!" అని చెప్పాడు కళ్ళాన్ని గట్టిగా పట్టుకొని విదిలిస్తూ.

పావు గంటలో ఇలాహీ, విశ్వనాథ్ వాళ్ళను చేరు కున్నారు!

## 12

ముందు ఒంటెపై ముగ్గురు, వెనుక ఒంటెపై ఇద్దరు మనుషులు కూర్చుని ఉన్నారు. ఎండ తగలకుండా గుడ్డతో తయారుచేసిన వంపు గొడుగులు ఒంటెల నడుంపై

కట్టి ఉంచారు.

ముందు వెళ్ళే రెక్కబళ్ళకు మాత్రం అటూ ఇటూ పరదాలు తగిలించి ఉన్నాయి. అందులో స్త్రీలు, పిల్లలు—సామాన్లు ఉన్నట్టు తెలుస్తూంది. ఇలాహీ, విశ్వనాథ్‌లను చూడగానే అందరూ ఆగిపోయారు.

ఇటుక పొడిరంగు, పసుపురంగు, తెలుపురంగులలో వున్న తలపాగాలు చుట్టుకొని ఎర్రటి మడతలు పడిన ముఖాలు పిల్లికళ్ళతో ఉన్న వాళ్ళను చూడగానే గుర్తుపట్టాడు ఇలాహీ!!

రాజస్థాన్‌లో 'ముస్నా' జాతివాళ్ళు వాళ్ళంతా! వ్యవసాయంతోనూ, ముఖ్యంగా వడ్డీ వ్యాపారంతోనూ యెక్కువ డబ్బు సంపాదిస్తూంటారు. వాళ్ళలో డబ్బు యెంత యెంతో, క్రూరత్వం కూడా అంతే!! అలాంటి వాళ్ళు కనిపించడంతో ఇలాహీ ముఖం చిట్లించాడు.

తమను చూడగానే రెండు ఒంటెలపై ఒకరిద్ద, చేతుల్లో కత్తులు మెరవడం గమనించాడు, ఇలాహీని విశ్వనాథ్!!

"ఎవరు మీరు! ఎందుకు పిలిచారు మమ్మల్ని?" ఒంటిపైనుండే క్రిందికిచూస్తూ అడిగాడు వెనుకనున్న వ్యక్తి.

ఇలాహీ చెప్పాడు "బాటసారులం మాత్రమే! మీకు ప్రమాదం కలిగించేవాళ్ళం మాత్రం కాదు!"

"దాహానికి కొద్దిగా మంచినీళ్ళు ఇవ్వండి. కొద్ది ఆహారంకూడా ఇప్పించండి, మీ మేలు మరువం!" అడిగాడు విశ్వనాథ్ మెడపైకెత్తి చూస్తూ.

"ఎక్కడికి వెళుతున్నారు మీరు?" పైనుండి ప్రశ్న

వినిపించింది.

విశ్వనాథ్ చెప్పాడు "మీర్జా నగరానికి!"

"దారి ఇటు రాదే!" అన్నాడు పైనున్న వ్యక్తి.

అదిరిపడి మొహా మొహాలు చూసుకున్నారు ఇద్దరూ.

'ఇటు రాదా?" తెల్లబోతూ అడిగాడు ఇలాహీ. అతడి గుండెలు దడదడగా కొట్టుకుంటున్నాయి. విశ్వనాథ్ కళ్ళు పెద్దవి చేసి చూస్తున్నాడు భయంగా ఆ వ్యక్తి ఏం చెప్తాడోనని....!?!

ఆ వ్యక్తి చెప్పాడు "మేము మీర్జా నగరానికి దిగువగా ఉన్న గ్రామం వెళ్ళాలి. మీర్జాకి వెళ్ళాలంటే మాత్రం, ఇక్కడనుండి ఇంకా ఎగువగా పోవాలి— చాలాదూరం అది!"

ఆ వ్యక్తి చూపుడు వ్రేలితో చూపిస్తున్న ప్రాంతాన్ని చూస్తూ అడిగాడు ఇలాహీ "ఇక్కడనుండి మీర్జా చేరాలంటే ఎన్ని రోజులు పడుతుంది?"

"రెండ్రోజులు పైనే పట్టవచ్చు. మామూలు దారిలో వెళితే మాత్రం ఒక రోజులో వెళ్ళిపోదురు!"

అంత తేలిగ్గా దారి తప్పినందుకు, తననుతానే మనసులో తిట్టుకున్నాడు ఇలాహీ. విశ్వనాథ్ ముఖం వాడి పోయింది.

ఇద్దరూ కాస్సేపు మౌనంగా వుండిపోయారు. మరో రెండు రోజులు ప్రయాణం చేస్తేనేగానీ మీర్జాకి చేరమని తెలిసేసరికి ఇద్దరికీ, పాత కష్టాలన్నీ ఒక్కటిగా తిరిగి యెదురయినట్టు అనిపించసాగింది!

"ప్రస్తుతానికి మాకు కొద్ది నీళ్ళు ఇప్పించగలరా!" అడిగాడు విశ్వనాథ్ పైకి చూస్తూ.

దానికా వ్యక్తి "మేమింకా రెండురోజులు ప్రయాణం

చేయాలి. మాకు మాత్రమే సరిపడా ఆహారం, నీళ్ళూ వెంట తెచ్చుకున్నాం. మీకివ్వడం కష్టం!" అన్నాడు.

ఇద్దరూ కృంగిపోయారు అతడి సమాధానానికి!

"దయచేసి ఈ సాయం చెయ్యాలి మీరు, మాకు!" అర్థిస్తున్నట్టు అడిగాడు విశ్వనాథ్.

"చెప్పానుగదయ్యా మా పరిస్థితి..అయినా, అంతలా అడుగుతున్నారు కాబట్టి మేము అతికష్టంమీదకొద్ది సరుకొంటామ్! ఇక్కడనుండి మీరు, మీర్జాకి ఖచ్చితంగా చేరే దారిలో కలియాలంటే రేపు మధ్యాహ్నం దాటి ప్రయాణం చేయాలి.... దారిలో ఎక్కడా మీకు ఖర్జూరపు చెట్లుగానీ, మంచినీళ్ళుగానీ కనిపించవు....! అందుకే మేము. మీకు ఒకరోజుకు సరిపడా నీళ్ళ— కొద్దిగా రొట్టెలు ఇస్తాం....మీ దగ్గరున్న సొమ్ములో కొంత మాకివ్వాలి!!" అన్నాడా వ్యక్తి నింపాదిగా.

విశ్వనాథ్, ఇలాహీ ముఖం వంక చూశాడు వెంటనే! ఆ వ్యక్తి చూపులు తన గుర్రం మెడపై వున్న సంచులపై పడడం చూసి, ఇలాహీ కళ్ళల్లో ఎర్రజీరలు ప్రత్యక్షమయ్యాయి కోపంతో....

ఆ వ్యక్తికి చెప్పాడు "బలవంతం ఏమీ లేదు! మీ ఇష్టమైతేనే అలా ఒప్పుకోండి. లేదంటే మా తోవన మేం పోతాం—మీకు నీళ్లూ, ఆహారం ఒకరోజుకు సరిపడా ఇవ్వాలంటే, మేము, ప్రాణాలకు తెగించి ఈ పని చేస్తున్నట్టు లెక్క!"

"మావద్ద అసలు డబ్బులేకదా మీకివ్వడానికి!" అన్నాడు విశ్వనాథ్ మామూలుగా.

నవ్వాడా వ్యక్తి, "మీరు నన్ను మభ్యపెట్టలేరు. చిరిగిన ఆ సంచిలోనుండి నోట్లు కనబడుతూనే వున్నాయి

వాడు! అయినా ప్రాణాలకంటే మీకు డబ్బే ముఖ్యమా?"
అన్నాడు.

అప్పుడు అర్థమయింది ఇలాహీ, విశ్వనాథ్ లకు, ఆ వ్యక్తికి డబ్బు ఇవ్వాలంటూ అంత స్పష్టంగా ఎలా చెప్ప గలిగాడో! ఇలాహీ ముందుకు వంగి కుడివైపు సంచిని తడిమిచూశాడు... సహానా గ్రామంలో బందిపోట్ల బారి నుండి తప్పించుకొని వచ్చినప్పుడు, ఏదో తగిలి సంచికి ఏర్పడిన చిరుగు అతడి చేతికి తగిలింది.

"సరే! ఇస్తాం డబ్బు" చెప్పాడు ఇలాహీ.

సంచులు పైకి తీసి, వాటిలో నుండి కొన్ని నోట్ల కట్టలు బయటికి తీశాడు.

ఆ వ్యక్తి సైగ చేయడంతో అతడి ప్రక్కనున్నవాడొకడు, ఒంటెమీద నుండి తాడు నిచ్చెన ద్వారా క్రిందికి దిగాడు! మిగతా వాళ్ళు మెల్లగా మాట్లాడుకొంటూ చూస్తున్నారు. ముందు చెక్కబండిలో నుండి ఇద్దరు ముగ్గురు స్త్రీలు, పిల్లలు పరదాను కొద్దిగా తొలగించి చూస్తున్నారు.

ఇలాహీ రెండు చేతులనిండా వున్న నోట్లకట్టలు క్రిందికి దిగినవాడికి అందించాడు.... అతడికి గుర్రం జీను వున్న కత్తి చటుక్కున మూసి, ఒంటెపై వ్యక్తి తలను, తెగ నరకాలన్నంత కసిగా వుంది!

కట్టలు అందుకొన్నవాడు, తన నడుముకు చుట్టుకున్న గుడ్డతీసి కట్టలు అందులో మూటగట్టి, పైనున్న ఆ వ్యక్తి వద్దకు విసిరాడు. అతడు దాన్ని భద్రంగా అందుకొని ఒకసారి విప్పి చూసి, తృప్తి పడ్డట్టే కనిపించాడు!?!

తర్వాత ఆ వ్యక్తి సైగ చేయడంతో, క్రిందకు దిగిన వాడు ముందు ఆగివున్న చెక్కబండి వద్దకు వెళ్ళాడు.

పరదా తొలగించి బంటిలో ఎత్తుగా ఏవో సామాను మధ్య వున్న పెద్ద రేకు మంచినీటి డ్రమ్ముకున్న కొళాయి విప్పి, జాగ్రత్తగా ఒక లావాటి సొరకాయ బొర్రలో నిండా నీళ్ళు పట్టి మూత బిగించి ఇలాహీకి అందించాడు.

ఇలాహీ త్వరగా మూత తెరిచి కొద్దిగా గొంతు తడుపుకొని విశ్వనాథ్‌కు అందించాడు. వాడు మళ్ళీవచ్చి కొన్ని రొట్టెలు కట్టివున్న పంచులు చెరొకటి ఇచ్చాడు. ఖర్జూరపు పళ్ళు తిని వుండడంవల్ల యిద్దరికి ఆకలిలేదు. రొట్టెల్ని భద్రపరిచారు.

విశ్వనాథ్ నీళ్ళు త్రాగడం పూర్తిచేసి, బొర్ర మూతి బిగించి దాని మూతి అంచుకు గొలుసులా కట్టిన తాడు ఆధారంతో గుర్రం జీనుకు తగిలించాడు దానిని!

అప్పటికి మసక చీకటి పడింది.

జోరా—ఇలాహీ, విశ్వనాథ్‌లు అక్కడ నుండి ప్రయాణించవలసిన మార్గాన్ని చూపించాడు! ఇద్దరూ తమ గుర్రాలను యెక్కి వెళ్ళడానికి సిద్ధపడ్డారు! జోరా తమ బృందాన్ని బయల్దేదీశాడు! వాళ్ళు ఎడంచేతి వైపూ ఇలాహీ, విశ్వనాథ్‌లు తిన్నగానూ ప్రయాణమయ్యారు.

ఎత్తుగా వున్న యిసుకతిన్నెను అధిరోహించాయి గుర్రాలు.... వాలుగా క్రిందికి దిగసాగాయి. అక్కడ ప్రదేశమంతా యెగుడుదిగుడుగా వున్న చిన్న చిన్న యిసుకతిన్నెల మయంగా వుంది....

పదినిమిషాలు గడిచాయి.... అకస్మాత్తుగా "అబ్బా!" అంటూ అరిచాడు ఇలాహీ? విశ్వనాథ్ ఉలిక్కిపడి తల

తిప్పాడు!? గుర్రంమీద ఇలాహీ ముందుకు వంగివున్నాడు! విశ్వనాథ్ చూస్తూ ఉండగానే అతడు గుర్రంమీద నుండి జారిపడి ఆ యిసుక తిన్నెపై నుండి మూలుగుతూ క్రిందికి దొర్లిపోయాడు.

విశ్వనాథ్‌కు యేమీ అర్థం కావడంలేదు. "ఇలాహీ! ఇలాహీ యేమయింది!?" అంటూ బిగ్గరగా అడుగుతూ, క్రిందికి దిగి నిశ్చేష్టుడైపోయాడు!??

ఇలాహీ గుర్రానికి ఎడంవైపు మెడపై చీకట్లో కలసిపోయిన నల్లటి త్రాచు పాకుతోంది, సంచులలో నుండి....

చటుక్కున తన గుర్రం జీనులో నుండి కత్తి అందుకొని, పామును క్రిందికి విదిలించాడు విశ్వనాథ్. క్రింద యిసుకలో పడినవెంటనే దాన్ని ముక్కలుగా నరికాడు.

వెంటనే యేదో అనుమానం వచ్చిందతడికి. తన గుర్రం జీనును కత్తితో మెల్లగా విడదీశాడు....అక్కడ తీగల్లాంటి రెండు మూడు తాళ్ళ పక్కకు తప్పుకొని, సన్నగా ఉన్న నల్లటి మరో త్రాచుపాము వెలుపలికి వచ్చింది బుసకొడుతూ! దాన్ని కూడా క్రిందకు దులిపి చంపాడు. ఇలాహీ మూలుగు వినబడుతోంది.. చురుగ్గా కదిలాడు, విశ్వనాథ్ అటువైపు!

ఎడంకాలు చచ్చుబడినట్టు ప్రక్కకు త్రేలాడేసి, చేతులు కాలిపై వేసి నొక్కుకొంటూ మూలుగుతున్నాడు ఇలాహీ. అతడి పెదవుల చివర్ల నుండి తెల్లటి నురుగు వస్తూంది. పాము ఇలాహీకి కాలిమీద కాటేసిందని గ్రహించాడు. "ఇలాహీ ....ఇలాహీ'!" కదిపాడు విశ్వనాథ్.

ఆ చీకట్లో ఇలాహీ కళ్ళు ఆరిపోతున్న కొవ్వొత్తుల్లా మసగ్గా మెరుస్తోన్నాయి....

విశ్వనాథ్ అతడి భుజాలమీద చేతులువేసి పట్టుకొని మళ్ళీ పిలిచాడు. మాట్లాడాలని ప్రయత్నించినా మాట రావడం లేదు ఇలాహీ నోటినుండి! అతడి కళ్ళు నిస్తేజమయ్యాయి. శరీరం చలనరహితమయ్యింది. త్రాచుపాము విషం క్షణాల్లో పనిచేస్తుందని తెలిసినవాడు గనుక విశ్వనాథ్ మరే ప్రయత్నమూ చేయలేదు....

చల్లగా కట్టెలా తగిలింది ఇలాహీ శరీరం. అతడు మరణించాడని అర్థమయింది విశ్వనాథ్ కు—అంతలో, అడుగుల చప్పుడు వినిపించడంతో తలెత్తి చూశాడు.

మొత్తం మూడు ఆకారాలు వస్తున్నాయి అతడి వైపు! వాళ్ళ చేతుల్లో కత్తులు కొద్దిగా తెల్లగా కనిపిస్తున్నాయి. దగ్గరకు రాగానే చూశాడు విశ్వనాథ్ వాళ్ళను?? ఒకడు జోరా—మిగతా ఇద్దరూ వాడి అనుచరులు.

తామిద్దరినీ గుట్టుగా మట్టుపెట్టి, డబ్బంతా స్వంతం చేసుకోడానికి రొట్టెల సంచులలో పాముల ఏర్పాటు చేసింది వాళ్ళేనని ముందే గ్రహించాడు విశ్వనాథ్. కట్టలు తెంచుకొన్న కోపంతో, బిగ్గరగా అరుస్తూ విశ్వనాథ్ కత్తి యెత్తి వాళ్ళమీద కలబడ్డాడు! ప్రాణాలకు తెగించి ఉన్నాడతడు....అతడి ధాటికి వాళ్ళు తట్టుకోలేక పోయారు.

జోరా, మరొక అనుచరుడు ఒళ్ళంతా రక్తాలు కారుతూ అక్కడికక్కడే మరణించారు. మూడవవాడు భయంతో పారిపోయాడు.

విశ్వనాథ్ చాలాసేపు అక్కడే ఆగాడు....ఇలాహీ గుర్రంమీది సంచుల్ని క్రిందికి దింపి పూర్తిగా పరిశీలించాడు లోపల! ప్రమాదం లేదని నిర్ధారించుకొన్నాక సంచుల్ని తన గుర్రంమీద వేశాడు.

తర్వాత రొట్టెలు పారేసి మంచినీరు భద్రం చేసుకొని, గుర్రాన్ని యెక్కి అదిలిస్తూ పరిగెత్తించాడు విశ్వనాథ్....

*　　*　　*

ఉదయమయ్యింది—

రాత్రి నుండి నిర్విరామంగా ప్రయాణిస్తున్నాడు విశ్వనాథ్! అతడికి తాను వెళ్ళే మార్గంపై ఏ మాత్రం నమ్మకం లేదు! జోరా డబ్బుకోసం తమను నమ్మక ద్రోహం చేశాడు...పాములు ఏర్పాటు చేసి తమను చంపే ప్రయత్నం చేశాడు!! అలాంటివాడు చెప్పిన దారి నిజమైనదన్న నమ్మకం విశ్వనాథ్ కు లేదు!

ఎండ, వేడి పెరుగుతోంది....దూరంగా చూసి మెడ పైకెత్తాడు విశ్వనాథ్!

రెండు ట్రక్కులు ముందుకు దూసుకొని వస్తోన్నాయి. పోలీస్ ట్రక్కులవి!!

అతడి వెన్ను జలదరించింది భయంతో! కళ్ళెం పట్టుకొన్న చేతులు అప్రయత్నంగా వణికాయి!

గుర్రాన్ని ఎడంవైపుకు తిప్పాడు.

రాజస్థాన్ ప్రత్యేక పోలీసుదళం ఉపయోగించే ట్రక్కులవి! దగ్గరవుతున్నాయి వేగంగా....

ఒళ్ళంతా చెమటలు కారుతున్న విశ్వనాథ్ కు, జైలో రానా సిటీలో తనను అనుమానించిన ఇన్ స్పెక్టర్ గుర్తుకు

తచ్చాడు.... ట్రక్కులలో నుండి గాలిలోనికి కాల్పులు జరుపుతున్నారు పోలీసులు.... తప్పించుకోవడానికి ప్రయత్నిస్తే, పోలీసుల రైఫిల్ తూటాలు తన శరీరంలోనికి నిర్దాక్షిణ్యంగా ప్రవేశిస్తాయని విశ్వనాథ్‌కు తెలుసు!

ఇక, తాను పోలీసులకు లొంగిపోక తప్పదని గ్రహించి, ఆగిపోయాడు విశ్వనాథ్....

—: అయిపోయింది :—

సీరియల్

వి.యస్.రావ్




(గత సంచిక తరువాయి)

బిగుసుకున్న హనుమాన్ మొహం ఆటోమాటిక్‌గా విప్పారింది. అతని పెదవులు చిరునవ్వుతో విచ్చుకున్నాయి. అతని చూపులో మార్పొచ్చింది. సింహం మొహం చేటలా అయ్యింది. హనుమాన్ ఉత్సాహంతో టీని కప్పుల్లోకి వొంపాడు. విరూపాక్షరావు ముందు ఒక కప్పు వుంచి, మనోజ్‌కి స్వహస్తాల్తో అందించాడు.

“థాంక్స్, హనుమాన్. నో అఫెన్స్!” మనోజ్ నవ్వుతూ అన్నాడు.

హనుమాన్ పళ్ళు యికిలించాడు. “మన మధ్య ఏమీ జరగలేదే!” అన్నాడు ఉషారుగా. విరూపాక్షరావు గొల్లున నవ్వాడు.

టీ చప్పరిస్తూ మనోజ్ హనుమాన్ వైపు చూశాడు.

మూతిమీద బూటు కాలితో తన్ని, బిస్కెట్ పడేసిన యజమానిని ప్రేమతో చూస్తున్న అల్సేషియన్ కళ్ళలా వున్నాయి హనుమాన్ కళ్ళు.

"సింహం...." అంటూ విరూపాక్షరావు చెయ్యి చాచాడు. సింహం జేబులోంచి తీసి, కవర్ని అతనికి అందించాడు. విరూపాక్షరావు కవర్ని మనోజ్ వైపు తోశాడు.

"మనోజ్, అందులో నా ముగ్గురు అనుచరుల మూడు రకాల ఫోటోలున్నాయి. వాటిని బాగా గుర్తుంచుకుంటే వాళ్ళని నువ్వు సులువుగా పోల్చుకోగలవు...." అన్నాడతను.

టీ కప్పుని కింద పెట్టి మనోజ్ కవర్లోంచి అరడజను ఫోటోల్ని ఇవతలికి లాగాడు. ఒక్కో వ్యక్తివి రెండేసి ఫోటోలు. ఒక ఫోటోలో గెడ్డం లేకుండా, మరో ఫోటోలో అంగుళం పొడవు గడ్డంతో వున్న మొహాల్ని మనోజ్ తదేకంగా చూస్తూ వుండిపోయాడు. విరూపాక్షరావు అనుచరులు అమాయకుల్లా అవుపిస్తున్నారు....

"శత్రువుల చేతుల్లో చిక్కినవాళ్ళు ప్రస్తుతం యే షేప్‌లో వుంటారో మనకి తెలీదు. అందుకే పెరిగిన గెడ్డాలతో, చెరిగిన క్రాపుల్తో వున్న ఫోటోలు కూడా నీకు చూపించబడుతున్నాయి!" విరూపాక్షరావు కంఠం మనోజ్‌ని హెచ్చరించింది.

ఆరు ఫోటోల్నీ మూడు వరసలుగా పెట్టి, మనోజ్ తలెత్తి అతన్ని చూశాడు. "వాళ్ళ పేర్లు చెప్పలేదు...."

విరూపాక్షరావు సాభిప్రాయంగా సింహం వేపు చూశాడు.

"ధర్మరాజు, విభీషణ్, భరత్...." సింహం చక చకా అన్నాడు మూడు ఫోటోల్నీ వరసగా వేలితో కొట్టుతూ.

మనోజ్ చిరునవ్వు నవ్వుతూ విరూపాక్షరావుని చూశాడు. "పేర్లకి తగ్గట్టే మీ అనుచరులు. అమాయకుల్లా అవుపిస్తున్నారు!"

విరూపాక్షరావు తల ఆవేశంతో కిందికీ పైకీ ఆడింది. "అమాయకులు కాబట్టే వాళ్ళు అపాయంలో చిక్కుకున్నారు!" అన్నాడతను నిట్టూరుస్తూ.

మనోజ్ తన ముందున్న ఫోటోల్ని మరోసారి చూసి, వాట్ని పేకముక్కల్లా కలిపాడు. అన్నింటినీ కవర్ లో దోపాడు.

"మిస్టర్ విరూపాక్షరావ్, నాకు కొన్ని పరికరాలు కావాలి...."

విరూపాక్షరావు సగర్వంగా నవ్వాడు. "రెండు రోజుల్లో నీ హోటల్ ముందు పవర్ ఫుల్ ఇంజన్ వున్న అంబాసిడర్ వుంటుంది. "మనోరంజన్, ఫీల్డు ఆఫీసర్, విరూప్ ఇంటర్నేషనల్" పేరుతో డ్రైవింగ్ లైసెన్సు నీకు అందుతుంది. అన్నట్టు ఇవ్వాళే నువ్వు హోటల్ విక్రమ్‌కి మారిపో. మనోరంజన్ పేరుతో నీ కోసం గది తయారుగా వుంటుంది. హోటల్ మేనేజర్ భుజగోవిందం నువ్వు కొండమీది కోతిని అడిగితే తెచ్చిపెడతాడు. ఎంజాయ్!"

"అంతేకాదు........ సైలెన్సరున్న రివాల్వర్, తూటాలూ...." మనోజ్ అడ్డు తగిలాడు.

"సింహం........" విరూపాక్షరావు గంభీరంగా అన్నాడు.

"రాత్రికి మనోజ్ గార్ని హోటల్ గదిలో కలు
కుంటాను, బాస్ ..." సింహాం వెంటనే అన్నాడు.

ఇంకా యేం కావాలన్నట్టు మనోజ్ ని చూశాయి
విరూపాక్షరావు కళ్ళు.

"నా కత్తి ..." మనోజ్ నవ్వుతూ అన్నాడు.
విరూపాక్షరావు నవ్వుతూ తనముందు, టేబుల్ మీదున్న
కత్తిని మనోజ్ వైపు చాచాడు.

"తప్పించాక మీ శిష్యుల్ని యేం చేయాలి?" మనోజ్
కత్తిని చేతో పట్టుకుని ప్రశ్నించాడు.

"పంజరంలోంచి తప్పించాక వాళ్ళని వదిలెయ్. పావు
రాళ్ళు గూటికి చేరుకున్నట్టు వాళ్ళిక్కడికి చేరుకుం
టారు!" విరూపాక్షరావు నవ్వుతూ అన్నాడు.

మనోజ్ లేచి నిలబడ్డాడు. కత్తిని జేబులో పడేసు
కుని ఫోటోలున్న కవర్ని అందుకున్నాడు.

"మనోజ్, ఆ ఫోటోల్ని ఇక్కడే వదిలేయ్!"

మనోజ్ విరూపాక్షరావుని ప్రశ్నార్థకంగా కళ్ళు
చిట్లిస్తూ చూశాడు.

"అవి నీ దగ్గరుండటం ప్రమాదం, పొరపాటుగా
యెవరేనా చూస్తే నీ ప్రయత్నం వాళ్ళకి తెలిసి
పోవచ్చు ..." విరూపాక్షరావు చిరునవ్వుతో వివరిం
చాడు.

"యూ ఆర్ రైట్!" మనోజ్ నవ్వుతూ కవర్ని
పడేశాడు.

"మిమ్మల్ని కలుసుకోవాలంటే యెట్లా?" మనోజ్
ప్రశ్నించాడు.

విరూపాక్షరావు మెల్లిగా లేచి ఠీవిగా నిలబడ్డాడు.
"పని పూర్తయ్యాక నువ్వు నన్ను కలుసుకునే అవ

పరం రాదు. అంతవరకూ నువ్వు నన్ను గురించి మరిచి పోవడం మంచిది. నాతో యేదేనా మాట్లాడాల్సిన అవసరం వస్తే హోటల్ మేనేజర్ భజగోవిందాన్ని కలుసుకో. నీకో బుల్ డాగ్ కావాలని అతనితో చెప్పు. అరగంటలో సింహం నిన్ను కలుసుకుంటాడు!"

మనోజ్ తలాడించాడు. నిదానించి విరూపాక్షరావు మొహంలోకి చూశాడు. "మిస్టర్ విరూపాక్షరావ్, నాకో సందేహం వుంది తీరుస్తారా?"

"వాట్!" విరూపాక్షరావు నవ్వుతూ అన్నాడు.

"నేను ఢిల్లీనుంచి తిరిగొచ్చినట్టు మీకెలా తెలుసుకున్నారు?"

విరూపాక్షరావు నోరారా నవ్వుతూ వుండిపోయాడు. "మిస్టర్ మనోజ్, ఢిల్లీలో కూడా నా కళ్ళున్నాయి. యిక్కడే కూచుని నేను ఇండియా అంతా చూడగలను!"

మనోజ్ కనుబొమలు పైకి లేచాయి. విరూపాక్షరావు మళ్ళీ నవ్వాడు. "ఢిల్లీలో నువ్వు అడుగుపెట్టిన క్షణం నుంచీ నా నౌఖరొకడు నిన్ను గమనిస్తూ వుండిపోయాడు. నువ్వు ట్రెయినెక్కగానే నాకు ఫోన్ చేశాడు!" అన్నాడతను సగర్వంగా.

మనోజ్ నవ్వుతూ చూశాడు. "వెళ్తాను. ఇవ్వాల్టి నుంచీ మీ పనిమీదే వుంటాను...."

"నా పనికాదు; నీ పని. నీ పనికోసం నా పని చేస్తున్నావ్!" విరూపాక్షరావు మనోజ్ కళ్ళల్లోకి తదేకంగా చూస్తూ అన్నాడు.

నవ్వుతూ మనోజ్ కదిలాడు.

"మనోజ్...."

మనోజ్ ఆగి ప్రశ్నార్థకంగా చూశాడు.

"ఈ క్షణం నుంచీ నువ్వు అతిజాగ్రత్తగా వుండాలి. నీ నీడను కూడా నువ్వు నమ్మకూడదు! అన్నట్టు సింహం నీకు పైకం అందజేస్తాడు; యెన్నో అవసరా లుంటాయి. వందరూపాయల్ని నువ్వు పైసాలా ఖర్చు చెయ్యొచ్చు! వెళ్ళిరా. గుడ్ లక్!" విరూపాక్షరావు చెయ్యి చాచాడు. మనోజ్ అతని చేతిని పట్టుకున్నాడు.

"ఎక్కడికి వెళ్తున్నావో చూడకుండా నువ్విక్కడికి చేరుకున్నావు. ఎక్కడినుంచీ వెళ్తున్నావో చూడకుండా యిక్కణ్నుంచీ వెళ్ళాలి. ఆ ప్రయత్నంలో వీళ్ళిద్దరితో సహకరించు!" అనుచరులిద్దర్నీ చూపుతూ విరూపాక్షరావు అన్నాడు.

"ఎందుకు....?" మనోజ్ ఆశ్చర్యంతో ప్రశ్నించాడు.

విరూపాక్షరావు తీక్షణంగా చూశాడు. "నీ కోసం ముందు చూపుతో చెప్తున్నా. అనుమానించకుండా వెళ్ళు!"

మనోజ్ భుజాలు ఎగరేశాడు. నవ్వుతూ తన దగ్గరగా నిలుచున్న హనుమాన్, సింహం—యిద్దర్నీ చూశాడు. హనుమాన్ చెయ్యి పాంటు జేబులోంచీ యివతలికి వచ్చింది. చేతిలో నల్లటి సంచీ వుంది....

* * *

మనోజ్ హోటల్ విక్రమ్‌లోని గదిలో అద్దం ముందు నిలబడ్డాడు. ఫుల్ సూటులో వున్న ప్రతిబింబాన్ని చిరునవ్వుతో చూశాడు!

రెడీమేడ్ సూట్ తనకి బాగా సూటయ్యింది. విరూప్ ఇంటర్నేషనల్ ఫీల్డాఫీసర్ హోదాకి తగ్గట్టు, విరూపాక్ష

రావు పర్సు చేసిన పైకంతో చక్కటి సూట్లు కొన్నం దుకు ఆనందిస్తూ అతను సోఫావైపు నడిచాడు.

రెండురోజుల పరిశీలన తనకి ఎన్నో విషయాలు తెలియజేసింది. ఆర్మీలో వుండిపోయిన తనకి విరూపాక్ష రావు గురించి దాదాపు యేమీ తెలీదు. కానీ, సిటీలో అతన్ని గురించి తెలియనివాడు లేడు.

అతనంటే గొప్ప అభిప్రాయం వున్నవాళ్ళున్నట్టే, అతన్ని కాలాంతకుడు అనేవాళ్ళూ వున్నారు. కేవలం మంచి పేరుతోనే వ్యక్తులు పెద్దవాళ్ళు కారు! విరూపాక్షరావుకి చాలామంది మిత్రులున్నారు; నలుగురైదుగురు దాదాపు సమఉజ్జీలు కాగలిగిన శత్రువులూ వున్నారు. వాళ్ళల్లో జంబుకేశ్వరం ప్రథముడు.

ఎన్నో హోటల్సూ, క్లబ్బులూ నడుపుతూ చట్టం కళ్ళు కప్పుతూ లక్షలు ఆర్జిస్తున్న విరూపాక్షరావును అధిగమించడానికి జంబుకేశ్వరం నిర్విరామంగా ప్రయత్నిస్తున్నట్టు మనోజ్ తన పరిశోధన ద్వారా తెలుసుకున్నాడు.

వివిధ 'కుంభకోణాల్నీ', 'గాసిప్స్'నీ ప్రముఖంగా ప్రచురిస్తూ సర్క్యులేషన్ పెంచుకున్న దినపత్రిక "పాలికేక" జంబుకేశ్వరం అల్లుడిదని తను తెలుసుకోగలిగాడు. తన పరువు గంగపాలవ్వుతుందని అందుకే విరూపాక్షరావు హడలిపోతున్నాడు! అతని అనుచరులు నోరు తెరిస్తే అతని కథ పాలికేకలో తాటికాయంత అక్షరాల్తో ప్రచురించబడుతుంది!

కాలుస్తున్న సిగరెట్‌ని యాష్‌ట్రేలో పడేసి మనోజ్ టైం చూసుకున్నాడు. పదకొండు దాటింది. తను హాలో

గంటలో బయల్దేరాలి.

మనోజ్ లోపలి గదిలోకి వెళ్ళాడు. మాటు తీసేసి, డార్క్ కలర్ పాంటూ, ఫుల్ స్వెట్టర్ వేసుకున్నాడు.

తను సిద్ధంగా వుంచుకున్న పరికరాల్ని చిరునవ్వుతో చూశాడు. అక్కడ యేవి తనకి అవసరమవుతాయో తెలీదు. అన్నీ పట్టుకెళ్ళడం మంచిది. రెండురోజుల క్రితం సింహాం సప్లై చేసిన సైలెన్సరున్న రివాల్వర్ని పాంటుజేబులో పడేసుకున్నాడు. తన కత్తిని అండర్ వేర్ కీ, పాంటుకీ మధ్య వుండేలా తగిలించాడు. స్క్రూ డ్రైవర్ని, స్కెలిటన్ కీని జేబులో దాచుకున్నాడు. తనకి అవసరమనిపించినవాటిని తీసుకోడం మరిచిపోలేదని రూఢి చేసుకుని, గదిలోంచి బైటికి నడిచాడు. తాళం వేసి, మెట్లవైపు అడుగులేశాడు. రిసెప్షన్ గుండా వెళితే అందరూ తనని చూస్తారు....

అయిదునిమిషాల తరవాత, మనోజ్ కారుని మెయిన్ రోడ్ మీదికి తిప్పాడు. మరో అయిదునిమిషాల తరువాత సర్కిల్ లో ఎడమవైపు తిరిగి కారుని నెమ్మదిగా తన గమ్యస్థానంవైపు పోనిచ్చాడు. విశ్రాంతి లేకుండా పరిశోధించి, తను యెక్కడికి వెళ్ళాలో ఆ రోజు సాయంత్రానికల్లా తను తెలుసుకోగలిగాడు.

జంబుకేశ్వరానికి దక్షిణవైపుగా బిల్డింగ్స్ వున్నాయి. విరూపాక్షరావు శిష్యుల్ని అతను యెక్కడేనా దాచివుండొచ్చు. హౌసింగ్ బోర్డు ఆఫీసులో అనుమానం రాకుండా సాగించిన ఎన్ క్వయిరీ మూలంగా ఆ బిల్డింగుల వివరాల్ని తను సంపాయించగలిగాడు. ఏ పనీ లేని నిరు

ద్యోగిలా తిరుగుతూ ఆ భవంతుల్ని తను ప్రదక్షిణాలు చేశాడు.

సిటీకి దూరంగా, ఇండస్ట్రియల్ ఎస్టేట్ లో వేర్ హౌస్ గా జంబుకేశ్వరం షిప్పింగ్ కంపెనీ ఉపయోగించే ఒక బిల్డింగ్ మనోజ్ దృష్టిని ఆకర్షించింది. అక్కడ వాళ్ళని దాచివుంచే అవకాశం బాగా కనిపించిందతనికి. విరూపాక్షరావు యిచ్చిన సమాచారం కూడా ఆ బిల్డింగ్ మీదే అనుమానం పుట్టించింది.

మనోజ్ కారుని సడెన్ బ్రేక్ తో ఆపాడు. కుడివైపు నుంచి దూసుకొస్తున్న లారీ వెళ్ళిపోయింది.

రిస్టువాచీ చూశాడతను. పన్నెండు కావొస్తోంది. మరో ఇరవై నిమిషాల్లో తను అక్కడుంటాడు.

మనోజ్ పాదం బ్రేక్ పెడల్ మీంచి పైకి జరిగింది. కారు కదిలింది.

తను ఏం చేయాల్సిందీ మరోసారి జాగ్రత్తగా బుర్రలో రిహార్స్ చేసుకుంటూ మనోజ్ కారుని సిటీ లిమిట్స్ దాటి పోనిచ్చాడు. రోడ్డుమీద ట్రాఫిక్ పూర్తిగా లేదు.

ఇరవై నిమిషాల తరువాత తను తిరగాల్సిన రోడ్డు చీలికను దాటి వేగంగా కారుని పోనిచ్చాడు మనోజ్. కిలోమీటర్ తరువాత రోడ్డు పల్లంలోకి ఏటవాలుగా దిగుతోంది

మనోజ్ కారుని స్లో చేసి, పూర్తిగా రోడ్డు అంచుకి పోనిచ్చి, కారుని వెనక్కి తిప్పాడు. హెడ్ లైట్స్ ఆర్పేసి, తను వచ్చిన రోడ్డుమ్మటే మెల్లిగా పోనిచ్చాడు. కాసేపట్లో తను దాటి వెళ్ళిన మలుపు సమీపించాడు.

కారుని రోడ్డువారగా ఆపి, కిందికి దిగాడు.

బోనెట్‌ని పైకెత్తి వుంచేశాడు. రోడ్డుపక్కనే పడున్న రాళ్ళని ఏరి, రోడ్డుమీద కారుపక్కగా వరుసగా వుంచాడు. టైర్లకింద రాళ్ళు పెట్టలేదతను. ఎవరేనా చూస్తే కారు ట్రబులిచ్చి ఆగిపోయిందనుకుంటారు....

జేబులోంచి తీసి, కత్తిని స్వెటర్ వెనకభాగంలో తను స్వయంగా కుట్టుకున్న హుక్‌లో, లోపలివైపు వుండేలా తగిలించాడు. జాగ్రత్తగా లాగితేగాని కత్తి రాదు.

తనకి కావాల్సిన భవనం రెండు ఫర్లాంగులదూరంలో నీడలా కనిపిస్తోంది.

మనోజ్ చీకట్లోకి చీలిపోతున్న రోడ్డుమీద చకచకా నడవసాగేడు. రోడ్డు తనని భవనం ముందుభాగానికి తీసుకెళ్తుంది. తను వెనకవైపుకి వెళ్ళాలి. మనోజ్ రోడ్డు వదిలేసి, బీడు ప్రదేశంమీద అడ్డుపడి నడవసాగేడు....

పదినిమిషాల్లో అతను వేర్‌హౌస్‌ని సమీపించాడు. ముందుభాగంలో లైటు వెలుగుతోంది. అక్కడ ఇరవై నాలుగ్గంటలూ ఆర్మ్‌డ్ గార్డు కాపలా వుంటాడని అతనికి తెలుసు. రాజమార్గంగుండా తను లోపలికి వెళ్ళలేడు! వెనక, దొడ్డిదారి లేదు. తను వెళ్ళాల్సిన, వెళ్ళగలిగిన మార్గం ఒక్కటే. మూడు అంతస్థులున్న భవనం పైకి చేరుకోవాలి, అక్కణ్ణుంచీ లోపలికి దిగాలి.... వెతకాలి....

మనోజ్ భవనం వెనకభాగంలో ఆగాడు. మిజోరంలో తను చేసిన డ్యూటీని గుర్తు చేసుకుంటూ బోర్లాపడుకున్నాడు. తలని పక్కకి తిప్పి, చెవిని నేలమీద ఆనించాడు. పచ్చగడ్డి అతని చెంపని తాకుతోంది. చెవిని ఆనించి ఏకాగ్రతతో వింటే భూమి దూరంలో పుట్టే

శబ్దాల్ని చేరవేస్తుంది.

అయిదు నిమిషాలపాటు మనోజ్ కదలకుండా వుండిపోయాడు. అనుమానం పుట్టించే శబ్దాలేవీ అతని చెవికి అందడంలేదు. తృప్తిగా తల కొంచెం పైకెత్తి, ముందుకి చూశాడు. ఇంతసేపూ మూసుకున్న కళ్ళు చీకటికి బాగా అలవాటు పడ్డాయి.

బిల్డింగ్ గోడని అంటిపెట్టుకున్న గొట్టం నల్లటి, పొడుగాటి గీతలా అవుపిస్తోంది. మనోజ్ కొండచిలువలా ముందుకి కదిలాడు. ముళ్ళతీగల కంచె కిందనుంచి, లోపలికి జాగ్రత్తగా తన శరీరాన్ని సరఫరా చేశాడు. కాసేపు పడుకునే వుండిపోయి, అటూ ఇటూ చూశాడు. మెల్లిగా లేచి భవనంవేపు వేగంగా నడవసాగేడు. రబ్బర్ సోల్స్ వున్న బూట్లు శబ్దం చేయవని అతనికి తెలుసు. వీపుని గొట్టందగ్గరగా గోడకి ఆనించి, తలతిప్పి భవనం రెండు మూలలా చూశాడు. ఎవరూ రావడంలేదు.

మనోజ్ కదిలాడు. రెండు చేతుల్తో గొట్టాన్ని పట్టుకున్నాడు. గుండ్రటి పోల్ని పట్టుకుని పైకి ఎగబాకే టెలిఫోన్ లైన్‌మన్‌లా చకచకా పైకి ఎగబాకడం ప్రారంభించాడు. జోరుగా వీస్తున్న చల్లటి గాలిని వెక్కిరిస్తూ అతని శరీరంమీద చెమట కమ్ముకొంది. చేతులు నొప్పెడుతున్నాయి. పదడుగుల దూరంలో, బిల్డింగ్ అంచుమీంచి ఆకారం అతనికి కనిపిస్తోంది. మనోజ్ ఉడుములా గొట్టాన్ని కరుచుకుని పాకుతూ వుండిపోయాడు.

సలుపుతున్న చేతుల వేళ్ళు అతన్ని త్వరగా డాబామీదికి చేరుకొమ్మని హెచ్చరిస్తున్నాయి. పట్టుదలతో మనోజ్ పైకి జరుగుతున్నాడు. మరో అయిదు నిమిషాల తర్వాత

కుడిచేతి వేళ్ళు భారం పిట్టగోడమీద ఆనుకున్నాయి. తనకి తెలీకుండానే అతను నిట్టూర్చాడు. డాబామీదికి గెంతేయాలన్న ఆత్రుతని కంట్రోల్ చేసుకుంటూ మనోజ్ ఎడమ చేతిని పిట్టగోడమీదికి ఆన్చాడు. మెల్లిగా తల పైకెత్తి, కళ్ళు గోడ లెవల్లో వుండేలా ఆగాడు.

మరుక్షణం మనోజ్ కిందికి జారాడు. అతని ఎడమ చెయ్యి ఆవేశంతో గొట్టాన్ని పట్టుకుంది.

* * *

డాబామీద, మెట్లపైన వున్న తలుపుముందు ఇద్దరు వ్యక్తులు కాపలా కాస్తున్నారు. వాళ్ళ చేతుల్లో వున్న తుపాకుల్ని చీకట్లో కూడా మనోజ్ పోల్చుకోగలిగాడు.

డాబామీద కాపలా వుంటుందని తను ఊహించలేదు! అకారణంగా, యిలాంటి కాపలా యేర్పాటు చేయబడదు! మనోజ్ గొట్టానికి బల్లిలా కరుచుకుని, ఆలోచిస్తూ చెవులు రిక్కించాడు. కాపలా వ్యక్తుల్లో ఒకతను దగ్గుతున్న శబ్దం వినిపించిందతనికి. బూట్ల చప్పుడు.

మనోజ్ మెల్లిగా పైకి కదిలాడు. తలని పిట్టగోడ పైకి చాపాడు. కాపలా వాళ్ళిద్దరూ తగ్గుస్వరంలో యేదో మాట్లాడుకొంటున్నారు. ఒకతను ఆగకుండా అటూ యిటూ తిరుగుతున్నాడు. నైట్ డ్యూటీ చేసే సెంట్రీలు అలా యెందుకు తిరుగుతారో మనోజ్ కి తెలుసు. నిద్రని దూరంగా వుంచటానికి అతను అలా తిరుగుతున్నాడు. తను గోడమీదికి యెక్కితే, ఆకాశం బ్యాక్ గ్రౌండ్ లో వాళ్ళకి స్పష్టంగా కనిపించే ప్రమాదం వుంది. ఏం చేయాలి?

పహారా చేస్తున్న వ్యక్తి తన అనుచరుడి ముందు ఆగాడు తుపాకీని భుజానికి వేళ్ళాడేసి, జేబులోంచి ఏదో తీశాడు. క్షణకాలం తరువాత యిద్దరి తలలూ దగ్గరగా వంగాయి. యెందుకి వంగాయో మనోజ్ కి తెలుసు!

అతను కటాలున, చేతుల బలంతో తన శరీరాన్ని పిట్టగోడమీదికి చేర వేశాడు. మరుక్షణం మనోజ్ శరీరం పిట్టగోడ వారగా, డాబామీదికి జారింది. మోకాళ్ళ మీదా, చేతులమీదా ఆనుకొని ముందుకు లంఘించడానికి తయారుగా వున్న చిరుతపులిలా క్షణకాలం ఆగాడతను. అతని కళ్ళు కాపలావాళ్ళవైపు చూస్తున్నాయి.

వాళ్ళ తలల మధ్య వెలిగిన అగ్గిపుల్ల ఆరిపోయింది. తలలు రెండూ దూరంగా జరిగాయి. మిణుగురు పురుగుల్లా వెలుగుతున్న సిగరెట్ కొసల్ని చూస్తూ మనోజ్ డాబా మీద పడుకున్నాడు.

అతని గుండె వేగంగా కొట్టుకుంటోంది. మనోజ్ నిశ్శబ్దంగా వొగురుస్తూ, పాములా జరిగాడు. ఎడమవైపున ఎత్తుగా నిలుచున్న వాటర్ టాంక్ అతని దృష్టిని ఆకర్షిస్తూ, తన చోటుకు రమ్మని అతన్ని ఆహ్వానిస్తోంది. ఆలస్యం చేయకుండా మనోజ్ అటువైపు పాకడం ప్రారంభించాడు. కాసేపట్లో వాటర్ టాంక్ వున్న చోటుకి చేరుకున్నాడు. టాంక్ పొడవునా అలాగే పడుకొని, కాసేపు విశ్రాంతి తీసుకుంటూ వుండిపోయాడు. కానీ, అతని మెదడు విశ్రాంతి తీసుకోడంలేదు ...

వేగంగా ఆలోచిస్తూ మనోజ్ వెల్లకిలా తిరిగాడు. వాటర్ టాంక్ పక్కగా, తనపైగా ఆకాశానికి గీసిన గీతల్లా కరెంట్ వైర్లు సాగిపోతున్నాయి. మనోజ్ లేచి

కూచున్నాడు. అటూ ఇటూ చూశాడు. టాంక్ పక్కగా గోడవైపున కుప్పగా పడున్న చెత్తా చెదారం అతని దృష్టిని ఆకర్షించాయి. ఏదో ప్లాను అతని బుర్రలో శరవేగంతో రూపొందుతోంది. కదలబోతూ మనోజ్ చెవులు రిక్కించాడు.

కాపలావాళ్ళు నవ్వుతూ యేదో లోకాభిరామాయణం మాట్లాడుకుంటున్నారు. మనోజ్ మెల్లిగా చెత్తకుప్ప వైపు జరిగాడు. చిన్నచిన్న డీల్‌వుడ్ బాక్సులూ, కొయ్యపలకలూ, వగైరా లీలగా అవుపిస్తున్నాయి. ఆశగా, నిశ్శబ్దంగా మనోజ్ చేతులు ఆ గుట్టలో దేని కోసమో వెతకసాగాయి. పదినిమిషాల్లో అతని శ్రమ ఫలించింది. చుట్టగా చుట్టి గిరాటేయబడిన సన్నటి కమ్మీ అతని చేతికి తగిలింది. కాసేపు తంటాలుపడి, చిందరవందరగా వున్న చెత్తలోంచీ కమ్మీ చుట్టను ఇవతలికి లాగాడతను. దాన్ని తన పక్కనే వుంచుకొని మనోజ్ మళ్ళీ తన చేతులకి పని కల్పించాడు.

మీటర్ బద్దలా పొడుగ్గా వున్న రెండు కొయ్య రీపర్స్‌ని ఇవతలికి లాగి, టాంక్ గోడకి అనుకుని మనోజ్ తృప్తిగా నిట్టూర్చాడు. ముందే ఎడంగా లాగివుంచిన డీల్‌వుడ్ పలకని, పీటలా తన కిందికి చేర్చుకున్నాడు.

చీకట్లో అతని చెయ్యి ముందుకి సాగింది. వాటర్ టాంక్ క్లీనింగ్ సమయంలో నీటిని పూర్తిగా ఖాళీ చేయడంకోసం అమర్చిన చిన్న గొట్టాన్ని కదిలాడు.

కటాలున నీళ్ళు ఇవతలికి ఉరికాయి. డాబా ఎటు వేపున వాలుగా వుందో తనకి తెలీదు. కాపలావాళ్ళున్న వైపుకి నీళ్ళు ప్రవహించాలని లోపల్లోపల ప్రార్థిస్తూ,

మనోజ్ తన పనిలో రెండో ప్రయత్నం ప్రారంభించాడు.

చుట్టగా వున్న ఇనపవైర్‌ని విప్పి, సాగదీశాడు. రెండు మీటర్లు వుండేలా కొయ్య రీపర్స్ రెండింటినీ జాయింట్ చేసి, పొడుగ్గా వుండేలా మరో వైర్ ముక్కతో కట్టేశాడు. రెండు మీటర్ల పొడవున్న కమ్మీని రీపర్ కొసకి ఆనించాడు. రీపర్ కమ్మీ మధ్యలో వుండేలా సర్ది, కమ్మీని దానికి గట్టిగా కట్టేశాడు. నిలువు ఆకారంలో తయారైన ఆయుధాన్ని తృప్తిగా చూశాడు. తనకి కావాల్సిన పరికరం తయారైంది. దాన్ని తన దగ్గరగా వుంచుకొని మనోజ్ విశ్రాంతిగా టాంక్‌కి ఆనుకున్నాడు.

నీళ్ళు డాబామీద పరుచుకుంటున్నాయి. టాంక్ నుండీ అటువైపుకి, కాపలావాళ్ళున్నవైపుకి నీళ్ళు మెల్లిగా పాకుతున్నాయి!

ప్రవహిస్తున్న నీళ్ళు కాపలావ్యక్తుల కాళ్ళకిందికి చేరుకున్నట్టు తెలుసుకోడానికి తను ప్రత్యేకంగా ప్రయత్నించనక్కర్లేదని మనోజ్‌కి తెలుసు. వాళ్ళ ఆశ్చర్యం, వాళ్ళ కంఠాలు—తనకి ఆ సంగతిని తెలియజేస్తాయి. అతను కాలాన్నీ, స్థలాన్నీ మరిచిపోయాడు. తను కూచున్న కొయ్యపలకమీదికి మరో రెండు పలకలు యెక్కించాడు, మెల్లిగా. 'నీళ్ళు తన కాళ్ళకి తగల కూడదు.

మనోజ్ ఉలిక్కిపడ్డాడు. ఆశ్చర్యంతో కాపలావ్యక్తి పెట్టిన సన్నటికేక అతనికి వినిపించింది. నీళ్ళు వాళ్ళకిందికి పాకాయన్నమాట! మనోజ్ ఆవేశంతో కదిలాడు. తను ఇంక క్షణకాలంకూడా ఆలస్యం చేయ

కూడదు!

అతని కుడిచెయ్యి మెరుపులా కదిలింది. రీపర్లకి బిగించిన కమ్మీ ఏటవాలుగా పైకిలేచింది. హై వోల్టేజి ఎలెక్ట్రిసిటీని మోసుకెళ్తున్న వైర్ని కమ్మీ కొస తటాలున తాకింది, మరోకొస డాబామీద ప్రవహించిన నీళ్ళని తాకింది. అప్రయత్నంగా మనోజ్ కళ్ళు మూసుకున్నాడు.

'ఫట్'మంటూ చప్పుడైంది. ఏదో మెరుపులా మెరిసింది. మనోజ్ చెయ్యి కదిలింది. మరేదో శబ్దం అతని చెవుల్ని తాకింది. తుపాకులు కిందపడుతూ చేసిన శబ్దం! మనోజ్ రీపర్ని వదిలేశాడు. నిర్భయంగా ముందుకి గెంతాడు. కాపలావాళ్ళున్న వైపుకి జోరుగా నడిచాడు. రెండు ఆకారాలు కుప్పలుగా పడున్నాయి. కాళ్ళకింద కొయ్యపలకలు లేకపోతే, తనుకూడా వాళ్ళలాగా నిర్జీవంగా పడుండేవాడే!

నిమిషంలో మనోజ్ వాళ్ళిద్దర్ని లాక్కెళ్ళి వాటర్ టాంక్లో పడేశాడు. నీళ్ళ ప్రవాహాన్ని ఆపేశాడు. రెండు తుపాకుల్నీ టాంక్ గోడకి ఆనాడు ఆవేశంతో రొప్పుతూ తలుపుముందు నిలబడ్డాడు. వణుకుతున్న చేత్తో గొళ్ళెం తడిమాడు. తాళం వేయలేదు! గొళ్ళాన్నిలాగి, తలుపుని తోశాడు. శబ్దం కాకుండా తలుపు తెరుచుకుంది.

వెలుతురు సన్నగా మెట్లకిందినుంచీ కనిపిస్తోంది. తన అడ్వెంచర్ మూలంగా కరెంట్ ఎందుకు పోలేదా అని ఆలోచిస్తూ, మనోజ్ రెండు మెట్లు దిగాడు. తలుపుని ముందుకు తోసి, మెట్లు దిగసాగేడు.

• • •

చివరి మెట్టుమీద మనోజ్ తటాలున ఆగి, గోడ

వారంగా జారిగాడు. ఏదో చప్పుడు అతని చెవుల్ని తాకు తోంది. సన్నటి మూతివున్న బిందె నీళ్ళల్లో మునుగుతూ చేసే చప్పుడు.

తలని ముందుకు చాచి చప్పుడు వస్తున్నవైపు చూశాడు మనోజ్. కప్పునుంచి వేళ్ళాడు తున్న 40 వాట్ల బల్బు కాంతిలో రెండు బూట్లు అతనికి కనిపించాయి. మడమలమీద ఏటవాలుగా నిలబడ్డ బూట్లు. పాదాల ఆధారంతో అలా వున్నాయని అతను గ్రహించాడు.

మనోజ్ తల మరికొంచెం ముందుకి సాగింది. నలిగిపోయిన పాంటులో దూరిన రెండు కాళ్ళు, బార్లా సాగి కనిపిస్తున్నాయి. గార్డు విశ్రాంతిగా కూచుని నిద్రపోతున్నాడు. తన చెవుల్ని తాకుతోన్న శబ్దం అతని గురక అని మనోజ్ కి క్షణంలో అర్థమైంది. మనోజ్ అటూ ఇటూ చూశాడు. పెద్ద హాలు. ఖాళీగా వుంది. కిటికీలూ, వెంటిలేటర్లూ మూయబడ్డాయి. అతడు పిల్లిలా కదిలాడు.

సన్నటి నడవ ముందు, స్టూలుమీద కూచుని గార్డు నిద్రపోతున్నాడు. అతనిలాగే, అతని తుపాకీ కూడా గోడకి జార్లాబడివుంది. మనోజ్ గాలిలో అడుగు లేస్తున్నట్టు కదిలి అతని పక్కగా, గోడవార ఆగాడు. గార్డు తల కిందికి వాలింది. గెడ్డం ఛాతీమీద ఆనింది. అంగుళం పొడవున్న గెడ్డంమీద, గురకపెడ్తూ అతను కార్చుతున్న చొంగ తెల్లగా మెరుస్తోంది.

మనోజ్ రివాల్వర్ని ఎడమ చేతిలోకి మార్చుకున్నాడు. అతని కుడిచెయ్యి మెల్లిగా ముందుకు సాగింది.

## "ముఖచిత్ర వ్యాఖ్యల పోటీ"

ఈ నెల "సప్లిమెంట్" ముఖచిత్రాలు (అట్టమీది బొమ్మ, అట్టచివరి బొమ్మ) పరిశీలించండి. రెండు ముఖచిత్రాలకు సంబంధం వుండేటట్లుగా ఒక్క మాటలో గాని, చిన్న వాక్యంలో గాని, పోస్టుకార్డుపై వ్రాసి, ఈ నెల 5 వ తేదీలోపు మాకు చేరేటట్లు పంపండి.

'హోమ్ డెలివరీ' సభ్యులు తమ పూర్తి చిరునామాతో పాటు, తమ నెంబర్ కూడా వ్రాయాలి.

మాకు వచ్చిన వ్యాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు ఏడాది పాటు పత్రిక లేదా సప్లమెంట్ బహుమతిగా పంపుతాము.

## "హోమ్ డెలివరీ"

'హోమ్ డెలివరీ' సభ్యులకు 'అపరాధ పరిశోధన' పత్రిక మరియు సప్లిమెంట్ కాపీలు వాటి అసలు ధరకే అందజేయబడతాయి. అంతేకాదు - వారికి పత్రికలను ప్రతి నెలా రిజిష్టరు లేదా బుక్ పోస్టులో పంపుతాము.

ప్రతి 6 నెలలకు ఒకసారి అంటే - జనవరి మరియు జూలై నెలల పత్రికలు మాత్రం V. P. ద్వారా పంపబడతాయి— దానికి మీరు అర్థ సంవత్సర చందా రు. 84/-లు చెల్లించవలసి వుంటుంది. పోస్టు ఖర్చులన్నీ మేమే భరిస్తాము. పత్రికల ఖరీదుకు మించి మీరు పైసా చెల్లించ నవసరంలేదు.

'హోమ్ డెలివరీ' వల్ల పత్రికలు మీకు మరింత త్వరితంగా, గ్యారంటీగా అందుతాయి. ఇంకా నెలనెలా V. P. ద్వారా తెప్పించుకునే సౌకర్యంకూడా వుంది.

మరి - మీరు చేయవలసిందల్లా వెంటనే రు. 10/-లు పంపి శాశ్వతంగా 'హోమ్ డెలివరీ' సభ్యులుగా చేరటమే.

పూర్తి వివరాలకై 'అపన' చూడండి!

చూపుడు వేలూ, నడిమి వేలూ గార్డు చెవికింద ఆగాయి. ఏ నరాన్ని ఎంత వొత్తిడితో నొక్కాలో, ఆర్మీ అతడికి నేర్పింది. అతని చేతికండరాలు కదిలాయి. వేళ్ళు గార్డు చెవికింది నరాన్ని బలంగా నొక్కాయి. అతని తల కొద్దిగా కదిలింది. గురక ఆగిపోయింది.

గార్డు మరో అరగంటదాకా లేవడు. లేచాక, తనకి ఏం జరిగిందో వూహించలేడు! మనోజ్ నవ్వుకుంటూ నడవమ్మట అడుగులు వేయసాగాడు.

హాల్లోని లైటు నడవలో సగందాకా వెల్తుర్ని సరఫరా చేస్తోంది. తరవాత చీకటి. ఈ నడవగుండా తనెక్కడికి వెళ్ళాలి? ముందు కూచోన్న గార్డు దేనికో, యెవరికో కాపలా కాస్తున్నాడు! నడవ చివరికి వచ్చేసరికి మనోజ్ సందేహం తీరింది. మలుపుతిరిగిన నడవ చివర తలుపుముందు మరో గార్డు కూచున్నాడు. మొదటి గార్డులాగా అతను నిద్రపోవడంలేదు! అతని నోట్లో వెలుగుతున్న సిగరెట్ మనోజ్ కి ఎర్రగా అవుపించింది. అతను తటాలున గోడచాటుకి తప్పుకున్నాడు.

గార్డు మెలకువగా వున్నాడు. తనిప్పుడేం చేయాలి? సావధానంగా ఆలోచించే అవకాశంలేదు. రెండో గార్డు కూచున్నచోట లైటు లేకపోవడం తనకి కొంత వుపయోగిస్తుంది. సైలెన్సర్ వున్న రివాల్వర్ తో క్షణంలో అతన్ని శవంగా మార్చొచ్చు. ఇప్పటికే తను ఇద్దర్ని ఎలెక్ట్రొక్యూట్ చేశాడు! మనుష్యుల్ని చంపడం, అందులో అజాగ్రత్తగా వున్న వాళ్ళని చాటునుండీ చంపడం యెందుకో అయిష్టంగా అనిపిస్తోందతనికి.

అతను తన రాకని పసిగట్టేలోగా పదడుగులు వెళ్ళ

గలిగితే చాలు; తను అతన్ని సమీపించగలడు. రెప్పపాటులో అతని నోరు నొక్కగలడు, తాత్కాలికంగా.
మనోజ్ కొంచెం ముందుకి జరిగాడు. గార్డు సిగరెట్ ని పొడుగ్గా లాగాడు. మనోజ్ నవ్వుకున్నాడు. ఆఖరి దమ్ము. మెరుపులా కదలడానికి వడమల్ని పైకెత్తి సిద్ధంగా వున్నాడు మనోజ్.

మనోజ్ మెరుపులా కదిలాడు. గార్డు కిందికి వొంగి సిగరెట్ పీకని నేలమీద నొక్కుతున్నాడు. నాలు గంగల్లో మనోజ్ అతన్ని సమీపించాడు.

మెత్తటి శబ్దం గార్డుని ఆకర్షించింది. అతని తల చివాల్న పక్కకి తిరిగింది. గోడకి ఆనివున్న గన్ వైపు అతని చెయ్యి దూసుకెళ్ళింది. వేళ్ళు గన్ ని పట్టుకునేలోగా మనోజ్ చేతిలోని రివాల్వర్ కొన అతని కణతను తాకింది.

"చెయ్యి తీసెయ్! కదలకు!" మనోజ్ తగ్గుస్వరంలో హెచ్చరించాడు. గార్డుకి రివాల్వర్స్ తో మంచి పరిచయం వున్నట్టుంది. అతని చెయ్యి గన్ నుండి దూరంగా జరిగింది.

"చేతులెత్తు!" మనోజ్ ఆజ్ఞాపించాడు. గార్డు చేతులు పైకి లేచేలోగా, అతని చెయ్యి కదిలింది. చెవి కింది నరం మనోజ్ వేలికింద నలుగుతోంది. ఒకవైపు కణతమీద రివాల్వర్, మరోవైపు బలమైన మనోజ్ చెయ్యీ గార్డు తలని కదలకుండా చేశాయి. గార్డు చేతులు తోటకూర కాడల్లా కిందికి వాలాయి.

మనోజ్ అతని తలని గోడకి ఆనించాడు. చకచకా అతని జేబులు వెతికాడు. ప్యాంటు జేబులో దాగిన తాళంచెవిని తీసుకున్నాడు. నడవ మూలలో వున్న తలుపు తాళం తెరిచాడు. చిక్కటి చీకటి అతనికి

స్వాగతం చెప్తోంది.

మనోజ్ అడుగు ముందుకి వేశాడు. అతని బూటు అరడుగు కిందికి దిగింది. మెట్లు! గోడతడుముతూ, అతడు మెల్లిగా మెట్లు దిగసాగేడు. పది మెట్ల తరవాత, సమతలంగా వున్న నేల అతని కాళ్ళకి తగిలింది. జేబులోంచి పెన్ టార్చి తీశాడతను. టార్చిని తన శరీరానికి దూరంగా వుంచి స్విచ్చి నొక్కాడు. అదేక్షణంలో అతని కుడి చేతివేలు రివాల్వర్ సేఫ్టీ కాచ్‌ను రిలీజ్ చేసింది. మనోజ్ గుండె వేగంగా కొట్టుకుంటోంది. పెన్ టార్చి ఇంకా వెలుగుతూనే వుంది. ఏ రివాల్వర్ పేలలేదు. అంటే, గదిలో గార్డులు లేరన్నమాట!

మనోజ్ ధైర్యంగా టార్చికాంతిని గదిలో ఫోకస్ చేస్తూ చూడసాగేడు. కుడివైపు గోడమీద కాంతి ఆగింది. అరడుగుల ఎత్తులోంచి రెండు ఎర్రటి కళ్లు నెత్తురుబొట్లలా అతనివేపు చూస్తున్నాయి. ఆ ఎర్రదనంలో ఏదో భయం కొట్టొచ్చినట్టు కనిపిస్తోంది. పొట్టిగా, గుబురుగా పెరిగిన గడ్డం. మనోజ్ తృప్తితో అతన్ని పోల్చుకున్నాడు. ధర్మరాజు!

"ధర్మరాజా!" టార్చిని అలాగే వుంచుకుని అతని దగ్గరగా నడుస్తూ మెల్లగా పిలిచాడు, మనోజ్. ధర్మరాజా మాట్లాడలేదు. కానీ ఆశ్చర్యం అతని కంఠంలో రొప్పులాగా ధ్వనించింది.

మనోజ్ టార్చిని తలుపువైపు తిప్పాడు. గోడకి స్విచ్ వుంది. గబగబా వెళ్ళి అతను స్విచ్చిని కిందికి నొక్కాడు. 40 వాట్ల బల్బు వెలిగింది. అతను ధర్మరాజుని పరిశీలనగా చూశాడు.

(సశేషం)

